చతుర

ఏప్రిల్ 1982

# ఈ నెల సమగ్ర నవల

అతను అన్నివిధాలా ఉత్తముడు ఇంకా చదువుకుంటున్నాడు. పొరుగింటి అమ్మాయిని గాఢంగా ప్రేమించాడు, ఆఅమ్మాయీ అంతకన్నా గాఢంగా ప్రేమించింది. త్వరలో 'తల్లి' కూడా కాబోతోంది. అలాంటి క్షణాల్లో అతను మరొకర్ని ఎలా వివాహమాడగలిగాడు? ఆ తర్వాత గర్భిణీగా ఉండగానే భార్యను దారుణంగా ఎలా హత్యచేయగలిగాడు? అవన్నీ కూడా కేవలం....

# క్షణికం

...గా, తాత్కాలికోద్రేకంలో జరిగినవేనా? ఈ జీవితంలో ఏది క్షణికం...మరేది కాదు...?

జి. ఆర్. ప్రభాకర్

రసవత్తరంగా చిత్రించిన యదార్థ జీవన దృశ్యం 'క్షణికం' ఈ నెల చతుర సమగ్ర నవల.



సంచిక :
సంపుటి :

ముఖచిత్రం : ఎస్. శివన్నారాయణ

రెండవ కవరు : పి.ఐ.బి., న్యూఢిల్లీ

మూడవ కవరు : కె. రాజేంద్రప్రసాద్

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

**చతుర**

ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ - 500 004.

# మహాబలుడు దారాసింగ్ అంటున్నారు:
# "బలంగా ఎదగండి, న్యూట్రమూల్ మొనగాడవండి."




ప్రసిద్ధ మల్లయుద్ధ వీరుడు దారాసింగ్ అభిమానాన్ని న్యూట్రమూల్ చూరగొందంటే ఆశ్చర్యం ఏముంది? అమూల్ వారి న్యూట్రమూల్‌లో శరీర ఆరోగ్యానికి, బలానికి కావలసిన ఎన్నో పోషక తత్వాలు పుష్కలంగా ఉన్నాయి – అతి శ్రేష్ఠమైన మాల్ట్, రుచికరమైన కోకో, మీగడ కట్టిన అమూల్ పాలు, శక్తితో నిండిన ప్రొటీన్లు, విటమిన్లు, ఖనిజ పదార్థాలు. పైగా, న్యూట్రమూల్ రుచి కూడా అద్వితీయం! ఇవన్నీ కూడా బోర్న్‌విటా, బూస్ట్, మాల్టోవాల కంటే ఎంతో తక్కువ ధరకే!




మార్కెట్ చేయువారు:
**గుజరాత్ కో-ఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్ ఫెడరేషన్ లి.**
ఆనంద్ 388 001 గుజరాత్

deCunha/GCM/43/TL/82

# డిష్యుం...డిష్యుం

చతుర

సినిమాల్లో ఓ ఫైటింగ్ సీన్ తీయాలంటే దర్శకుడు, ఫైటింగ్ మాస్టరు, కెమేరామన్, లైట్లు, సెట్టింగ్ వగైరా వగైరా హంగులన్నీ కావాలి. జంతువులచేత ఏ ఫీట్ చేయించాలన్నా ముందు వాటిని మచ్చిక చేసుకుని మంచి శిక్షణనివ్వాలి. కానీ ఇవేవీ లేకుండా ఉచితంగా గొప్ప థ్రిల్లింగ్ ఫైటింగ్‌సీన్ చూసే అదృష్టం అమెరికా జంతుప్రదర్శనశాల సిబ్బందికి కలిగింది ఆమధ్యన. అమెరికాలోని 'జూ'లు కొన్ని వేల ఎకరాల విస్తీర్ణంతో, విశాలంగా వుంటాయి. ఒక్కో జూలో ఏడెనిమిది వేల దాకా జంతువులుంటాయి. సాయంత్రం ప్రదర్శన సమయం అయ్యాక ఇతరులెవ్వరూ లోపల లేకుండా చూసుకుని, జంతువులని సరిచూసుకుని నిద్రకుపక్రమించడము అక్కడి సిబ్బంది దినచర్యలో ఆఖరి భాగం.

అలాగే ఆరోజు కూడా చీకటిపడింది. అంతవరకు నిద్రపోతున్న కొండచిలువ కళ్ళుతెరిచి చూసి తన బోను తలుపులు తెరిచి వుండడంచూసి స్వేచ్ఛావాయువులు పీల్చుకుని వద్దామని మెల్లిగా పాక్కుంటూ బైటికి వచ్చి ఉబుసుపోక ఎదురుగావున్న బోనులోకి దూరింది. పదహారడుగుల పొడవు, అంతకు తగ్గ లావు వున్న కొండచిలువ తన బోనులోకి వస్తుంటే సరదాగా చూస్తూ పడుకుంది అందులోని గొరిల్లా. బలిష్ఠంగా ఆరడుగుల పొడవున్న గెరిల్లాను తింటే గొంతుకడ్డం పడుతుందని గ్రహించి చటుక్కున గెరిల్లా శరీరాన్ని గట్టిగాచుట్టేసింది కొండ



చిలువ. గెరిల్లాకు నిద్రమత్తు వదిలేటప్పటికి సమయం మించిపోయింది.

చెవులు చిల్లులు పడేలా వినిపిస్తున్న గెరిల్లా అరుపులు, కొండచిలువ బుసలువిని వులిక్కిపడి లేచి వాచీలు చూసుకున్నారు జూ సిబ్బంది. అర్ధరాత్రి అవుతోంది. ఏం చేయాలోతోచక గబగబాలైట్లేసి బోను దగ్గరకి వచ్చిచూస్తే ఏముంది? గెరిల్లా, కొండచిలువహోరాహోరిపోరాటం. కొండచిలువపట్టు బిగించినకొద్దీగెరిల్లా పిచ్చెక్కి

# ప్రపంచం



సట్టు బోసుగోడలకేసి బాదుకుంటోంది. కిందపడి దొర్లుతోంది. జూ సిబ్బందికి ఏంచేయాలో పాలుపోలేదు. బోనుతెరచి రెండు జంతువుల్ని వేరు పరచడానికి ధైర్యం చాలడం లేదు. అవి వున్న పరిస్థితిలో బోనుతలుపులు తెరిస్తే పరిస్థితి మరింత విషమించవచ్చునని ఆ ఉద్దేశం మానుకుని కళ్ళార్పకుండా వాటిపోరాటం చూస్తూనిలబడ్డారు. అవిచేసే హంగామాకి, అరుపులకి ఇతరజంతువులుమేల్కొనిగొడవ గొడవగా అరవడం మొదలెట్టాయి. భయానకంగా వున్న ఆ సమయంలో కాళ్ళూ చేతులూ చల్లబడుతున్నా పళ్లు గిట్ట కరుచుకుని వుండిపోయారు జూసిబ్బంది.

గొరిల్లా, కొండచిలువ మధ్య పోటీ తారస్థాయి నందుకుంది. బోను వూచల దెబ్బలు తగిలి కొండచిలువ ఎముకలు విరిగి,రక్తనాళాలు దెబ్బతిన్నాయి. కొండచిలువ పట్టుకి గొరిల్లాకి వూపిరాడక శ్వాసనాళం నొక్కుకుపోయింది. 35 నిమిషాలపాటు జరిగిన ఆ యుద్ధంలో అలిసిపోయిన రెండు జంతువులూ ఒకదాని తర్వాత ఒకటి మరణించాయి. ఆ తర్వాత చాలా రోజులు ఖాళీగా వున్న ఆ రెండు బోన్లను చూసినప్పుడల్లా ఆనాటి సంఘటన గుర్తొచ్చి సిబ్బంది ఒళ్ళు జలదరించేదని ఇప్పటికీ కథలుగా చెప్పుకుంటారు.

## దిగంబరన్

ఆధునిక కాలంలో మనుషుల మనస్తత్వాల్లాగే వాళ్ళ జబ్బులు కూడా అంతు పట్టడం లేదు. అందులో ఎలర్జీ ఒకటి. కొందరికి పువ్వులంటే పడదు. కొందరికి నవ్వులంటే పడదు. కొందరికి నూనె పడదు. కొందరికి నెయ్యి పడదు. అన్నింటికంటే చిత్రమేమిటంటే కేరళలోని కోజికోడ్ జిల్లాలోని కుట్టివాడి గ్రామవాసి 'మమ్మూ'కి బట్టలంటే ఎలర్జీ.

చిన్నపిల్లలు బట్టలిప్పుకుని ఇంట్లో తిరిగినట్లు మమ్మూ దిగంబరంగా ఆడ శూలీలతో సమంగా పొలాల్లో పనిచేస్తాడు. పెళ్ళిళ్ళకి, పార్టీలకి వెళతాడు. స్నేహితులతో పేకాట ఆడతాడు. బజారు పన్లు

చేసుకోడం ఒకటేమిటి సమస్తం చేస్తాడు. ఒక్క ఆగంతకుల ముందు తప్పితే గ్రామస్థులెవరి ఎదుటా అలా తిరగడానికి బిడియపడేవాడు కాదు.

బ్రహ్మచారి అయిన మమ్మూ అందరి ఇళ్లకీ వెళ్ళివస్తూ వుంటాడు అందరిలాగే. ఏ కుటుంబీకులైనా బట్టలేకుండా అతను తమింటికి రావడానికి వీల్లేదని అభ్యంతర పెడితే మాత్రం మళ్లీ ఆ గడప తొక్కేవాడు కాదు.

గ్రామస్థుల కోరిక మీద పట్నంనుంచి ఓ డాక్టర్ల బృందం వచ్చి మమ్మూను పరీక్షించింది. వారి ముందు ఏమాత్రం బిడియపడకుండా ఆడవారిని చూస్తే తనకెటువంటి ఉద్రేకము, దురాలోచన కలగవని, స్త్రీపురుషులు తనకి సమానమేనని నిర్భయంగా చెప్పేశాడు. వైద్యులు చేసేదేం లేక గ్రామస్థుల వద్ద శలవు తీసుకున్నారు.

బట్టల విముఖత మమ్మూకి నాలుగేళ్ళ ప్రాయంలోనే ప్రారంభమయింది. ఆ వయసులో ఓసారి తల్లితో కుట్టివాడి నదిలో పడవలో వెళుండగా వున్నట్టుండి ఎంతో అసహనంగా ఫీలయ్యాడు. నదిమీద నుండి చల్లనిగాలి వస్తున్నాగాని వున్నట్టుండి ఒళ్ళంతా చమటలు పట్టేసింది. వాళ్ళమ్మ ఆశ్చర్యపోతూ చొక్కా, లాగూ విప్పేసింది. వెంటనే కొద్దిక్షణాల్లో మామూలుగా అయిపోయాడు మమ్మూ. ఆనాటి నుండి మళ్ళీ ఒంటిమీద బట్టపెట్టి ఎరగడు మమ్మూ. కొన్నాళ్ళ కిందట కొంతమంది బలవంతంగా అతనికి బట్టలు తొడిగితే స్పృహ తప్పి పడిపోయాడు.

మమ్మూ పెద్దయ్యే నాటికి తల్లిదండ్రులు పరమపదించారు. ఉన్న ఒక్క తమ్ముడు, పెళ్ళయిన చెల్లెలింటికి ఎన్నడూ వెళ్ళడు. తాళంచెవి గొలుసులో వేలాడే పెన్నులాంటి కత్తి ఎప్పుడూ తన దగ్గరుంచుకుంటాడు.



దుస్తులు ధరించకపోవడం తప్ప మిగతా పనన్నీ అందరిలాగే చేసుకుంటాడు. రోజూ స్నానం, గడ్డం చేసుకోవడం, నీటుగా తల దువ్వుకోవడం, సెంటురాసుకుని విలాసంగా సిగరెట్ కాల్చడం యధావిధి. ఔరా!

# శునక సహాయం

శతకోటి దరిద్రాలకి అనంతకోటి ఉపాయాలన్నట్లు తల్చుకోవాలే గాని తప్పుదార్లకు కొదువ లేదు. ఉత్తరప్రదేశ్ లోని అదాంగర్ జిల్లాలోని ఓ హైస్కూల్ సెంకడరీస్కూలు విద్యార్థి తరుము

కొస్తున్న పరీక్షల బారినుండి రక్షించమని ఓ శునకరాజును శరణుజొచ్చాడు. ఎంత చదివినా ఒక్క అక్షరం ముక్క కూడా బుర్రలో కెక్కడంలేదు. అందుకని పరీక్ష హాల్లో తాపీగా కాపీ కొట్టడానికి నిశ్చయించుకున్నాడు సుఖియారామ్.

అరవకుండానే కరిచేలా భయంకరంగా వున్న తన పెంపుడు అల్సేషియన్‌డాగ్‌ని పరీక్ష రోజున చాలాముందే స్కూలుకి తీసుకెళ్ళి తన బెంచీకింద దాచి వుంచాడు. యజమాని చెప్పినట్లు వినడం బాగా అలవాటయిన ఆ కుక్క బుద్ధిగా బెంచీకింద



ఒదిగి కూర్చుంది. పరీక్ష ప్రారంభమయ్యే సమయానికి తక్కిన విద్యార్థులతో బాటు సుఖియారామ్ కూడా గప్‌చుప్‌గా పరీక్ష హాల్లోకొచ్చి కూర్చున్నాడు. ఎదురుగా పాఠ్య పుస్తకాలు, గైడ్లు పెట్టుకుని బరాబరా కాపీ కొట్టడం మొదలెట్టాడు. పరీక్ష అధికారులు దగ్గరికివచ్చినపుడల్లా కుక్కని చేత్తో తట్టేవాడు. యజమాని వుద్దేశాన్ని అర్థం చేసుకుని కుక్క ఎటెన్షన్లో నిలబడి పరీక్షాధికారికేసి గుర్రుగా చూసి బెదిరించేది.

పరీక్షాధికారులేంచేయలేక ప్రిన్సిపాల్‌కి మొరబెట్టుకున్నారు. ఆయన హుటాహుటిన వచ్చి తన చేతికర్రతో దాన్ని తరిమికొట్టబోయి భంగపడ్డాడు. కుక్క ఒక్క ఎగురు ఎగిరి ఆయన చేతిలోని కర్రను నోటకరుచుకుని వెళ్ళి సుఖియారామ్ పక్కన కూర్చుంది విలాసంగా.

ఆ తర్వాత ఫ్లైయింగ్ స్క్వాడ్‌లోని కొందరు పరీక్షాధికారులు దాన్ని పట్టబోతే అందులో ఒకతని మీదకురికి షర్టు,పాంటు చింపి పోగులు పెట్టింది. పాపం అతను దెబ్బకి భయపడి ఇంటికి పరుగు లంకించుకున్నాడు. ఇదంతా చూసి మతిపోయిన ప్రిన్సిపాల్ స్థానిక పురపాలక సంఘం వారికీ, పోలీసులకీ ఫోన్లుచేసి వారికి స్వాగతం చెప్పడంకోసం స్కూలుగేట్లోనే బైఠాయించాడు. ఈలోపల సుఖియా తన 'కాపీ'పనిని నిర్విఘ్నంగా కొనసాగిస్తూనే వున్నాడు.

అర్థగంటలో మునిసిపాలిటీ 'డాగ్ కాచింగ్ స్క్వాడు' వాను, పోలీసువాను రెండూ రయ్యిన ప్రిన్సిపాల్ పక్కనించి దూసుకొని వచ్చి స్కూల్ కాంపౌండులో ఆగాయి. మున్సిపాలిటీవారు కుక్కను వానులో ఎక్కించడం కంటే, సుఖియాను పోలీసువ్యాన్లోకిఎక్కించడానికి **పోలీసులు** ఎక్కువ కష్టపడాల్సి వచ్చింది. ఈ కాలపు పిల్లలు సిసింద్రీలనడానికి ఇంత కంటే వేరే నిదర్శనం ఏం కావాలి చెప్పండి!

# గిల్లెట్ గారు

నాగరికత నేర్చిన మానవుడు అన్నింటితో పాటు అందంగా కనబడడం కోసం కూడా పోటీ పడేవాడు. అందులో క్షౌరం ఒకటి. పూర్వం గడ్డం నున్నగా వుండాలని క్రాపుతో బాటు గడ్డంకూడా చేయించుకునేవారు. అందుకు సాధనం మంగలికత్తి ఒకటి. తర్వాత మెల్లిమెల్లిగా రేజర్ వంటి సాధనం వచ్చింది. దీన్ని 1762లో జీన్ జాక్వెస్ అనే ఫ్రెంచి దేశస్థుడు కనిపెట్టాడు. కానీ ప్రస్తుతం వాడుకలో వున్న బ్లేడు, రేజర్లకి తొలిరూపం 1880లో అమెరికాలో పుట్టింది. నాలుగైదుసార్లు వాడిన తర్వాత తోలు పట్టీమీద పదును పెట్టి మరికొన్నాళ్ళు వాడి ఆ తర్వాత చెత్తలో విసిరేయవల్సి వచ్చేది దాన్ని.

ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ఆ రేజర్‌తో విసిగిపోయిన ఓ అమెరికా వ్యాపారవేత్త గడ్డాన్ని అతి తక్కువ సమయంలో, తక్కువ ధరతో చేసుకోడానికి వీలయ్యే పనిముట్టును కనిపెట్టాలనీ, అదికూడా తక్కువ బడ్జెట్‌తో తయారు చేసేందుకువీలుగా వుండాలన్న వుద్దేశంతో పథకాలు వేయడం ప్రారంభించాడు.

1895లో ఓసారి అతనుపాత రేజర్‌తో గడ్డం గీసుకుంటూవుండగా హఠాత్తుగా ఓ మంచి ఆలోచన తట్టింది. కాగితం, కలం తీసుకుని ఎన్నోరకాల ప్రయోగాలు చేసి చూశాక చిట్టచివరకి ఇపుడు వాడుకలో వున్న బ్లేడు నమూనాను తయారుచేశాడు. కానీ ఆర్థిక ఇబ్బందుల వల్ల అనుకున్నంత తొందరగా పనిని చేపట్టలేకపోయాడు. అతను అనుకున్న ప్రకారం బ్లేడుతయారు చేయాలంటే సన్నని, పల్చని, మృదువైన 'స్టీలు' అవసరం. దానికి డబ్బు ఖర్చవుతుంది. సాంకేతిక నిపుణులు కూడా కావాల్సి వస్తారు.

ఆ సమయంలో నికర్‌సన్ అనే ప్రముఖ సాంకేతిక నిపుణుడు ఫ్యాక్టరీ పనంతా తను సొంత బాధ్యతతో చూసుకుంటానని ముందుకు వచ్చాడు. ఇద్దరూ కూడబలుక్కుని ఓ ధనవంతుని వద్దకు వెళ్ళి తమ ప్లాను, రాబోయే బ్లేడు నాణ్యత, దానిమీద వచ్చేలాభం గురించి విశదీకరించారు. అలా చేయడం వల్ల అమెరికన్లకి ఎంత మేలోకూడా తెలియబర్చారు. అందు



కతను ఒప్పుకుని కావల్సినంత డబ్బు ఇస్తానని మాటిచ్చాడు.

దానితో నిమిషాల మీద ప్రాజెక్ట్ పని ప్రారంభమైంది. 1903లో స్థాపించిన ఆకంపెనీలో మొట్టమొదట 51 రేజర్లు,168 బ్లేడులు తయారుచేశారు. అనుకోని లాభాలు, గిరాకీలు వచ్చిపడ్డాయి. 1908 నాటికి 14వేల రేజర్లు, 3లక్షలబ్లేడ్లుతయారు చేసేస్థాయికి వచ్చింది.ఇంతకీ ఆ అమెరికా శాస్త్రవేత్త గిల్లెట్. అతని కంపెనీ పేరు గిల్లెట్ కంపెనీ. ప్రపంచం మొత్తం మీద నాణ్యమైన బ్లేడ్లుగా చెలామణి అవుతున్న గిల్లెట్ బ్లేళ్లు, రేజర్లు అతని చలవేనన్న మాట.

తెల్లగా తెల్లారింది.

శాంతి రామాలయం ముందు కసవు చిమ్మి కల్లాపి చల్లింది. అందంగా గుడి ముంగిట ముగ్గులు తీర్చింది.

తర్వాత—

గర్భగుడిలోని దేవుడికి భక్తిగా పూజ చేసింది.

వంట చేసి పొలానికి వెళ్ళాలి. అందుకని వెంటనే ఆ కార్యక్రమంలో పడింది.

"ఏం చేస్తున్నావు శాంతీ?" అంటూ ఉదయాన్నే పలకరించింది ఉమ వస్తూనే.

"వంట చేసుకొంటున్నాను. రారా! కూర్చో" అంది ఆప్యాయంగా.

"ఏం కాలేజీకి వెళ్ళవా?"

"వెళ్ళను, పొలానికి వెళ్ళాలి"

"పొలం వెళ్ళి నువ్వేం చేస్తావు" ఆశ్చర్యపోయింది ఉమ.

"ఏం చేస్తానా? పని! పని చేస్తాను" అంది శాంతి నవ్వుతూ.

"ఏ పని?"

"గడ్డి తియ్యాలి"

"మీ నాన్న చెయ్యలేడా ఆ పని?"

"ఎందుకు చెయ్యలేడు? కాని వూళ్లో లేరాయన. పక్క పల్లెలో ఎవరిదో పెళ్ళంటే చీకట్నే వెళ్ళిపోయారు" అంది.

"నేనూ పొలం వెళ్ళాలి. మా పొలానికి గట్లు కొడుతున్నారు మావాళ్లు. వాళ్ళందరికీ భోజనాలు తీసుకెళ్ళాలి"

"అయితే రారాదూ! ఇద్దరం కలసి వెళ్దాం"

"నాకు రావాలని లేదు. కరుణని పంపిస్తాను. ఇద్దరూ కలసి వెళ్ళండి" అంది ఉమ వెళ్ళిపోతూ.

"సరే నీ ఇష్టం! ఓ గంటలోగా కరుణని పంపించు" అంది శాంతి.

కాఫీ తాగుతూంటే—

భాగ్యం వచ్చింది.

"పొలానికి వెళ్ళనని నాతో చెప్పి, మా వదినతో వెళ్తానని చెప్పావట — నిజమేనా?" అనడిగింది.

"రాత్రి అలాగే అనుకొన్నాను మరి! ఉదయం నాన్నగారు అటు వెళ్ళడంతో నా ప్రోగ్రాం ఇటు మారిపోయింది" అంది శాంతి నవ్వుతూ.

"కాఫీ తాగుతావా?" అనడిగింది తిరిగి.

"ఇస్తే తాగుతాను—ఇవ్వాలిగా నువ్వు" అంది భాగ్యం. కాఫీ తెచ్చి అందించింది శాంతి.

"నేనూ పొలం వస్తాను. మా పాలేరుకి భోజనం తీసుకు వెళ్ళాలి" అంది భాగ్యం.

"తప్పకుండా రా! ముగ్గురం కలసి వెళ్దాం"

'సరే'నంటూ తుర్రుమంది భాగ్యం. కాఫీ గ్లాసు విసురుగా మూలకు విసిరేసి మరీ వెళ్లింది.

"ఏయ్" అంటూ శాంతి కసిరినా విన్పించుకోలేదు.

ఇంతలో—

కరుణ వచ్చింది—"వెళ్దామా?"అంటూ.

"ఆఁ వెళ్దాం! మీ భాగ్యం వదిన కూడా పొలానికి వస్తుందట. ముగ్గురం కలసి వెళ్దాం" అంది శాంతి.

అలాగేనంటూ బుర్రూపింది కరుణ.

దేవాలయానికి ఎవరో వచ్చారు.

వాళ్ళని చూసి అక్కడకి పరుగు తీసింది శాంతి. గుడి తలుపులు తెరిచింది.

భక్తులు ఆలయం చుట్టు ప్రదక్షిణలు చేశారు. ఆలయంలో దీపారాధన చేశారు. కొబ్బరికాయని నైవేద్యంగా సమర్పిం

దారు.

ప్రసాదంగా కొబ్బరికాయలో సగం చిప్ప వాళ్ళకందించి తిరిగొచ్చింది శాంతి.

ఇంటికి తాళం వేస్తూండగా ఉమ, కరుణతో వచ్చింది. కరుణ తలపై పెద్ద పెద్ద బుట్టలు-అన్నం గిన్నెలతో రెండు వున్నాయి.

"పాపం- మొయ్యలేక చస్తుంది" అంది శాంతి కరుణ వైపు జాలిగా చూసి.

"ఏం చేస్తాం మరి! అమ్మకి జ్వరం... రాలేదు. నేనొద్దామంటే నాకు ఇదిగో ఈ పిల్లాడు లంపటం" సర్ది చెబుతున్నట్టుగా అంది ఉమ.

"భాగ్యాన్ని పంపాల్సింది. పొలాని కంటే గొప్ప సరదా దానికి"

"అదా! మేం చెప్తే అది వెళ్తుందీ" ఉమ నిట్టూర్చింది.

భాగ్యం పరుగున అక్కడికి వచ్చింది "నేను రడీ" అంది.

ఇంటి తాళం ఉమకి అందిస్తూ. "వస్తాం అయితే" అని ముందుకు కదిలింది శాంతి.

"ఇటు పూజారీ- అటు రైతు బిడ్డ! గొప్పదానివే" భాగ్యం పొగడ్తగా అంది శాంతిని చూసి.

ఆ మాటలకి నవ్వి వూరుకొంది శాంతి.

కనుచూపు మేరంతా పొలాలే! పెద్ద పెద్ద మైదానాల్లా కన్పిస్తున్నాయి.

రెండు రోజులుగా ఎడతెగని వర్షం మూలంగా నేలంతా బురద బురదగా ఉంది.

వేగంగా నడవలేకపోతున్నారు. తూచి తూచి అడుగులు వేస్తున్నారు ముగ్గురూ.

కరుణ బరువును మొయ్యలేక ఎగ శ్వాస తీస్తోంది.

"బరువుగా వుందా?" శాంతి ప్రశ్నించింది. అవునంది కరుణ.

"అయితే ఓ బుట్ట నా నెత్తికెత్తు, మరొకటి భాగ్యానికెత్తు"

"అయ్యయ్యో! అలాంటివేం కుదరవు" భాగ్యం భయపడుతూ అంది.

"చిన్న పిల్ల. దానికా మాత్రం సహాయం చేస్తే నీ సొమ్మేం పోయింది. వద్దులే! అయితే రెండూ నేనే మోస్తాను"

"అయ్యో రామ! అప్పుడే కోపం వచ్చేసింది అమ్మాయిగారికి. సరే! తప్పక చస్తుందా. ఇవ్వండి" భాగ్యం విసుక్కుంటూనే తట్టని నెత్తికెత్తుకుంది.

అప్పటికి తొమ్మిది గంటలయింది.

పొలాలన్నీ నీటితో నిండుగా వున్నాయి.

భాగ్యం నెత్తిమీద తట్టను కిందకు దించి తమ పొలం వైపు పారిపోయింది.

చద్ది రాగానే కూలీలంతా కట్టుగా చేరారు అక్కడకి. కరుణ అందరికీ చద్ది పెట్టింది.

శాంతి తమ పొలం వైపు వెళ్ళింది. మడి నిండుగా నీరు నిలిచి వుంది. ఒక వైపు గండి తీసివుంది. నీరు బయటకి పోతోంది.

చూస్తూ గట్టుమీద కూర్చుంది శాంతి.

పొలాలన్నీ మనుషులతో కళకళలాడుతున్నాయి. కొందరు దున్నుతున్నారు. ఇంకొందరు నారు వేస్తున్నారు.

అక్కడక్కడా నారు పచ్చగా తలూపుతూ కన్పిస్తోంది. కూలీలు పాటలు పల్లె వేస్తున్నారు.

వాతావరణం ఆహ్లాదంగా వుంది.

"ఇంటికి పోదామా?" కరుణ తన పని చక్కబెట్టుకుని వచ్చింది శాంతి దగ్గరకి.

"నాకు పనివుంది. కలుపు తియ్యాలి" అంది శాంతి.

"అయితే నేనూ తీస్తాను. నాకు కలుపు తియ్యాలంటే సరదా" కరుణ ఉత్సాహంగా అంది.

శాంతి కాదనలేదు.

ఇద్దరూ చకచకా మడిలోకి దిగారు. భాగ్యం కూడా వచ్చి సాయం చేసింది.

పన్నెండయింది అప్పటికి.

కలుపు బాగా తీసేశారు. రెండ్రోజులు పట్టేపని ఒక్కే రోజులో అయిందనిపించారు.

"ఇక పదండి పోదాం" అంది శాంతి.

కాలువలో కాళ్లూ, చేతులూ కడుక్కొని గట్టుమీదకి చేరారు.

"పాపం కరుణని చాలా కష్టపెట్టాను" అంది శాంతి కరుణ ముఖాన్ని తన పమిటతో తుడుస్తూ.

"అయ్యో పాపం!" వెక్కిరింతగా అంది భాగ్యం.

"చూడు! ఎంత అందమైన మొహం ఎలా వాడిపోయిందో"

"దానిదేముంది అందం! అందగత్తె అంటే నువ్వే. నిన్ను చూస్తుంటే..." అంటూ భాగ్యం శాంతిని బలంగా వాటేసుకొని ముద్దు పెట్టుకొంది.

"ఛీఛీ" శాంతి సిగ్గుగా వెనకడుగు వేసింది.

కరుణ సరదాగా చూస్తోంది వాళ్లని.

"పదండి వేగంగా మళ్లీ వర్షం వచ్చేట్టుగా వుంది" శాంతి తొందర చేసింది.

మధ్యాహ్నం ఒంటి గంటయింది.

ఊళ్ళోకి చేరారు ముగ్గురూ.

దేవాలయానికి దగ్గరగా వచ్చారు. ఆలయం అరుగుమీద ఎవరో పిచ్చాపాటి మాట్లాడుకొంటున్నారు. దాని దగ్గరగా వున్న వేపచెట్టు నీడలో సన్యాసులు కొందరు పవ్వళింపు సేవలో వున్నారు.

"ఇదిగో మిషన్ నేర్పుతానన్నావు ఈరోజు. ఇంటికెళ్లి క్షణంలో తిరిగొస్తాను. నేర్పాలి మరి" అంది భాగ్యం.

"అదేపని నాకు వేరే పనిలేదు" శాంతి నవ్వుతూ అంది.

"సరే అయితే" అంటూ భాగ్యం వెళ్లిపోయింది.

కరుణ, శాంతి ఉమ దగ్గరకి వచ్చారు.

"మా నాన్న రాలేదా?" అనడిగింది శాంతి.

"రాలేదు" అంటూ తాళంచెవి అందించింది ఉమ.

తిరిగొచ్చింది శాంతి. ఇంటి తాళం తీసి, ఆకలిగా వుంటే భోంచేద్దామని అన్నం ముందు కూర్చుంది.

ఇంతలో—

"పోస్ట్" అంటూ కవర్ గదిలో మంచమ్మీదుగా విసిరి వెళ్లాడు పోస్ట్‌మన్. మరి అన్నం తినబుద్ధి కాలేదు శాంతికి. గబగబావచ్చి కవరు అందుకొంది. చింపి ఉత్తరాన్ని చదువుతూ, ఆలోచిస్తూ నిలబడింది.

"ఏమిటే ఉత్తరం" భాగ్యం పరుగున వస్తూ అడిగింది. అడుగుతూనే లాక్కోడానికి ప్రయత్నించింది. అయితే ఆమె చేతికి అందనివ్వలేదు శాంతి. ఒడుపుగా జాకెట్లో దాచేసింది.

"ఏమిటో చెప్పవా?" గునిసింది భాగ్యం.

"ఎవరిదో పెళ్లట- నాన్నని రమ్మని రాశారు"

"నేను నమ్మను. అదేదో ప్రేమలేఖ. లేకపోతే నువ్వెందుకు దాస్తావు"

"చంపావు! ఏమీ లేదు. రా మిషన్ నేర్చుకొందువు గాని" ప్రసక్తి మారుస్తూ అంది శాంతి. భాగ్యం శాంతి టెక్నిక్ కనిపెట్టి నవ్వింది.

"ఈరోజు జాకెట్ కటింగ్ నేర్పుతాను"

"నీ ఇష్టం తల్లీ!"

"నా ఇష్టం ఏమిటి? నీకు నేర్చుకొనే ఇంట్రస్టు వుండాలి"

"నా ఇంట్రస్టు తగలబడినట్టుగానే వుంది. పట్టుమని పది రోజులు కూడా నేర్చుకోనివ్వదు మా అమ్మ. ఎంతసేపూ పొలానికి వెళ్ళమంటుంది తప్పా."

"అది నిజమే నన్పిస్తోంది. ఈమధ్య నువ్వసలు కాలేజీకి రావడమేలేదు" అంటి శాంతి.

"ఇంక చదువొకటా! చాల్చాల్లే! ఈ సంవత్సరంతో ఆ ఇంటర్‌కి స్వస్తి చెప్పేద్దామనుకొంటున్నాను" భాగ్యం చులాగ్గా అనేసింది.

అయినింటిపిల్ల. తిండికీ, బట్టకీ కొదవ లేదు. అటువంటి వ్యక్తికి చదువెందుకు? నిజంగా పద్ద దండుగన్పించింది శాంతికి.

బయట వర్షం పడుతోంది.

ఆలయంలోని గంట అదేపనిగా మోగుతోంటే లేచి వెళ్ళింది శాంతి. చూసే ఎవరో బిచ్చగాడు! మళ్ళీ వచ్చి కూర్చుంది.

ఓ పాత గుడ్డను కట్‌చేసి ఎలా కట్ చేయాలన్నది చూపిస్తోంది భాగ్యానికి.

"ఏదైనా నీకు భలే ఓపిక" మెచ్చుకోలుగా అంది భాగ్యం.

"అంటే?"

"అంటే—ఈ టైలరింగ్ నీకు బాగా వంటపట్టిందని."

"వంటపట్టించుకోకపోతే అడుక్కు తినాలి మేం! నీలా ఆసిపాసులుంటే ఆ పనిచేసేదాన్నేమో! కాని మేం పేదవాళ్ళం. మాకు వెనుకా, ముందూ వున్నదల్లా ఆ ఒక్క ఎకరం పొలం మాత్రమే. దాని మీద సాలుకి పది బస్తాలు తప్ప ఎక్కువ రావు. పోతే ఆలయం మీద ఆదాయం ఏమీలేదు. ఆ వచ్చిన పది బస్తాలూ దైవారాధనకే సరిపోతుంది. ఇక మేం ఏమి తినాలి? నాన్న పౌరోహిత్యం ఇంతో కొంతో మమ్మల్ని ఆదుకొంటోంది. అలాగే ఈ టైలరింగ్ కూడా. నాలుగు జాకెట్లు కుడితే వారానికి పది రూపాయల రాబడి. వస్తోన్నదాన్ని వదులుకోలేంగదా! అందుకే కాలేజీకి ఎగనామం పెట్టి కూడ ఈ పనిలో సులువు నేర్చుకొంటున్నాను"

"అబ్బబ్బా! ఇంత మాటకి ఎంత కథ చెప్పావే! అయినా నీకేం! తండ్రికొక్కర్తివి. హాయిగా ఇంట్లో వుండొచ్చు" అంది భాగ్యం.

"మరి నీకేం తక్కువైంది?" శాంతి ప్రశ్నించింది.

"అంతా తక్కువే! డబ్బుందన్నమాటే గాని పైసా అడిగితే పదిమంది ప్రశ్నిస్తారు మా ఇంట్లో. నాన్న, అమ్మ, నాయనమ్మ, తమ్ముడు, చెల్లీ అందరూ నా మీదే పడి ఏడుస్తారు. నేనేదో ఎంతో ఖర్చుచేసేసినట్టు"

"అవును. అందులో తప్పేం వుంది. నువ్వు చేసేదీ అంతేగా?"

"ఏయ్!" కోపంగా అంది భాగ్యం.

వర్షం ఎక్కువయింది అవతల.

ఎదురుగా వున్న ఇంట్లో—

వసారాలో మంచం మీద ఉమ పిల్లాణ్ని ఆడిస్తూ కరుణ కూర్చుంది. ఇటువైపు చూస్తోంది.

వేప చెట్టుకింద సన్యాసులు జల్లుకి తడుస్తూ గంజాయి దమ్ము పీలుస్తున్నారు. మత్తుగా భక్తిగీతం అందుకొన్నారు.

"ఈ సన్యాసులను ఎదురుగా పెట్టుకొని ఒక్కర్తివీ ఎలావుంటున్నావు?

రాత్రయితే భయం వెయ్యదూ?" భాగ్యం సన్యాసుల్ని చిరాగ్గాచూస్తూ ప్రశ్నించింది.

"పొద్దుపోతే ఆలయం తలుపులు మూసేస్తాను. లోనికి ఎవరూ రారు. బయటే పడుకొంటారు!"

"అదికాదు. మీ నాన్నెప్పుడూ నెలకి పదిహేను రోజులు ఊళ్ళోనే వుండరు కదా! అటువంటప్పుడు వీళ్ళెవరైనా అఘాయిత్యం చేస్తే?"

"ఛఛ! అవేం మాటలే! అయినా ఎదురుగా మీ మామయ్యావాళ్లుంటుండగా నాకేం భయం" అంది శాంతి.

"ఏదైనా నీకు భలే ధైర్యం" భాగ్యం ప్రశంసించింది.

"నాకయితే ఇలాంటివాళ్ళని చూస్తే భయం! అస్సలు మగాళ్ళంటేనే బెదిరిపోతాను" మళ్ళీ అంది భాగ్యం.

నవ్వుకొంది శాంతి ఆ మాటలకి.

"నేనింటికి వెళ్తాను"అంటూ గొడుగు తీసుకోబోయింది భాగ్యం.

"ఇదిగో – గొడుగు పట్టుకుపోతే నాకెలా? ఆలయానికి ఎవరైనా వస్తే అక్కడికీ, ఇక్కడికీ తిరగాలి. వదులు" అంది అరుస్తూ శాంతి.

"అయ్యోరామా! గొడుగు లేకపోతే బతకలేవు కాబోలు" ఈసడిస్తూ గొడుగు అంది పుచ్చుకొని మరీ పారిపోయింది భాగ్యం.

* * *

ఊరికి ఈ వైపుగా రామాలయం వుంది. దీన్ని రాజయ్య పూర్వీకులు తమ ఇల్లు కట్టుకొంటూ–పక్కనున్న బంజరు స్థలంలో ఆలయంగా కట్టించి చుట్టూ ప్రహరీ ఏర్పాటు చేశారు. పనిలో పనిగా పూజారి భుక్తి కోసం ఎకరం మాగాణి మాన్యం కింద రాశారు. ఆ ఎకరాన్ని సాగుచేసుకొంటూ – పూజా పునస్కారాలు చేస్తూ గడపగలగాలి పూజారి. ఈయన కోసం గ్రామస్థులు చందాలు వేసుకొని ఆలయం దగ్గరే రెండుగదుల ఇంటిని నిర్మించారుకూడా. ఆ ప్రాంగణంలోనే బావి, విశాలమైన వసారా వున్నాయి.

పంతులు పూజారిగా వచ్చి పది సంవత్సరాలవుతోంది. అంతకు ముందున్న వ్యక్తుల్ని తొలగించి,కావాలనే రాజయ్య పంతుల్ని పూజారిగా ఏర్పాటు చేశాడు శాశ్వత ధర్మకర్త అతనే కనుక మరెవరూ ఆ విషయంలో పన్నెత్తి మాట్లాడటానికి వీల్లేకపోయింది.

పంతులు ఏ వూరివాడో ఎవరికీ తెలీదు. అడిగినా ఆయన చెప్పడు.

ఆ వూరు చేరేనాటికి శాంతికి ఆరేళ్లు. అప్పట్లోనే తల్లి పోయింది.

చిన్నప్పటి నుండీ శాంతికి పూజా విధానాలు తెలుసు. ఆ కారణంగా పంతులుకి కొంత శ్రమ తప్పింది.

ధర్మకర్తగా రాజయ్యతో పంతులుకి వున్న స్నేహం వల్ల ఎక్కువగా శాంతి రాజయ్య ఇంటిలోనే ఆడుతూ పాడుతూ కాలం గడిపేది. రాజయ్య పెద్ద కూతురు ఉమ శాంతికన్నా ఆరేళ్లు పెద్ద. కరుణ శాంతికన్నా నాలుగేళ్లు చిన్న.

ఆ విధంగా వాళ్ళు ముగ్గురూ కలిసికట్టుగా వుండేవాళ్లు. ఒకటిగా ఆడుకొనేవాళ్లు.

రాజయ్యగారబ్బాయి గోపాల్ కి ఆలయం ప్రాంగణంలో ఆడుకోవడమంటే చాలా సరదా. అలాగే అతని అక్కాచెల్లెళ్ళకి కూడా! అందుకోసమే వాళ్లు శాంతి చుట్టూ తిరిగేవారు.

ఆలయంలో ముగ్గులు పెట్టడం చిన్న చిన్న మొక్కలకి నీళ్ళు పట్టడం లాంటివి చేసేవారు. అయితే చదువు కోసం గోపాల్ పట్నం వెళ్ళడంతో ఆటలకి స్వస్తి చెప్పడం జరిగింది.

వీళ్ళతో కలవక ఒంటిపిల్లి రాకాసిగా వుండేది భాగ్యం! ఆ పిల్ల రాజయ్య భార్య కాంతం తమ్ముడి కూతురు.

కాంతం తమ్ముడికి ఆ సిపాస్తులు బాగానే వున్నాయి. భాగ్యం కాక మరో చిన్నకూతురూ, కొడుకూ వున్నారు. అందరిలోకీ భాగ్యం పెద్దది కావడంతో గారాబంగా ఆ ఇంట పెరుగుతోంది. ఆ గారాబమె ఆ పిల్లలో ఆకతాయితనాన్ని పెంచింది.

* * *

మగతగా నిద్రపోతోన్న శాంతికి "శాంతీ!" అన్న పిలుపు విన్పించింది. వెంటనే మేల్కొని లేచి తలుపు తెరిచింది.

"ఏమిటి? అప్పుడే నిద్రా!" అంది ఉమ లోనికివస్తూ. ఆమె చేతుల్లోని బాబు శాంతిని చూసి కేరింతలు కొడుతున్నాడు.

శాంతి బాబుని చేతుల్లోకి తీసుకొంది.

"అలసటగా వుంది" అంది.

"నిజమే! పొలం వెళ్ళి పనిచేశామంటే



అలుపు తప్పదు"

బద్ధకంగా ఒళ్లు విరుచుకొంది శాంతి.

"బాబు ఒకటే ఏడుపు. కింక పట్టి వదలట్లేదు. అలా తిప్పి తీసుకొస్తే బాగుంటుందని ఇలా వచ్చాను"

"మంచి పని చేశావు" అంది బాబుని ముద్దుపెట్టుకొంటూ.

"శాంతీ! మా బాబుకి ఓ టోపీ కుట్ట రాదటే!" అడిగింది ఉమ.

"తప్పకుండా"

"భాగ్యాన్ని అడుగుదామనుకొన్నాను. కాని, తర్వాత మానుకొన్నాను ఆ ఆలోచన"

"అదేం కుడుతుందయినా! ఇంకా దానికి సరిగ్గా కటింగే తెలీదు. వీలు చూసుకొని నేనే కుట్టిపెడతాను. వారం రోజుల్లో బాబుకి టోపీ వేస్తాను" అంది నవ్వుతూ.

"నాన్నగారింకా రాలేదా?" ఉమ ప్రశ్నించింది.

"లేదు. రేపు సాయంత్రానికి వస్తే రావచ్చు"

బాబు శాంతి చేతిలోనిద్రపోతున్నాడు. నెమ్మదిగా అందించింది ఉమకి.

"వెళ్తాను. తలుపేసుకో" అంటూ ఉమ వెళ్లిపోయింది.

తలుపువేసివచ్చింది శాంతి. పుస్తకం లోని కవరు మళ్లీ చేతిలోకి తీసుకొంది. పదే పదే చదవడం మొదలెట్టింది.

"ప్రియమైన శాంతీ!

ఇక్కడికి చేరి పది రోజులు కాలేదు. పది యుగాలన్పిస్తోందపుడే! రాత్రింబగళ్లు నీ కలవరింతలే! ఈ కలవరింతలతో రూంమేట్స్‌కి నిద్ర పట్టడం లేదట. వాళ్ళంతా నాకే ఫిర్యాదు చేసుకున్నారు.

నీ ప్రేమలో చిక్కుకొన్నందుకు ఇక్కడ కలవరింతలు మాత్రమే నాకు మిగిలాయి. అన్నట్టు నీకో శుభవార్త! నేను వారం రోజుల్లో మనూరు వస్తున్నాను.

తస్మాత్ జాగ్రత్త!

నా కోపం వెయ్యి కళ్లతో ఎదురు చూస్తూ వుండు!

వుంటాను!

నీ

గోపాల్"

ఉత్తరాన్ని ముద్దుపెట్టుకుంది. నవ్వుకుంది. దిండును గుండెలకు దగ్గరగా తీసుకుని హత్తుకొంది శాంతి. నిద్రలోకి జారిపోయింది.

లేచేటప్పటికి మర్నాడు ఉదయం ఆరుగంటలయింది. ఎండపొడ బాగానే వుంది. గబగబా తెమిలింది. కుట్టుపని చూసుకొందామని వెళ్తే కత్తెర కన్పించ లేదు. భాగ్యం పట్టుకు వెళ్ళిందని ఆలోచిస్తూ కూర్చుంది.

ఇంతలో పంతులు వచ్చాడు.

"నిన్న రాలేదేమినాన్నా?"అనడిగింది శాంతి ఎదురువెళ్ళి.

"వీల్లేకపోయిందమ్మా! ఇపుడయినా వెంటనే మళ్ళీపోవాలి. నీకోసారి కన్పించి పోదామని వచ్చాను"

"మళ్ళీ వెళ్ళాలా? ఒకేసారి పనంతా చూసుకొని రావలసింది" అంది బాధగా.

పంతులు శాంతి తల నిమిరి పెరట్లోకి వెళ్ళాడు. స్నానం.సంధ్యా ముగించుకుని వచ్చాడు.

"ఆకలిగా వుందమ్మా! అన్నం పెట్టు" అన్నాడు.

విస్తరివేసి నిండుగా వడ్డించింది శాంతి.

భోంచేస్తున్నాడు పంతులు.

"కలుపుతీత అయిపోయింది" అంది శాంతి. ఆశ్చర్యంగా కూతురి మొహం లోకి చూశాడు.

"ఒక్కరోజుకే అయిందా?" అనడిగాడు.

"భాగ్యం, కరుణ సాయం చేశారు"

"అయితే నారొక్కటే వెయ్యాలన్న మాట"

"అవున్నాన్నా! తొందరగా వేస్తేసరి"

"సరే!" అన్నాడు పంతులు. భోజనం ముగించి లేచి పంచలో కూర్చున్నాడు.

తను కూడా భోజనంచేసి, భాగ్యం దగ్గరకి వెళ్ళి కత్తెర తెచ్చుకోవాలను కొంది శాంతి.

వేగంగా తెమిలింది.

పళ్ళెం కడిగింది. ఎంగిళ్లు ఎత్తి పెట్టింది.

"ఎక్కడికమ్మా?" అనడిగాడు పంతులు బయటకి వెళ్తున్న శాంతినిచూసి.

"భాగ్యం దగ్గిరికి"

"వేగంగా వచ్చేయమ్మా"

విశాలమైన డాబా అది! పూర్వపు డాబా!

ముందు పెద్ద వసారా. వసారాకి ఆ మూలగా పడుకొని వుంది భాగ్యం నాయనమ్మ. అలికిడికి కళ్ళెత్తి చూడనే లేదు.

ఆ సమయంలో ఇంట్లో ఎవరూ వుండరని తెలుసు. తల్లీ, తండ్రి పొలం పోతారు. చెల్లెలూ, తమ్ముడూ ఆడుకోడానికి పోతారు. భాగ్యం కూడా అంతే! వెయ్యిగుళ్ళ పూజారి! ఆ ఇంటా... ఈ ఇంటా తిరిగొస్తుంది.

అయినా వుంటుందేమోనని వచ్చింది శాంతి.

నిశ్శబ్దంగా వుంది వాతావరణం.

తలుపులన్నీ తెరచివున్నాయి.

భాగ్యం గది తలుపులు మాత్రం వోరగా వేసివున్నాయి.

చప్పుడుచెయ్యకుండా మెల్లిగా నెట్టింది వాటిని.

లోనికి చూసింది.

అంతే!

శాంతి కళ్లు బైర్లు కమ్మాయి. వంట్లో రక్త ప్రసరణ ఒక్కసారిగా ఆగినట్ట న్పించింది.

లోపల-

భాగ్యం నగ్నంగా వుంది!

మరొకని చేతిలో నలిగిపోతోంది.

ఇద్దరూ ఒకటిగా కన్పిస్తున్నారు.

తలుపు దగ్గరగా అలికిడి కావడంతో ఇటుగా చూశారు వాళ్లు.

శాంతి...!

ఉలికిపాటుగా దుప్పటిని కప్పుకున్నారు.

అదురుతోన్న గుండెల్ని అరచేత పట్టుకొని వేగంగా ఆ ఇంటినుండి బయట పడింది శాంతి. చూసిన దృశ్యం కళ్ళకి కట్టినట్టుగా వుంది. భాగ్యం బరితెగిస్తోం దనుకొంది.

ఇంటికి వచ్చినా దడ తగ్గలేదు.

ఎందుకో భయం...!

ఆరాటం...

ఆందోళన...

జుగుప్స...

తల బద్దలవుతున్నట్టుగా వుంటే మంచంలో కూలబడి ఆలోచిస్తోంది.

కాలేజీలో భాగ్యాన్ని గురించి చాలా పుకార్లు వింది. అయినా నమ్మలేదు తను. కాని ఈరోజు ప్రత్యక్షంగా చూసింది.

ఎంత నిర్భయంగా ప్రవరిస్తోంది?



క్లాసుమేట్ రవిని ఇంటికి రహస్యంగా రప్పించి మరీ రాసలీలలు సాగిస్తోందన్న మాట!

ఎంత ధైర్యం!!

ఈ విషయం పెద్దవాళ్లకి తెలిస్తే ఏమవుతుంది?

భాగ్యాన్నీ, రవినీ బతకనిస్తారా?

ఈ సంఘటనను గూర్చి ఆలోచిస్తుంటే ఒళ్లంతా చలిజ్వరం వచ్చినట్టుగా వణికి పోతోంది.

శాంతికి భయం భయంగా వుంది.

సాయంత్రం అయిదుగంటలకే పక్క వూరికి వెళ్లిపోయాడు పంతులు – అక్కడేదో వ్రతం చేయిస్తానని. రెండ్రోజుల వరకూ రానన్నాడు. అక్కడనుండి మరో వూరు పెళ్ళికి వెళ్ళాల్సి వుందట!

శాంతి మనసంతా అదోలా వుంటే- ఆలయంలోకి వెళ్లింది. దేవుని ముందు దీపాన్ని వెలిగించి, క్షణం సేపు కళ్లు మూసుకొంది. ఏదో ధైర్యం వచ్చినట్ట యితే తిరిగి ఇంటికొచ్చింది.

భాగ్యం మంచం మీద కూర్చుని వుండటం చూసి గతుక్కుమంది.

"ఎప్పుడొచ్చావు?"అనడిగింది శాంతి.

"ఇప్పుడే" అంది భాగ్యం నవ్వుతూ.

భాగ్యం ముఖంలోకి పరిశీలనగా చూసింది శాంతి. తప్పు చేశానన్న భావన ఆ ముఖంలో ఏమాత్రం లేదు.

స్వచ్ఛంగా కడిగిన ముత్యంలా

మెరిసిపోతోంది.

"శాంతీ!"

ఏమిటన్నట్టుగా చూసింది భాగ్యం వైపు.

"నేను తప్పుచేశానంటావా?" అనడిగింది.

"లేదు. ఘనకార్యం చేశావంటాను. ఛీఛీ! బుద్ధిలేదు నీకు"

ఆ మాటలకి భాగ్యం నవ్వింది.

"ఇందులో బుద్ధిలేకపోవడానికేముంది! రవిని ప్రేమిస్తున్నాను. అంతే...!"

"ప్రేమంటే నీ ఉద్దేశంలో...."

"ప్రేమే" జవాబిచ్చింది భాగ్యం.

"భాగ్యం! నిన్ను చూస్తుంటే జాలి వేస్తోంది నాకు. నువ్వు ప్రేమగా భావించేది ఎంత మాత్రం ప్రేమకాదు. అది వాంఛ—కామం! ప్రేమకు ఏవేవో అర్థాలు సృష్టించకు. ప్రేమ అంటే త్యాగం—ప్రేమ త్యాగాన్ని కోరుతుంది. వాంఛ సుఖాన్ని కోరుతుంది. నీ గురించి నేను చాలా విన్నాను. నన్ను దబాయించకు. ఎవరైనా జీవితంలో ఒకే ఒక్కరిని ఒకేసారి ప్రేమిస్తారు. నీలా అందరినీ అవసరానికో, మరేదానికో ప్రేమించడం—ప్రేమ అన్పించుకోదు"

భాగ్యం జవాబివ్వలేదు. ఆలోచిస్తోంది. ఏదోవిధంగా శాంతికి తను చేసింది తప్పుకాదని నచ్చజెప్పాలి. తన విషయం బయటకి పొక్కకుండా జాగ్రత్త పడాలి.

"పోనీ!నేను చేసింది తప్పే..మరిచిపో" అంది భాగ్యం.

"మరిచిపోక నిన్ను అల్లరి పెడతాననుకొన్నావా! లేదు భాగ్యం లేదు. కాని ఇలా నీ జీవితాన్ని నీ చేతులారా నాశనం చేసుకోవడం నేను సహించలేను. ఇంకా ఎంత మందితో నీకిలాంటి సంబంధాలున్నాయి. నిజం చెప్పు?"

"చాలా మందితో"

"అంటే—నువ్వు అబార్షన్ చేయించుకున్నావన్నది నిజమేనన్నమాట"

అవునన్నట్టుగా తలూపింది భాగ్యం.

శాంతి నిశ్చేష్టురాలైంది.

"ఇంత చిన్న వయసులో నీకీ పాడు బుద్ధులేమిటే!" అంది ఆత్రుతగా.

"చిన్న వయసేమిటి? పెళ్ళి చేస్తే ఈపాటికి ఇద్దరు పిల్లల తల్లిని. అయితే మావాళ్ళు నాకింకా వయసు లేదంటూ మానుకొంటున్నారు. నాకయితే వయసొచ్చింది. నేను మగతోడు లేకుండా క్షణం వుండలేను"

చేష్టలుడిగి వింటోంది శాంతి.

"టెన్త్‌క్లాసులో వున్నపుడే ఆ రుచి మరిగాను. అది ఎంతో తియ్యగా వుంది. దాన్ని పదే పదే కావాలనుకొంటున్నాను. అయితే ఆ తీపిదనంలో కూడా వెరైటీలున్నాయి.అందుకోసమే రోజుకో మగాడు ఎవడైనాసరే నాకు తృప్తికలిగిస్తే చాలు"

"నోర్ముయ్" ఆవేశంగా అరిచింది శాంతి.

గిరగా చూసింది భాగ్యం.

"అంత ఇదిగా వున్నదానివి పెళ్ళి చేసుకోలేకపోయావు"

"మావాళ్ళు చేస్తేగా! చెప్తే విన్పించుకోవేం నువ్వు"

భాగ్యం మాటలు వినలేకపోతోంది శాంతి.

"పోనీ— మొగుడంటూ ఒకర్ని చిన్నప్పట్నుండే నాకు ఆశలు కల్పించి చూపించారు. అయితే ఆ మొగుడు నాతో వులకడు—పలకడు. సరసానికి అసలు రాడు. వాడో ఇంపోటెంట్"

"ఎవరతను?"

"గోపాల్. మాబావ. పేరు మాత్రం గోపాల్-నిజానికి గోపాలుడు కానేకాడు"

భాగ్యం వైపు కోపంగా చూసింది శాంతి. వెంటనే తల పక్కకి తిప్పుకొంది మళ్ళీ.

"కవ్విస్తే ఆమడ దూరం పరిగెత్తే మొగుడాయన. ఆయన్తో నాకు పెళ్ళట! ఇక సంసారం ఏం చేస్తానో ఏమో? చూస్కొసి ఆయనకి డమ్మీని ఏర్పాటు చేసుకోవాలి"

"భాగ్యం!"

"మరేం చేయాలో చెప్పు?"

"గోపాల్ని అంతంత మాటలంటే పురుగులు పట్టిపోతావు. అంతగా ఇష్టం లేకపోతే పెళ్లి మానుకో"

"కావాలని ఎవరు ఏడ్చారు. వాడికి పెళ్ళాన్ని అన్పించుకునేకంటే పబ్లిగ్గా పడుపుగత్తె నవటం బెటర్" నవ్వింది భాగ్యం.

శాంతికి కడుపులో దేవుతున్నట్టుగా వుంది. సంభాషణ అంతటితో ఆపేయడం శ్రేయస్కరం అనుకొంది. గోపాల్ని గురించి భాగ్యం నోటంట మరే మాటా వినదలచుకోలేదు.

పిచ్చిగా అతన్ని గూర్చి భాగ్యం మాట్లాడుతుంటే తను రెచ్చిపోవాల్సి వస్తుంది. అప్పుడు - అనేక రకాల అనుమానాలు కలగక మానవు.

నిశ్శబ్దం!

ఇద్దరి మధ్యా మాటలు లేవు. గోపాల్ని సమర్థిస్తూ శాంతి మాట్లాడడంతో భాగ్యానికి ఆపాటికే అనుమానం రేగింది. భయం కూడా వేసింది.

రేపు గోపాల్కి తన విషయాలన్నీ శాంతి చెప్తుందేమోనన్న బెదురు పుట్టింది. మరిక వుండటం క్షేమకరం కాదని-

"వస్తాను శాంతీ!" అంటూ బయల్దేరి వెళ్లిపోయింది భాగ్యం.

శాంతి మాట్లాడలేదు.

వెళ్తోన్న భాగ్యం వైపు చూస్తూ కూర్చుంది.

"రేపు నా కత్తెరా, గొడుగూ పంపించడం మరిచిపోకు" అని మాత్రం అనగలిగింది.

"అలాగే!" అంది భాగ్యం.

బయట చిన్నగా జల్లు కురుస్తోంది.

భాగ్యం జీవితం ఇంతేనా? చెడ తిరిగి జీవితాన్ని నాశనం చేసుకొంటుందా? గోపాల్ని పెళ్ళి చేసుకొంటుందా...?

లక్షల ప్రశ్నలుగా తోస్తున్నాయి ఆలోచనలు.




మర్నాడు-

కాలేజీ ఆవరణలో అడుగుపెట్టింది శాంతి. అంతకు ముందే భాగ్యం వచ్చి నిల్చుందక్కడ. మామూలుగా అయితే ఇద్దరూ కలసి వచ్చేవారు. నిన్నటి సంఘటనతో ఇలా చీలిపోయారీరోజు.

"ఇప్పుడేనా రావడం?" శాంతిని చూసి పలకరింపుగా నవ్వింది భాగ్యం.

శాంతి తలూపింది క్లాసులోకి దారితీస్తూ. భాగ్యం కూడా వచ్చి శాంతి పక్కగా కూర్చుంది.

శాంతిని చూశాడు రవి. తన విషయం బయటపడుతుందేమోనని భయపడు తున్నాడు. ఏమాత్రం బయటపడినా తనని చావ తంతారు.

భాగ్యం పెద్దలు ఏదైనా చేయగలరు. అదే అతని ఆందోళన!

శాంతి చెప్తే ఎవరైనా ఏదైనా నమ్ముతారు. శాంతి మాటలకి విలువ వుంది. అందుకని ఏదైనా జరిగితే...!

మరి ఆలోచించలేకపోయాడు రవి.

క్లాసయిన తర్వాత భాగ్యాన్ని కలిశాడు. తన భయాన్ని గూర్చి చెప్పాడు.

"దానికంత ధైర్యం ఎక్కడిది? అయినా అలా చెప్పే మనిషి కాదు" అంది భాగ్యం నవ్వుతూ.

"ఏమో! ఒకవేళ బయటపడితే నన్ను ప్రాణాలతో వుంచరు"

"అయితే ఏం చేయమంటావు?"

ఆలోచించాడు రవి.

"దాన్ని కూడా అల్లరిపాలు చెయ్యాలి



అలా చేస్తే తన తప్పుని కప్పిపుచ్చుకుందికి అయినా మన తప్పును దాస్తుంది"

"అయ్యబాబోయ్!" విస్తుపోయింది భాగ్యం.

"అయితే నేను చావాల్సిందేనా?" బిక్కమొహం వేశాడు రవి.

భాగ్యం 'ఏం చేద్దామయితే' అన్నట్టుగా అతని వైపు చూసింది.



"సాయంత్రం చీకటిపడ్డ తర్వాత ఏ మాయమాటలో చెప్పి శాంతిని వూరి బయటకి తీసుకురా.

అక్కడ నేనూ,ఆనందూ వుంటాం.దాన్ని బలత్కారం చేసి దానంతు చూస్తాం! ఈ విధంగా మనల్ని మనం కాపాడుకో వచ్చును"

"ఛీఛీ! మరీ అంత దారుణంగా ప్రవర్తించడమా" విసుక్కొంది భాగ్యం.

శాంతి ఏం చేసిందని దాని బతుకు నాశనం చెయ్యాలి? దానివల్ల తనకొచ్చే లాభం ఏమిటి?

తనెలాగూ చెడిపోయింది. మరొకర్ని ఆ దశకు ఎందుకు తేవాలి?

వీల్లేదనుకొంది భాగ్యం.

తర్వాత క్లాసుకి వెళ్ళి శాంతి పక్కనే కూర్చుంది.

ఆలోచిస్తోంది-

రవి చెప్పింది కూడా నిజమే!

తాను బయటపడకుండా వుండాలంటే ఇంతకన్నా మరో గత్యంతరంలేదు. నిజంగా పెళ్లి చేసుకోవాల్సి వస్తే రవిని చేసుకొని తానేం సుఖపడలేదు.

గోపాల్ని చేసుకోవడం తప్పనిసరి.

అటువంటప్పుడు ఈ అభాసుపాలైన జీవితం అతగాడికి తెలీకూడదు. శాంతి గోపాల్‌కి ఈ విషయం చెప్పినా చెప్తుంది. ఆ తర్వాత ఏమౌతుంది? పెళ్లి ఆగిపోతుంది. గోపాల్ తనవాడు కాకుండా పోతాడు.

వీల్లేదు...వీల్లేదు!

అన్నీ ఆలోచిస్తుంటే శాంతి మీద దయ తలచడం అనవసరమన్పించింది. శాంతిని తన దారికి లాక్కోవాలి! చెరిపేయాలి! అంతకన్నా మరో గత్యంతరం లేదన్పించింది భాగ్యానికి.

కాలేజీ అయిన తర్వాత రవిని కలిసి అడిగింది.

"ఎన్ని గంటలకి అక్కడ వుంటారు?"

"సరిగ్గా ఏడుగంటలకి"

"ఓకే" అంది భాగ్యం.

శాంతితో ఏరకంగా ప్రవర్తించి ఆమెను అక్కడికి తీసుకు రావాలన్నది వివరంగా చెప్పాడు రవి. అంతనికెంతో ఆనందంగా వుందిప్పుడు. శాంతిని అనుభవించడంలో థ్రిల్ వుందన్పిస్తోంది.

భాగ్యాన్ని బ్లాక్ మెయిల్ చేయడంలో శాంతిలాంటి అమ్మాయిల పొందు ముందు ముందు బాగానే వుంటుందని వూహించుకొంటున్నాడు.

సాయంత్రం అయిదయింది.

గొడుగునీ, కత్తెరనీ తీసుకొచ్చి శాంతికి అందించింది భాగ్యం. వచ్చి కూర్చుంది.

"ఉమ కొడుక్కి టోపీ కుట్టరాదూ" అంది శాంతి భాగ్యాన్ని చూస్తూనే.

"నేనా? నాకింకా కటింగే రాదు. ఎలా?"

మాట్లాడలేదు శాంతి. వూరుకొంది. భాగ్యం కల్పించుకొంది.

"నా మీద ఇంకా కోపం పోలేదా- సరిగ్గా మాటాడటంలేదు"

"ఛ! నీమీద నాకెందుకు కోపం"

"వుండొచ్చేమోనని..."

"లేదు భాగ్యం!నీమీద కోపం నాకెంత మాత్రం లేదు. జాలి వేస్తోంది నిన్ను చూస్తూంటే. చివరికి నీ బతుకేమవుతుందోనని భయం వేస్తోంది"

'ఆ భయం నీకూ త్వరలో వేస్తుంది. తొందరపడకు' అనుకొంది భాగ్యం వికృతంగా.

"అలా ఊరి బయటకు వెళ్దాం

రా! కాస్సంత మనసు ప్రశాంతంగా వుంటుంది"

"నువ్వెళ్లు. నేను రాను"

"అలా అంటే ఎలా? నా బాధలు పంచుకొనే మంచి స్నేహితురాలివి నువ్వే! నావన్నీ నీకు చెప్పి మనసుని అదుపులో పెట్టుకొందామనుకొంటున్నాను. ప్లీజ్! కాదనకు" అంది అభ్యర్థనగా.

నిజమే! పశ్చాత్తాపపడుతున్న వ్యక్తికి ఓదార్పు అవసరమనుకొంది. సరేనంది శాంతి.

ఇంటికి తాళం వేసి ఇద్దరూ బయట పడ్డారు.

వూరి చివరకి వచ్చారు.

రవి, ఆనంద్ వాళ్ళని అనుసరించారు.

భాగ్యానికి ఆదుర్దాగానూ, ఆందోళనగానూ వుంది.

ఏం జరుగుతుంది? జరిగింది తెలియకుండా వుంటుందా? లేక తెలిసి ప్రాణాలు పోగొట్టుకోవాల్సి వస్తుందా? అంతా అయోమయమన్పిస్తోంది.

సన్నని వెలుతురులో తన ముందు పడ్డ నీడల్ని చూసింది శాంతి. తలెత్తింది.

రవి! ఆనంద్!

పరిస్థితులు వెంటనే ఆకళింపు చేసుకొంది. భాగ్యం చేసిన మోసం అర్థమైంది. భయంతో నోట మాట రాలేదు అరుద్దామన్నా!

రవి శాంతిని ఒడిసి పట్టుకోబోయాడు. విసురుగా తప్పించుకొంది. ఆ విసురుకి రవి బోర్లాపడ్డాడు.

ఆనంద్ తప్పించుకొన్న శాంతిని బలంగా పట్టుకొన్నాడు. అతడి చేతిని కసిదీరా కొరికింది.

బాధగా విడిచాడు ఆనంద్.

పరుగుతీసింది శాంతి.

రవి అడ్డొచ్చాడు. శాంతిని కిందికి నెట్టాడు. వెల్లకిలా పడింది.

రవి మీది మీది కొస్తున్నాడు. విడిపించుకొంటోంది. అయినా ఫలితం లేకపోతోంది.

గట్టిగా విదిలించి కొట్టింది.

మళ్ళీ పరుగందుకొంది. "దొంగలు దొంగలు" అంటూ అరుస్తూ పరుగు తీసింది.

అంతా గమనిస్తున్న భాగ్యం పరిస్థితి విషమించిందని తెలిసి తప్పుకొంది.

రవి, ఆనంద్ పిట్ట చేజారిపోయినందుకు బాధపడ్డారు. వెంటపడి తరిమారు.

ఆపాటికే శాంతి వూరిలోకి వచ్చేసింది. మరిక లాభం లేదనుకొన్నారు. పారిపోయారు.

వెనక్కి తిరిగి చూడకుండా పరుగెడుతోంది శాంతి. ఆ పరుగు రాజయ్య ఇంటి ముంగిటకి వచ్చేవరకూ ఆగలేదు.

ఆయాసంతో ఎగరొప్పుతూ పరుగెత్తి వస్తున్న శాంతిని చూసి – వసారాలో వున్న ఉమ బిత్తరపోయింది.

"ఏం జరిగింది శాంతీ! ఏమైంది?" అంది శాంతిని గట్టిగా హత్తుకొంటూ ఉమ.

ఆయాసం వల్ల మాట ఎగిసిరాక శాంతి మాట్లాడలేకపోతోంది. ఉమని గట్టిగా వాటేసుకొని ఏడుస్తోంది.

ఉమ 'భయం లేదన్నట్టుగా' శాంతి తల నిమురుతూ లోనికితోడ్చుకు వచ్చింది.

రాజయ్య, కాంతం, కరుణ వాళ్ళిద్దరిని చుట్టుముట్టి ఏం జరిగిందన్నట్లుగా చూస్తూ నిలబడ్డారు.

కొద్ది సేపటికి శాంతి ఏడుపు మానేసింది.

"మంచినీళ్లు తీసుకురా కరుణా!" అన్నాడు రాజయ్య. నీళ్ళుతెచ్చి అందిం

చింది కరుణ ఉమ చేతికి. శాంతిచేత తాగించింది.

ఆయాసం తగ్గింది.

మళ్ళీ ఏడుస్తోంది శాంతి.

"శాంతీ! ఏం జరిగింది చెప్పమ్మా?" ఉమ లాలనగా అడిగింది.

శాంతి జరిగిన వివరాలన్నీ చెప్పింది ఏడుస్తూనే. అయితే భాగ్యం విషయం బయట పెట్టలేదు. భాగ్యం విషయం బయట పెడితే అక్కడ తనకి స్థానం వుండదని తెలుసు. కాంతమ్మ భాగ్యాన్ని కోడలుగా చేసుకోబోతోంది. ఈ విషయాలు తెలిస్తే నమ్మకపోగా తననే తిట్టిపోస్తుంది.

అందుకని చెప్పలేదు శాంతి.

"వెధవలకి ఎంత ధైర్యం? వాళ్ళ కాళ్లూ చేతులూ విరిచేయాలి" వ్యగ్రంగా అన్నాడు రాజయ్య.

"పోలీసులకి పట్టిస్తే సరి" అంది ఉమ.

"అది మంచి పద్ధతి కాదమ్మా! పోలీసులేం చేస్తారు. కక్కుర్తి పడి వాళ్ల నొదిలినా వదిలేస్తారు. అయినా ఈ రకంగా ఈ విషయం ప్రచారం కావడం వల్ల శాంతి భవిష్యత్తుకు మంచిదికాదు. వాళ్ల అంతు ఎలాగో నే చూస్తానుగా! మీరు కూడా ఈ విషయాన్ని ఎవరికీ చెప్పకండి" హెచ్చరించాడు.

శాంతి వైపు జాలిగా చూసింది ఉమ.

"రా! స్నానం చేస్తే కొంత తెరిపిగా వుంటుంది. భయం లేకుండా నెట్టుకొచ్చావు. అందుకు సంతోషించాల్సిందే" అంది ఉమ. శాంతిని పెరట్లోకి తీసుకు వెళ్లింది.

ఆ రాత్రి అక్కడే భోజనం చేసింది శాంతి. ఇంటికి వెళ్ళాలంటే భయంగా వుంది.

"ఇక్కడే పడుకో ఈ పూట" అంది ఉమ. తన దగ్గరే పడుకోబెట్టుకొంది.

శాంతికి నిద్రపట్టటంలేదు.

భాగ్యం ఎంత ద్రోహం చేసింది?

తన బతుకుని అల్లరిపాలు చేయడానికి ఎంతలా తెగించింది?

పాముని చేరదియ్యడం పాపం! అటువంటిదే భాగ్యం! దానితో కూడిక మంచిది కాదు!

"ఇంకా నిద్రపోలేదా?" అనడిగింది ఉమ.

శాంతి జవాబివ్వలేదు.

గోడ గడియారంలో రెండు ముళ్ళూ పన్నెండు దగ్గరగా కలసి వున్నాయి.

"రాత్రి పన్నెండయింది. పడుకో" అంది ఉమ. శాంతి తలపై చేయివేసి నిమిరింది. కళ్లు మూసుకొంది శాంతి.

ఉదయం—

పది గంటలకు కాలేజీకి ప్రయాణమైంది. పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. క్లాసులు సరిగ్గా జరగటం లేదు. ఈ సమయంలో కాలేజీకి శలవు పెట్టడం తనకే నష్టమని నిర్ణయించుకొని బయల్దేరింది.

కాలేజీ చుట్టుపక్కల ఎక్కడా రవి, ఆనంద్‌లు కన్పించలేదు. భాగ్యం కూడా అదృశ్యమయింది.

జరిగిన సంఘటనకి భయపడి ముగ్గురూ కాలేజీకి డుమ్మా కొట్టి వుంటారు.

భాగ్యం ముఖం మళ్ళీ తను చూడగలదా, ఆమెతో మాట్లాడగలదా నన్పించింది శాంతికి.

తను భాగ్యంతో మాట్లాడినా, లేకపోయినా భాగ్యానికేమీ నష్టం లేదు. ఆ పిల్ల తండ్రి కోటయ్య ఆస్తిపాస్తులు గలవాడు. వూర్లో మోతుబరీతనం, పలుకు

బడి వున్నవాడు.

తన కూతురు తప్పు చేసిందంటే - దాన్ని వొప్పుగా మార్చగల సత్తా వున్నవాడు. అందుకనే భాగ్యం తప్పులు తప్పులుగా కన్పించవు.

అదే శాంతి తప్పు చేస్తే! ఇంకేమైనా వుందా? పదహారణాల బ్రాహ్మణ పడుచు తప్పు చేసిందని, కులానికే కళంకమని తలతీసి మొల వేస్తారు.

పేదబ్రాహ్మడు పంతులు కూతురెక్కడ?

ఆ సిపాస్తులున్న కోటయ్య కూతురెక్కడ?

నక్కకీ, నాగలోకానికీ వున్నంత వ్యత్యాసం!

శాంతి దీర్ఘంగా నిట్టూర్చింది.

రాత్రి భాగ్యం ప్రసక్తి తను తీసుకు రాకపోవడమే శ్రేయస్కరమయింది. లేకపోతే తనసీపాటికి పెత్తందార్లంతా కలసి ఏమైనా చేసి వుండేవారు. కావాల్సిన వాళ్ళంతా కుమ్మక్కై తనని నిలువునా చీల్చివేస్తారన్పించింది.

సాయంత్రం అయిదయింది.

రాజయ్య ఇంటి గుమ్మంలో భాగ్యం కన్పించింది. కాని శాంతిని పలకరించ లేదు. శాంతి చూసే చూపులు మరల్చుకొంది. ఉమతో ఏదో మాట్లాడుతోంది.

కరుణ ఆలయ ప్రాంగణంలోకి వచ్చింది.

"సంధ్య దీపం వెలిగించనా" అనడిగింది శాంతిని. అంతవరకూ ఆ వూహే తట్ట సందుకు తనని తాను నిందించుకొని లేచి వెళ్ళి దీపం వెలిగించి దేవుడి ముందుగా వుంచింది శాంతి.

హోరుగా గాలి వీస్తోంది.

వర్షం వచ్చే సూచనగా వుంది.

"భాగ్యానికి నీ విషయం చెప్తే చాలా బాధపడింది" అంది కరుణ.

"ఆహాఁ" అనగలిగింది శాంతి-గుండెల్లో బాధ ఎగదంతున్నా.

"కూర్చో కరుణా" అంది.

కరుణ కూర్చుని శాంతిని చూస్తోంది. శాంతికి కరుణతో ఏ విషయాలూ మాట్లాడాలని లేదు. అందుకని మిషన్ మీద ఏదో కుడుతూ కూర్చుంది.

జల్లు ప్రారంభమయింది.

ఆలయంలోని గంట గాలికి అటూ ఇటూ వూగుతూ లయగా శబ్దిస్తోంది.

"వర్షం వస్తోంది. నేనింటికి పోతాను" అంది కరుణ. లేచి వెళ్ళిపోయింది. ఆ అమ్మాయికి మాటలు గడవకపోవడంతో ఇబ్బందన్పించింది.

శాంతి ఒంటరిగా కూర్చొని ఆలోచిస్తోంది.

అంత వర్షంలోనూ ఉమ శాంతి ఇంటికి వచ్చింది. వస్తూనే శాంతి పక్కగా కూర్చుని-"భాగ్యానికి నీ విషయం చెప్తే చాలా పెద్దగా బాధ పడింది. నీ దగ్గరికి వస్తానంది-వచ్చిందా?" అనడిగింది.

రాలేదన్నట్టుగా తలూపింది శాంతి.

ఉమకి అనుమానం రేగింది. ఇద్దరికిద్దరూ శాంతి, భాగ్యం స్నేహితులు! అటువంటిది భాగ్యం శాంతిని పలకరించడానికి కూడా రాలేదంటే ఏదో గూడుపుఠాణీ వుందనుకొంది.

భాగ్యం చెడుతిరుగుళ్ళు ఉమకి తెలుసు. ఈ తతంగాన్ని భాగ్యం దగ్గరుండి ఎందుకు జరిపించకూడదన్పించింది ఆమెకి. ఆ అనుమానం కలగడానికి కూడా భాగ్యం ఈ రోజు ప్రవర్తన కళ్ళకి కట్టినట్టుగా కన్పించింది. శాంతి

విషయం మాట్లాడితే బాధ నటిస్తూందే తప్పా, ఆ ముఖంలో బాధ కన్పించలేదు.

అసలు విషయాన్ని శాంతిని అడుగుదామంటే ఆ పిల్ల బాధపడుతుందని ఆలోచించి వూర్కొంది ఉమ.

"భాగ్యం వచ్చి నన్ను ఓదార్చాలా? నేనేం పోగొట్టుకొన్నాననని?" అంది శాంతి నవ్వుతూ.

"అది కాదులే! అంత స్నేహం కదా మీ ఇద్దరికీ—ఈ విషయం తెలిసి కూడా నిన్ను పలకరించడానికి రాలేదంటే ఏదో అన్పించి అడిగాను. సరే! రాత్రి నీకు ఒంటరిగా పడుకోడానికి భయం వేస్తే చెప్పు—కరుణని సాయంగా పంపిస్తాను"

"ఆ రాముడు అండ వుండగా నాకేం భయం" శాంతి ఆలయంలోని దేవుణ్ని చూపెట్టి అంది.

ఉమ నవ్వుకొని వెళ్ళిపోయింది.

* * *

శాంతి కాలేజీ నుండి తిరిగొస్తుంటే ఉమ పిలిచింది.

"నీకు వుత్తరం వచ్చింది" అంది కవరు అందిస్తూ.

కవరును పుస్తకంలో దాచేసి వేగంగా నడిచింది ఇంటివైపు శాంతి. ఉమ పరీక్షగా చూసింది ఆమె నడకని.

ఆత్రంగా చించి చదివింది

ఆదివారం రాత్రి ఊరికి వస్తున్నట్టుగా గోపాల్ రాశాడు. ఆ విషయం కొండంత బలాన్నిచ్చింది శాంతికి.

తనివితీరా వుత్తరాన్ని గుండెలకి హత్తుకొంది.

ఉమలోనికి వచ్చినా గమనించలేదు శాంతి.

"ఏమిటా ఉత్తరం—అలా హాయిగా వున్నావు?" అనడిగింది ఉమ.

శాంతి సిగ్గుపడి జవాబివ్వలేక పోయింది.

"ఏం రాశాడు?"

"ఎవరు?" ప్రశ్నించింది శాంతి. మళ్ళీ తనే—

"మా నాన్నని—ఎవరిదో పెళ్ళికి రమ్మనమని..." అంటూ ఆగింది.

"నీ పేర్న రాసేరేమిటయితే?" వెయ్యి ప్రశ్నలు ఆ ఒక్క ప్రశ్నలోనే గుప్పించింది ఉమ.

ఉక్కిరిబిక్కిరయింది శాంతి. ఉమ తెలివితేటల ముందు తన పన్నాగాలు నెరవేరవన్పించింది. కిందకి చూస్తూ నిలుచుంది.

"నా దగ్గర కూడా దాపరికాలా? చెప్పు ఎవరు రాశారా వుత్తరం'' శాంతి తలని పైకెత్తి—ఆ కళ్ళల్లోకి చూస్తూ ఆప్యాయంగా అడిగింది ఉమ.

శాంతి సిగ్గుపడుతోంది.

"పోనీ ఆ రాసిందెవరో నేను చెప్పనా? ఆ దస్తూరి నాకు బాగా పరిచయం'' అంది ఉమ.

ఆశ్చర్యంగా చూసింది శాంతి. "ఉమా!" అంది ఇంకేం మాట్లాడాలో తోచక. తర్వాత సమ్రమతగా ఉత్తరాన్ని ఉమ చేతికి అందించింది.

ఉత్తరాన్ని ఆసాంతం చదివింది ఉమ. తలెత్తి శాంతివైపు చూసింది. శాంతి తల దించుకొని నిల్చుంది....ఆలోచిస్తోంది.

ఉమ ఏమంటుంది? తెలిసిన విషయాన్ని ఏ రకంగా అర్థం చేసుకొంటుందన్నది ఏ విధంగా వుంటుంది?

"కూర్చో శాంతీ!" ఉమ చేయిపట్టి శాంతిని కూర్చోబెట్టింది. పక్కగా తనూ కూర్చుంది.

"నాకీ విషయంలో చాలా రోజు

ల్నుండే అనుమానంగా వుంది. అమ్మ దొంగా! నా దగ్గరే నీకు రహస్యాలా?"

అమాయకంగా ఉమ వైపు చూసింది శాంతి.

"మా మధ్య విడదీయరాని బంధం ఏర్పడింది.మా ఇద్దరిలో ఎవరు లేకఎవరూ బతకలేం! ప్రేమించుకొన్నాం. పెళ్లిచేసు కోలేదుగాని, మా మనసులలాగే మా తను వులు కూడా ఒక్కటయ్యాయి. ఈ విషయాలు ఎవరికీ చెప్పొద్దన్నారాయన. తనే చెప్పి పెద్దలతో పెళ్లికి వొప్పిస్తా నన్నారు"

"ఏం వొప్పిస్తాడు శాంతీ! ఇద్దరూ తొందరపడ్డారంటాను నేను. భాగ్యాన్ని ఎలాగోలా తన కొడుక్కి కట్టబెట్టాలని మా అమ్మ చూస్తోంది. మేనకోడల్ని చేసుకుతీరాలని ఆవిడ పంతం. మా అమ్మ మాటని కాదనే శక్తి మా నాన్నకు లేదు. గోపాల్ కాదని ఎదురు తిరిగినా లాభం వుండదేమో!

"నాకంతా అయోమయంగా వుంది. నాకు మొదట్నుంచీ మీ ఇద్దరి మీదా అనుమానం! ఆ అనుమానం అనురాగంగా మారిందంటే నేను సంతోషిస్తున్నాను. అయితే పరిస్థితులు అనుకూలించి మీ ఇద్దరికీ పెళ్లి జరుగుతుందని మాత్రం వూహించలేకపోతున్నాను"

ఉమ ఖండితంగా అనేసింది.



గొల్లుమంది శాంతి.

ఏడుస్తోన్న శాంతిని వూరడిస్తూ — "భయపడకు శాంతీ! ఏది ఎలా రాసి పెట్టుంటే ఆ విధంగా జరుగుతుంది. అయితే ఈ పెళ్ళికి నా శాయశక్తులా కృషి చేస్తాను" అంటూ హామీ ఇచ్చింది ఉమ.

"వస్తాను" అంటూ వెళ్ళిపోయింది.

రాత్రి పంతులొచ్చాడు. కాంతం జరిగిన వివరాలన్నీ ఏకరువు పెట్టింది. ఆందోళన పడ్డాడాయన. వచ్చి కూతుర్ని కూలంకషంగ చెప్పమన్నాడు.

భాగ్యం తనకి చేసిన మోసంతో సహా ఆ రాత్రి జరిగిన సంఘటనంతా పూస గుచ్చినట్టుగా చెప్పింది శాంతి.

"మన బతుకుల్ని మర్యాదగా బతకనిచ్చేట్లులేరు" అన్నాడు పంతులు.

"అయినా ఆ పిల్లకి మనమేం ద్రోహం చేశామని" అని విసుక్కున్నాడు.

"దేవుడు అన్యాయాన్ని భరించడు. దానికి తగిన శాస్తి చెయ్యక మానడు" అన్నాడు దేవునిపై భారం మోపి.

రాత్రంతా శాంతిపై జరిగిన అత్యాచారం గురించే ఆలోచించాడు.

'లాభంలేదు. శాంతిని వేగంగా ఓ ఇంటి దాన్ని చేసెయ్యాలి! ఇంకా జాప్యంచేసి వూరుకుంటే వయసొచ్చినపిల్ల ఏ అఘాయిత్యానికైనా ఒడిగడుతుంది. లేదా ఆమెను ఒడిగట్టేటట్టు చేస్తారు జనం' అన్పించింది.

చాలీచాలని బతుకుల్లో బతకడం కంటే హీనమైన పరిస్థితి లేచసుకొన్నాడు. అల్లుడు అందరికీ బావే! అలాగే అల్లుడి కూతురు కూడా అందరికీ లోకువసుకున్నాడు.

ఆదివారం ఉదయం పదకొండు గంటలకే వచ్చాడు గోపాల్. అతనొచ్చిన విషయం శాంతికి తెలిసి బయటికీ, లోనికీ కాలుగాలిన పిల్లిలా తిరగసాగింది.

అయినా అతగాడు కన్పించలేదు.

ఇంటికి వస్తూనే "శాంతీ!" అంటూ వచ్చి తన ఒళ్ళోవాలే మనిషి ఇంతవరకూ పత్తా లేదంటే ఎందుకో భయమన్పిస్తోంది.

ఇంట్లోవాళ్ళు జరిగిన విషయాలు చెప్పేరా?

అతను అపార్థం చేసుకొన్నాడా?

తననేవిధంగా ఆదరిస్తాడు మరి?

పరిపరి విధాలా మనసుపోతోంది...!

ఉమ వచ్చేది రోజూ! అటువంటిది ఈ రోజు ఉమ కూడా రాలేదు. కారణం ఏమయి వుంటుంది?

ఆందోళనగా వుంది శాంతికి.

గుండెల్లో దడదడ!

నడకలో నిలకడలేదు!

ఆత్రంగా వుంది.

శాంతి దేవునిముందు మోకరిల్లి కాసంత మనస్తాపాన్ని తీర్చుకొంది. దీపాన్ని వెలిగించి దైవసన్నిధిన వుంచింది.

ఇంతలో ఉమ రానేవచ్చింది.

"చాలా కంగారుగా వుందికదూ— గోపాల్ నీ దగ్గరికి రాకపోవడం! ఆయన గారు ఎవరో స్నేహితుడితో కలసి పల్లె వెళ్లాడు. రేపుదయానికి కాని రాడు" అంది ఉమ చావుకబురు చల్లగా చెప్పినట్టు.

శాంతికి సిగ్గన్పించింది. తన ఆలోచనలకి తననే నిందించుకుంది.

"ఇదిగో పాయసం. ఇంట్లో గోపాల్ వచ్చాడని స్వీట్ చేసింది అమ్మ. మరదలికి ఇచ్చిపోదామని వచ్చాను"

"కూర్చో" మంచం వాల్చింది శాంతి.

ఉమ మంచమ్మీద కూర్చుంటూ-

"గోపాల్ రాగానే అమ్మ అంతా ఏకరువు పెట్టింది. అయితే గోపాల్ ఏమీ మాట్లాడలేదు. కూడా వచ్చిన స్నేహితుడి పెళ్లి చూపులట పల్లెలో. అందుకని ఇద్దరూ వెళ్లిపోయారు. రేపుదయం వస్తారేమో" అంది.

"కాంతం అత్త అంతా చెప్పేసిందా?' ఆందోళనపడింది శాంతి.

"చెప్తే ఏమయింది? అక్కడికేదో నీ తప్పున్నట్టుగా బాధపడుతున్నావేమిటి?"

"ఆయన వేరేగా అర్థం చేసుకొంటారేమోనని"

"పిచ్చిపిల్లా! గోపాల్ అంత అమాయకుడేం కాదు" అంది ఉమ. లేచి వెళ్లిపోయింది.

తెల్లారుఝామున తలుపు చప్పుడికి మెలకువవచ్చింది శాంతికి. గడియారం వైపు చూసింది.

మూడున్నర!

గుండెలు భయంతో గుబగుబలాడాయి. ఈ సమయంలో ఎవరై ఉంటారు? లేచి తలుపు దగ్గరగా వెళ్లి "ఎవరు?" అంటూ అడిగింది.

"నేను గోపాల్ని"

తృప్తిగా నిట్టూర్చింది శాంతి. తలుపు తీసింది. గోపాల్ లోనికి వచ్చాడు. తలుపు గడియవేసిందామె.

ఒకర్నొకరు క్షణకాలం చూసుకున్నారు. ఇద్దరి కళ్లల్లో ఆనందం తొంగి చూస్తోంది.

అతని చేతిలో వాలిపోయింది. శాంతి ఏడుస్తూ.

"ఏడుపు దేనికి శాంతీ! జరిగినదాంట్లో నీ తప్పేం లేదుగా?" అన్నాడు గోపాల్.

"అదికాదు గోపాల్! జరిగిన దానికి అసలు కారణం భాగ్యం" అంటూ అంతవరకూ జరిగిన వివరాలు పూర్తిగా చెప్పింది. అంతావిని కసిగా పళ్లు నూరాడు.గోపాల్.

"అయితే ఇంత అఘాయిత్యానికి అసలు కారకురాలు అదన్నమాట. దాన్ని చంపినా పాపంలేదు" కోపంగా అన్నాడు.

ఒళ్ళో పడుకొన్న శాంతిని ఓదార్పుగా నిమురుతూ "దాని సంగతి నీకు పూర్తిగా తెలిసి కూడా దాన్ని నమ్మి వెంటవెళ్లావంటే నేను ఏడ్వాలో నవ్వాలో తెలియట్లేదు" అన్నాడు.

"తప్పే గోపాల్! కాదనను. కాని, భాగ్యానికి నేనేం మోసం చేశాను. ఇంకా మేలు చేశాను చూసింది దాచిపెట్టి! ఎవరికీ చెప్పలేదుకూడా"

"అలా దాచిపెట్టినందుకే భయపడ్డారు వాళ్లు. రేపుదయం నువ్వు పదిమందికీ చెప్పి వాళ్ళ పరువు తీస్తావని ఆలోచించే నీకీ శాస్తి చేద్దామనుకొన్నారు. సరే! వాళ్ల అంతు చూస్తాను"

"నిజం గోపాల్! వాళ్ల అంతు చూడాల్సిందే! లేకపోతే నా మనసుకి శాంతి లేదు" అంది శాంతి.

"ఆలోచిద్దాం! తొందరపడకు"

"మళ్లీ పట్నం ఎప్పుడు వెళ్లేది?" అతని కళ్లలోనికి చూస్తూ ప్రశ్నించింది.

"అపుడే వెళ్ళను. ఈ తతంగాన్నంతా తేల్చుకొని మరీ వెళ్తాను" అన్నాడతను.

కొద్ది నిమిషాలు గడిచాయి మౌనంగా.

"ఉమకి మన విషయం చెప్పాను" అంది శాంతి.

ఆ విషయం తెలుసన్నట్లుగా తలూపాడు గోపాల్.

"ఉదయం రాగానే అడిగింది. అవును అన్నాను. సంతోషపడింది. అక్కడికి

మన విషయం తెలిసినా ఫర్వాలేదు. పోతే అమ్మకీ, నాన్నకీ తెలిస్తేనే గొడవ! ఈలోపు బాక్‌గ్రౌండ్ తయారుచేసి వాళ్లని పెళ్లికిఒప్పించాలి" అన్నాడు ఆలోచనగా.

ఆనందంగా అతని పెదవుల్ని అందు కొంది శాంతి. గోపాల్ ఆమెను మరింత దగ్గరగా తీసుకొన్నాడు....!





కాలేజీకి శాంతి వెళ్ళగానే— ఆవరణలో గోపాల్ కన్పించాడు. రవితో ఏదో మాట్లాడుతున్నాడు. ఇద్దరూ కలసి నవ్వుకొంటున్నారు. వాళ్ళతో ఆనంద్ కూడా వున్నాడు.

ఆ ముగ్గుర్నీ చూసింది శాంతి. వాళ్లు తనవైపే చూస్తూ నవ్వుతున్నారన్నది స్పష్టమయింది. తల వంచుకొని క్లాసు వైపు నడిచింది.

భాగ్యం కాలేజీకి వస్తూనే—

"ఎప్పుడు రావడం బావగారూ?" అంటూ గోపాల్ దగ్గరగా వెళ్లి కూర్చుంది.

"రాత్రే వచ్చాను. అయితే నిన్ను కలవడానికి వీలయింది కాదు. నేరుగా ఇక్కడే కలుద్దామని వచ్చాను. ఇగో ఆనంద్, రవీ మాట్లాడుతున్నారు. కూర్చు న్నాను సిగురించి చూస్తూ" అన్నాడు గోపాల్ – భాగ్యాన్ని ఎగాదిగా పరీక్షిస్తూ.

"రా! క్లాసులోనే కూర్చుందాం" అంది భాగ్యం. చేయిపట్టి అతన్ని లాగింది. మిగిలిన ఇద్దరూ వాళ్లని అనుసరించారు.

క్లాసంతా ఖాళీగా ఉంది. ఒకరూ అర తప్ప క్లాసులో స్టూడెంట్లు లేరు. లెక్చరర్ రాలేదాపూట.

శాంతి వాళ్ళకి కొద్దిదూరంలో కూర్చుంది.

"చెప్పు బావా మీ కాలేజీ విశేషాలు" భాగ్యం ముద్దు గునుస్తూ ప్రశ్నించింది.

"అక్కడే విశేషాలూ లేవు. వుంటే ఇక్కడే ఉండాలి. నువ్వే చెప్పు"

"భలేవాడివే!" అంది నవ్వుతూ.

"అదేమిటి? నీ స్నేహితురాలు ఒంట రిగా కూర్చుంది. నీతో మాట్లాడదా ఏం" అనడిగాడు గోపాల్.

"దానికి వంటినిండా గీరలా ఉంది. నాతో మాట్లాడదిప్పుడు"

"అబ్బో అంత గీర్వాణం ఎక్కడిది?"

"ఏమో!" పగలబడి నవ్వింది భాగ్యం. తరువాత క్లాసుకు టైమ్ అయింది. లేచి వస్తానని వెళ్లాడు గోపాల్. వెళ్తూ—

"సాయంత్రం తప్పక కలవండి రవీ! మాట్లాడదాం" అన్నాడు.

"ఏం మాట్లాడతారు?" భాగ్యం రవి కళ్లలోకి తీక్షణంగా చూస్తూ ప్రశ్నిం చింది. కొంపదీసి తన విషయాలు మాట్లాడడానికి కాదుగదా అన్న అను మానం రేగింది.

"ఏం లేదు! సరదాగా షైరుకి" అన్నాడు రవి.

"జల్సాగా ఖర్చుచేస్తాడు. సరదాగా తిరిగి రావచ్చు" ఆనంద్ అన్నాడు.

"జల్సాగా ఖర్చు చేస్తాడా?" అంటూ ఫకాల్న నవ్వింది భాగ్యం.

"ఎందుకా నవ్వు?" రవి అడిగాడు.

జవాబివ్వలేదు భాగ్యం.

"కాబోయే మొగుణ్ని గేలి చేయ కూడదు" ఆనంద్ అన్నాడు.

నవ్వుతూ అతని వైపు చూసింది భాగ్యం.

"వట్టి పిసినారి! అందుకు నవ్వాను" అంది.

సాయంత్రం అయిదు గంటలకి—

రవి గోపాల్ని పంచాయితీ ఆఫీసు దగ్గరగా కలిశాడు.

"రా! టీ తాగుదాం" ఆహ్వానించాడు గోపాల్. పక్కనే ఉన్న పాకా విలాస్ లోనికి చేరారు.

"జూనియర్ కాలేజీ ఎలా ఉంది?" అనడిగాడు.

"బాగానే వుంది" సమాధానమిచ్చాడు రవి.

"బాగా చదివేవాళ్లెవరు మీ క్లాసులో?"

"ఎందరో లేరు. ఒక్క శాంతే బాగా చదివేది"

విలాస్ నుంచి బయటపడ్డారు. నడుస్తున్నారు.

"చదువుకి తగ్గ అహంకారం ఆ పిల్లకి"

"అంత అహంకారా?" గోపాల్ నవ్వుతూ అడిగాడు.

"అంతా ఇంతా కాదు. దాన్ని అణచాలనే అనుకొన్నాం కాని తప్పుకొంది"

నడుస్తూనే ఊరి శివారికి వచ్చారు. చింతతోపు జుత్తు విరబోసుకున్న వింత జంతువులా కన్పిస్తోంది.

"రా తోపులో కూర్చుని మాట్లాడుకుందాం! హాయిగా వుంటుంది" అంటూ గోపాల్ దారి తీశాడు. అనుసరించాడు రవి

"ఎలా తప్పుకుంది?" కొనసాగిస్తున్నట్లుగా అడిగాడు గోపాల్. చెప్పడానికి జంకాడు రవి.

"చెప్పు! ఇలాంటివి వినాలంటే నాకు భలే సరదా"

"అయితే విను" అని వివరంగా చెప్పుకొచ్చాడు రవి. అందులో భాగ్యం ప్రసక్తి ఏ కోశానా రాలేదు.

"శాంతి కోర్టుకి వెళ్తే?" గోపాల్ భయపెడుతున్నట్లుగా అన్నాడు.

"మహా అయితే నాలుగు నెల్ల జైలు శిక్ష అంతేగా!"

"శాంతి ప్రతీకారం తీర్చుకుంటే?"

"ఆడది. అదెలా తీర్చుకొంటుంది"

పిడికిలి బిగించి ముఖం మీదుగా బలంగా గుద్దాడు గోపాల్. రవి వెనక్కి విరుచుకు పడ్డాడు.

"నిన్ను చంపినా పాపం లేదు" అంటూ వాడిమీద పడి చావ బాదాడు గోపాల్.

ఇంతలో మరో యువకుడు ప్రవేశించాడక్కడికి.

"తాడు తెచ్చావా?" అనడిగాడు గోపాల్ అతన్ని.

తెచ్చానన్నట్లుగా తలూపాడు రంగా.

"వీణ్ని చెట్టుకు కట్టేయ్"

రవి చేతులు వెనక్కి విరిచి కట్టి, చెట్టుకు కట్టేశాడు రంగా.

"నేనేం పాపం చేశాను గోపాల్" రవి ఏడుస్తున్నాడు.

"ఏ పాపం చేశావో రంగా చెప్తాడు విను" చాచి లెంపకాయ కొట్టాడు గోపాల్.

"ఆడదాన్ని ఒంటరిగాచూసి బలాత్కరిస్తారా?" రంగా ముక్కు మీద గుద్దాడు.

"చంపొద్దు! నన్ను చంపొద్దు"

అన్నాడు రవి ఏడుస్తూ.

"చంపేస్తే ఏముంది. హాయిగా ఛస్తావ్! నిన్ను చంపం! చిత్రవధ చేస్తాం" గోపాల్ ఆవేశంగా రవి డొక్కలో పొడిచాడు.

"చావు లమ్డీకే...చావు! ఈ రాత్రంతా చలిలో చావు" రంగా వెళ్దామన్నట్టుగా గోపాల్ వైపు చూశాడు.

గోపాల్ ముందుకు నడిచాడు.

"ఆనంద్ ఎక్కడున్నాడు?" ప్రశ్నించాడు రంగా.

"ఇంట్లో వున్నాడు. నువ్వు వంతెన దగ్గరుండు. నేను వెళ్లి వాణ్ని లాక్కొస్తాను" అన్నాడు గోపాల్ ఆనంద్ ఇంటికి వెళ్లాడు.

"వస్తానని చెప్పి ఇంత ఆలస్యమా?" ఆనంద్ అడిగాడు.

"ఆలస్యం అయింది ఏం చేస్తాం! నువ్వు పాతిక రూపాయలు అప్పు అడిగావుకదా-ఆ డబ్బులు సంపాదించడానికి ఇంత టైమ్ అయింది. ఇందా"

ఆనంద్ సంతోషంగా స్వీకరించాడు.

"అలా షైరు రాకూడదూ? కాసేపు తిరిగొద్దాం" అనడిగాడు గోపాల్. కాదనలేదు ఆనంద్.

ఇద్దరూ నడుస్తున్నారు.

వంతెన దగ్గరగా వచ్చి కూర్చున్నారు. అక్కడే కూర్చున్న రంగాని చూశాడు ఆనంద్. అయినా ఏమీ అనుమానించలేదు.

"శాంతిని ఏం చేయబోయ్యారా?" వివరాలు అడుగుతున్నట్టుగా అడిగాడు గోపాల్.

"ఏ శాంతిని?" అమాయకంగా ప్రశ్నించాడు ఆనంద్.

"ఓసోస్! ఎంతమంది వున్నార్రా మీ కాలేజీలో శాంతులు. చెప్పరా! రవి కొన్ని వివరాలు చెప్పాడు. సరదాగా వుంది వినడానికి. చెప్పు"

చెప్పబోయాడు ఆనంద్.

అంతే!

గోపాల్ పిడికిలి బలంగా ఆనంద్ గుండెను తాకింది. ఆ విసురుకి ఆనంద్ నీళ్లల్లో పడ్డాడు. లేచి బయటికొచ్చి పారిపోబోయాడు.

రంగా అడ్డుపడి నిలిపాడు.

ఇద్దరూ చిత్తం వచ్చినట్లుగా చావబాదారు.

"రవిగాడు ఆ తోపులో ఏడుస్తూ పడున్నాడు. నువ్వుకూడా సాయం వెళ్లు" గోపాల్ మరో తాపు కసితీరా తన్ని వెళ్ళిపోయాడు. రంగా కూడా అతని వెంట నడిచాడు.

"ఇలాంటి వెధవల్ని ఒకే ఒక దెబ్బకి ఫినిష్ చెయ్యాలి" రంగా ఆవేశంగా అన్నాడు.

"అమ్మమ్మ! చంపకూడదు. చావబాదాలి! ఇలా అయితే బుద్ధొస్తుంది" అన్నాడు గోపాల్.

ఆలయంలోకి వచ్చాడు. శాంతి ఎదురు చూస్తోంది.

"దొరికారా." అనడిగింది ఆత్రంగా.

"దొరికారు! చావ బాదాం"

"ఊర్లో వాళ్లకి ఈ విషయం తెలిస్తే"

"తెలిస్తే తెలియనీ! అన్నీ తెలిసేగా ఈ పని చేసింది"

"నాకు భయంగా వుంది" అంది శాంతి.

"నీకెందుకు భయం" గోపాల్ శాంతిని దగ్గరగా తీసుకొన్నాడు.

రవిని, ఆనంద్ని చావబాదారన్న విషయం ఊరి పెద్దలందరికీ రాత్రికి

రాత్రే తెలిసింది. కారణం ఏమయివుంటుం
దన్నది అంతుపట్టలేదు.

రాజయ్య ఇంటికొచ్చి జరిగిందంతా
చెప్పాడు ప్రెసిడెంట్. రాజయ్య కిమ్మన
లేదు. ఆ విషయం తనకి ముందే తెలుసు
అన్నట్టుగా వూరుకొన్నాడు. తర్వాత
శాంతి విషయం చెప్పాడు.

"అయితే మాత్రం చావతంతారా?"
అనడిగాడు ప్రెసిడెంట్.

రవి పెద్దవాళ్ళూ,ఆనంద్ తల్లిదండ్రులూ
ఏడుస్తూ వచ్చారక్కడికి.న్యాయాన్యాయ
విచారణ చెయ్యమన్నారు.

"ఎందుకిలా చేశావు?" గోపాల్ని
అడిగాడు ప్రెసిడెంటు.

"తెలీదా నీకు?. అవున్లే శాంతి నీ
కూతురయితే నీకు తెలిసొచ్చేది"
అన్నాడు గోపాల్.

"మంచి మాటన్నావు" అన్నారెవరో

"అదే నీ కూతురికి జరిగితే వాళ్ళని
ప్రాణాలతో వుంచవు. నేను కాబట్టి తన్ని
వదిలేశాను"

"వాడన్న మాటలు నిజమే"

"పోలీసు రిపోర్టిస్తాం మేం" రవి
మామయ్య కల్పించుకొన్నాడు.

"నీ ఇష్టం వచ్చినవాడికి రిపోర్టివ్వు"
గోపాల్ విసురుగా ఇంట్లోకి వెళ్ళ
బోయాడు.

"ఒకరితప్పుల్ని ఎత్తిచూపించేముందు
మంచీ చెడూ ఆలోచించండి" అన్నాడు
మళ్ళీ.

పెద్దలెవరూ మరి మాట్లాడలేదు.
కాసేపు నిశ్శబ్దంగా కూర్చున్నారు.
తర్వాత—.

రాజయ్య దగ్గరగా వచ్చి అన్నాడు
కోటయ్య—

"అయిందేదో అయింది. వాళ్ళ ఎదాన
ఇంత సొమ్ము పడేస్తే కిక్కురుమనకుండా
వుంటారు. లేకపోతే లనిపోని తంటా"
అన్నాడు.

రాజయ్య సరేనన్నాడు.

గోపాల్ అందుకు ఒప్పుకోలేదు.

"డబ్బులిచ్చి వాళ్ళని బరిమీద వదల
కండి" అన్నాడు.

ప్రెసిడెంట్ నచ్చచెప్పబోతే ససేమిరా
వీల్లేదన్నాడు.

"తొందర పడకూడదు గోపాల్!
ఇలాంటివే మన కొంపలు ముంచుతాయి.
ఆవేశం ఆపుకోవాలి" సర్దిచెప్పబోయాడు.

"రోషం వుండి ఆవేశాన్ని చల్లార్చు
కొంటే, అవతల ఆడవాళ్ళకి మాన
ప్రాణాలు దక్కనివ్వరీ వెధవలు!
అందుకే ఈ పని చేశాను"

మరిక వినేరకం కాదనుకొన్నాడు
ప్రెసిడెంటు. ఊరుకొన్నాడు.

అంతా ఫైసలా అయింది.

ఎవరిమానాన వాళ్ళు వెళ్ళిపోయారు.
గోపాల్ మేడమీది గదిలోకి వెళ్ళి పడు
కొన్నాడు.

ఉమ, శాంతి కింది వసారాలో అంతా
చూస్తూ నిల్చున్నారు.

"వాడేడి?" రాజయ్య అడిగాడు.

"పైన పడుకొన్నాడు" ఉమ
సమాధానమిచ్చింది.

"మీరు కూడా వెళ్ళి అక్కడే పడు
కోండి! లేకపోతే మళ్ళీ ఏ అఘాయిత్యం
చేస్తాడో" అన్నాడు రాజయ్య.

సరే అన్నారిద్దరూ.

"నాన్న ఏమంటున్నాడు?" ఉమని
ప్రశ్నించాడు గోపాల్.

"ఏమంటాడు? కొడుకు చేసిన నిర్వా
కానికి పొంగి పోతున్నాడు" అని
నవ్వింది ఉమ.

శాంతివైపు చూశాడు గోపాల్.

శాంతి మాట్లాడలేదు. భయంగా ఉంది ఆమెకి. పదిమంది నోళ్లలోను తన పేరు నలిగింది. పదిమందికీ తననేం చేశారో నన్నది తేటతెల్లమయింది.

రేపుదయం అందరూ తనని వింతగా చూస్తుంటే తలెత్తుకు ఎలా తిరగ్గలుగుతుంది?

అయోమయంగా వుంది శాంతికి.

దుఃఖం పెల్లుబికి వస్తోంది.

*  *  *

ఊర్లోనే వున్న అత్తవారింటికి వెళ్లిపోయింది ఉమ. గోపాల్ కూడా పట్నం వెళ్లడానికి ప్రయాణమయ్యాడు. సూట్‌కేస్ సర్దుకొని శాంతి దగ్గరకి వచ్చాడు.

పంతులు ఆలయంలో పూజ చేస్తున్నాడు.

"వెళ్తున్నాను శాంతీ!" అన్నాడు గోపాల్ మిషన్‌మీద బాధగా చేయి ఆన్చి.

"మళ్లీ ఎప్పుడొస్తావ్?" అనడిగింది శాంతి అతని కళ్లలోకి చూస్తూ.

"మరో రెండు వారాల్లో"

అతనికి దగ్గరగా వచ్చింది శాంతి. ఆవేదనగా—

"గోపాల్" అంది.

"ఏం? భయంగా వుందా?"

"అది కాదు గోపాల్! ఎన్నాళ్లిలా? మన పెళ్లెప్పుడు చెప్పు?"

నవ్వాడు ఆ మాటలకి. శాంతి తల మీదుగా చేయివేసి లాలనగా నిమిరాడు.



"ఇంకా అయిదు నెలలు! ఈలోపు పరీక్షలయిపోతాయి. అప్పుడు అమ్మకీ, నాన్నకీ చెప్పేస్తాను. పెళ్ళి చేసుకొందాం! సరేనా? నమ్మకం లేదా నామీద"

కాదన్నట్టుగా తలూపింది శాంతి.

"నీ మీద నమ్మకం లేకపోడమేమిటి గోపాల్! నమ్మేగదా నా సర్వస్వం నీ కప్పగించింది. అద్సరే! వారానికొకసారైనా రారాదా?" అంది అర్థింపుగా.

"అయ్యబాబోయ్! ఇంకేమైనా వుందా? ఇప్పటికే ఆ ఇద్దర్నీ తన్నినందుగ్గానూ నీ మీదా, నా మీదా చాలా అనుమానాలున్నాయి మా ఇంటి వాళ్ళకి. ఇక వారానికొకసారొస్తే గొడవయిపోతుంది. ఈ అయిదు నెలలూ కొంచెం ఓపిక పట్టు. ప్లీజ్! లేదంటే నువ్వే పట్నం వచ్చేయ్"

సున్నితంగా అతని నోరు మూసింది శాంతి.

"గొప్ప సలహా! అలా అయితే గొడవలు జరగవా" అంది.

పంతులు లోనికొచ్చాడు. అతని రాకను గమనించి గోపాల్ వెళ్ళిపోయాడు.

"పట్నం వెళ్తున్నాడా?" అనడిగాడు పంతులు.

"ఆఁ" అనేసి చరచరా అక్కడి నుండి కదిలింది శాంతి.

కాంతానికి గోపాల్ మీద అనుమానంగానే వుంది. శాంతితో గోపాల్ కబుర్లు ఆమెకి నచ్చట్లేదు. కాబోయే భార్య భాగ్యంతో పన్నెత్తి పలకరించనివాడు పరాయి పిల్లతో పోసుకోలు కబుర్లాడడం ఆమెకు ఇచ్చగించలేదు.

ఆలయంలోంచి వస్తోన్న గోపాల్ని చూసింది కాంతం.

"ఆరోగ్యం జాగ్రత్త!" అంటూ కేకేసింది.

"అలాగే" నని వెళ్లాడు గోపాల్.

కాలేజీకి శాంతి వెళ్లి వస్తున్నా భాగ్యం ఆమెను పలకరించడం లేదు. పురుగును చూసినట్టుగా చూస్తోంది శాంతిని.

కోటయ్య, అతని భార్య రత్నం భాగ్యం పెళ్లి తొందరగా చేయాలని ఆలోచిస్తున్నారు.

కూతురి నిర్వాకాలు రత్నానికి తెలుసు. అయినా కన్న కడుపు! పైకి చెప్పుకోలేక, మింగలేక ఏడుస్తోందామె.

వేగంగా భాగ్యాన్ని ఓ ఇంటిదాన్ని చెయ్యడం మంచిదన్పిస్తోంది ఆమెకి.

గోపాల్ డిగ్రీ అయ్యే వరకు పెళ్లి చేసుకోనని భీష్మించుకు కూర్చున్నాడు. ఆ ప్రసక్తి తెస్తేనే మండిపడుతున్నాడు. తండ్రి రాజయ్య చెప్పినా విన్పించుకోవట్లేదతను.

రత్నానికి తలనొప్పిగా వుంది ఈ వ్యవహారం.

కూతురు తిరుగుళ్లు—

గోపాల్ ప్రవర్తనా—

ఆమెకేమీ అంతుపట్టట్లేదు.

రత్నం కాంతం దగ్గరకి వచ్చి అడిగింది ఆ రోజు—

"పిల్ల ఎదిగి ఇంట్లో వుంటే బాధగా వుంది వదినా! వేగంగా పెళ్ళి చేసేస్తే బాగుణ్ను"

"తొందరపడకు. మరో అయిదు నెలలాగు"

"ఇంకా ఆలస్యం అంటే నాకెలాగో వుంది. దానికా చదువబ్బట్లేదు. గోపాల్నే కలవరిస్తోందది"

"కలవరించనీ! కావలసిన వాణ్ని

కలవరించడంలో తప్పేంవుంది" అంది నవ్వుతూ కాంతం.

రత్నానికి లోలోపల చిరాకేసినా బయటకు కన్పించలేదు. కాంతంతో మాటలు తెగవు, ముడిపడవు అనుకోంది. సంభాషణని మార్చింది.

"శాంతికి పెళ్లి చేసేట్టున్నారా పంతులు" అని అడిగింది.

"ఏమోనమ్మ? దాని విషయం నాకసలేమీ అంతుపట్టడం లేదు. ఎద్దులా తయారై కాలేజీకి వెళ్తా లేనిపోని తంటాలు కొని తెస్తోంది. దానికి వత్తాసుగా గోపాల్‌గాడు మెస్న ఆ జట్టిలో కలగజేసుకోవడం కూడా నాకు నచ్చలేదు" అసహనంగా అంది కాంతం.

"నిజమే! లేనిపోనివి నెత్తిన చుట్టుకోవడం! అది మాత్రం తక్కువదంటే నేనమ్మను" అంది రత్నం.

కాంతం జవాబివ్వలేదు.

కాంతానికి శతకోటి అనుమానాలున్నాయి గోపాల్ మీద. మాట్లాడితే అవన్నీ దొర్లొచ్చునేమోనని మాట్లాడడం మానుకొంది.

రత్నానికీ అంతే! గోపాల్ మీద ఎన్నెన్నో అపోహలు వున్నాయి. అవి కాంతం నోటి నుండి రాబట్టాలని ఆమె చూస్తోంది. అయితే మాటలు కలవడం లేదు.

"భాగ్యం బొత్తిగా కన్పించడం లేదీ మధ్య"

"ఉమ లేదు. శాంతితో అది మాట్లాడదు. ఇటొచ్చి లాభం లేదనుకొందేమో"

"శాంతితో ఎందుకు మాట్లాడదు? వాళ్ళిద్దరూ స్నేహితులాయె" అంది కాంతం ఆశ్చర్యంగా.

"ఏమో ఎవరికి తెలుసు! సర్లే ఆ పెళ్ళివిషయంలో అన్నయ్యని కొంచెం తొందర చెయ్యి! పరీక్షలవగానే ఇద్దరికీ ముడిపెట్టేస్తే సగం బాధ్యత తీరినట్టు" అంది లేచి వెళ్ళిపోతూ రత్నం.

"కోటయ్యను పంపు. ఆయనతో మాట్లాడతాడు" అంది కాంతం.

"అలాగే" అని రత్నం వెళ్ళిపోయింది.

అక్కడే వాళ్ళిద్దరిమాటలూ వింటున్న కరుణ—

"అమ్మా! భాగ్యం మనకొద్దు" అంది.

"నోర్ముయ్" కసిరింది కాంతం.

"స్కూలు మానేసి ఇక్కడేమిటే వింటున్నావు. వెళ్లు. వెళ్ళి చదువుకో" అని తరిమేసింది.

బిక్క మొహం వేసి నడిచింది కరుణ.

సాయంత్రం——

కోటయ్య రాజయ్యను కలిశాడు.

"నా ఇష్టం ఏముంది ఇందులో! పెళ్ళి చేసుకొనేవాడు వాడు. పెళ్లికొడుకు వాడు. వాడు రానీ. వాడితో సంప్రదించడం మంచిది" అన్నాడు రాజయ్య.

"బాగుంది!వాడిష్టమేమిటి? కన్నతల్లిదండ్రుల ఇష్టంగానీ. భాగ్యం పుట్టిన దగ్గర్నుంచీ వాడి పెళ్లాం పుట్టిందనుకొంటున్నాం ఈరోజు వాడు కాదంటే మానుకొంటామా?" నిలదీసింది కాంతం.

"అయితే వాడి ఇష్టాయిష్టాలతో పని లేదంటావా?"

"లేదని కాదు. నచ్చజెప్పాలంటున్నాను"

రాజయ్య మరి నోరు మెదపలేదు.

"కట్నకానుకల గురించి నువ్వేం భయపడొద్దు నువ్వూహించిన దానికన్నా ఎక్కువే ఇస్తాను. పోతే భాగ్యానికి వాడంటే వల్లమాలిన ప్రేమ. అందుకనే

నేను నీ ఇంట వియ్యానికి ఎగబడు తున్నాను. కాదనకు" అన్నాడు కోటయ్య.

"సరే అయితే! రేపు వాణ్ణి రమ్మంటాను. అంతా కలసి మాట్లాడొచ్చు" అన్నాడు రాజయ్య.

ఆ మాటలకి మూతి విరుచుకుంది కాంతం.

"నీ ఇష్టం" కోటయ్య మరేమీ మాటాడలేక అన్నాడు.

రెండ్రోజుల తర్వాత గోపాల్ని పిలిపించాడు రాజయ్య. అలాగే ఉమని కూడ పిలిపించాడు.

భాగ్యాన్ని గురించి చాలా వదంతులు విన్నాడు ఆయన. ఆ పిల్లని కొడుకు భార్యగా స్వీకరిస్తాడంటే నమ్మకం కలగట్లేదు.

ఏది ఏమైనా వాడిష్టాన్ని తను కాదన లేడు.

ఉమ చెప్పిన మాటలు కొంచెం చెవిన పెడతాడు గోపాల్. అందుకు ఉమని దగ్గరగా వుంచుకొని ఈ తతంగాన్నంతా జరిపించడం మంచిదను కొన్నాడతను.

ఆ రోజు ఇంట్లో సమావేశమయ్యా రంతా.

"భాగ్యం పెళ్ళి చెయ్యాలని మీ మామయ్య తొందరపడుతున్నాడు. నీ పరీక్షలవగానే పెళ్ళి చేసేద్దామను కొంటున్నాం" అన్నాడు రాజయ్య.

"అనుకొంటున్నాం ఏమిటి? చేసి తీర్తాం. చిన్నప్పట్నుంచీ అది వాడి పెళ్ళాం" అంది కాంతం.

"అలా జరగదు. నేను భాగ్యాన్ని పెళ్ళి చేసుకోను" నిర్మొహమాటంగా అన్నాడు గోపాల్.

"హాస్యాలు కట్టిపెట్టు!" కాంతం నవ్వుతూ అంది.

"హాస్యాలు కాదమ్మా నిజమే! నాకది ఇష్టంలేదు. అయినా వాళ్ళిచ్చే కట్నం కానుకలకి నాకంటే మంచి సంబంధమే వస్తుంది వాళ్ళకి"

"వస్తొందొస్తుంది! మాటలు చాలు. దాన్ని నువ్వు పెళ్ళిచేసుకుని తీరాలి. అది నా ఇంటి కోడలే అవ్వాలి" కాంతం పెద్దగా అరచింది.

"నీ ఉద్దేశం ఏమిటి?" ఉమను ప్రశ్నించాడు రాజయ్య.

"నా ఉద్దేశం అమ్మకి బాగా తెలుసు నాన్నా! మళ్ళీ చెప్పడం అనవసరం" అంది ఉమ.

"అస్సలు మీ ఉద్దేశాలెవరివీ నాకర్థం కావట్లేదు" బిగ్గరగా అరుస్తూఅందికాంతం.

"ఇంకా ఏం అర్థం కావాలి! నేను భాగ్యాన్ని పెళ్ళి చేసుకోను. తెలుగులో మాట్లాడినా నీకర్థం కాలేదా?" గోపాల్ రెట్టించాడు.

కాంతం గొల్లుమంది.

వీల్లేదంది!

భాగ్యాన్ని పెళ్ళి చేసుకోకపోతే తనే నుయ్యో, గొయ్యో చూసుకొంటానని బెదిరించింది.

ఎవరూ ఆమె మాటలు అంతగా పట్టించుకోలేదు. రాత్రికి రాత్రే గోపాల్ పట్నం వెళ్ళిపోయాడు.

శాంతి దగ్గరకి ఉమే ఉదయాన్నే వచ్చింది.

"ఏం చేస్తున్నావు శాంతీ!" అని పలకరించింది.

"ఎప్పుడొచ్చావు పుట్టింటికి?" శాంతి ప్రశ్నించింది.

"రాత్రి వచ్చాడు గోపాల్. రాత్రి వచ్చి రాత్రే వెళ్ళిపోయాడు తెలుసా?"

అంది.

"వచ్చాడని తెలుసు. వెళ్ళిపోయాడని తెలీదు"

"భాగ్యాన్ని పెళ్ళి చేసుకోమని గోపాల్ని పట్టుపట్టారు. వాడు కాదన్నాడు. అమ్మ చస్తానంది. రాత్రంతా ఇవేగొడవలు. వెంటనే వెళ్ళిపోయాడు"

శాంతి మాట్లాడలేదు. ఆలోచిస్తూ నిల్చుంది.

కొద్ది క్షణాలు గడిచాయి.

టోపీ తీసి అందించింది ఉమకి.

"కుట్టి చాలా రోజులైంది. మీ ఇంటికి వచ్చి ఇద్దామనుకున్నాను. నువ్వే వచ్చావు" అంది శాంతి.

"రాక తప్పుతుందా మరదలి దగ్గరకి" ఉమ నవ్వింది.

శాంతి నవ్వును పంచుకోలేదు. బాధగా నిల్చుంది.

"భయపడకు శాంతీ! అంతా మేలే జరుగుతుంది. నా చేత గోపాల్ని ఒప్పించాలని నన్ను రమ్మన్నారు. నేను వాడిని ఒప్పించేది నీ పెళ్ళికే నన్నది మావాళ్ళకి తెలీదు పాపం"

తలెత్తి ఆమె వైపు చూసింది శాంతి.

"మళ్ళీ అత్తారింటికి వెళ్ళిపోతున్నాను. ఈసారి నీ పెళ్ళి పిలుపుకే వస్తాను" అంది ఉమ వెళ్ళిపోతూ.

సిగ్గుపడింది శాంతి.

ఆ రోజు కాలేజీలో శాంతిని పలకరించింది భాగ్యం. నాలుగు నెలలైనా వాళ్ళిద్దరి మధ్య మాటలు లేవు. ఇద్దరికిద్దరూ తారసపడితే తలొంచుకొని వెళ్ళిపోయేవారు. అటువంటిది ఆ రోజు "శాంతీ!'' అంటూ భాగ్యం శాంతిని పలకరించింది.

"నా మీద ఇంకా కోపం పోలేదా?" అనడిగింది భాగ్యం శాంతి చేతిని తన చేతుల్లోకి తీసుకొంటూ.

శాంతి చేతిని లాక్కొంది- "నా కెందుకు కోపం"

"నే చేసింది తప్పే శాంతీ! క్షమించు. తెలియక చేశాను. వాళ్ళిద్దరూ నన్ను అలా నడవమన్నారు. నేను నడవక తప్పింది కాదు. ఆ బాధేనన్నిన్నాళ్ళూ నీతో మాట్లాడ నివ్వలేదు" భాగ్యం కన్నీరు పెట్టింది.

భాగ్యం కళ్ళలో కన్నీళ్ళు చూడలేక పోయింది శాంతి.

"దాందేముంది భాగ్యం! మరిచిపో"

"నన్ను క్షమించు శాంతీ!"

"మనలో మనకే! క్షమించుకోడాలేమిటి" నవ్వింది శాంతి. మళ్ళీ మరేదో విషవలయాన్ని సృష్టిస్తోందా అన్పించింది.

తిరిగి స్నేహం చేసి ఏ అత్యాచారానికి పాల్పడుతుంది?

లేక

తన పెళ్ళికి తాను అడ్డంకి అని తెలుసుకొని ఈ మాయా నాటకం ఆడుతోందా అన్పించింది!

"మా ఇంటికి వెళ్దాం రా". అంది భాగ్యం.

"నేరాను"

"ఎందుకని? నేను మళ్ళీ ఏదైనా చేస్తాననా"

"అనికాదు! చెయ్యొచ్చేమోనని అనుమానం"

శాంతి ముఖంలోనికి దీర్ఘంగా చూసింది భాగ్యం.

"పోనీ! నేను మీ ఇంటికి రానా?" అనడిగింది.

"నీ ఇష్టం" అంది శాంతి. అక్కడి నుండి వెళ్ళిపోయింది.

వాళ్ళిద్దర్నీ రవి గమనించాడు. శాంతి వెళ్ళిన తర్వాత భాగ్యం దగ్గరగా

వచ్చాడు.

"ఏమిటి మళ్లీ శాంతితో దోస్తీ చేస్తున్నావు" అనడిగాడు.

"ఏం చేయకూడదా?"

"కూడదు! మీ ఇద్దరూ కలిస్తే మా బతుకులు మంటగలుస్తాయి. అందుకు దూరంగానే వుండాలి"

"అలా చెప్పడానికి నువ్వెవడివి?"

"భాగ్యం" పిచ్చిగా అరిచాడు రవి.

"అంత గట్టిగా అరవకు! గుండెనొప్పి వచ్చి ఛస్తావు" అని గబగబా ముందుకు నడిచింది భాగ్యం.

సాయంత్రం-

శాంతి వద్దకు వచ్చింది భాగ్యం.

"నా పెళ్లి త్వరలో జరగబోతోంది" అంది.

"ఎవరితో" తెలీనట్టుగా ప్రశ్నించింది శాంతి.

"ఇంకెవరున్నారు. మా మదన గోపాలుడే! పుట్టినప్పటి నుండీ నేనాయన పెళ్లాంగానే పుట్టాను" అంది నవ్వి.

భాగ్యాన్ని పరీక్షగా చూసింది శాంతి.

నిన్నటిదాకా గోపాల్ని అసహ్యించుకొన్న భాగ్యం-నేడు ఇలా ఎందుకు మాట్లాడుతోంది?

తన గతేమిటి?

ఆలోచిస్తోంది శాంతి.

"ఎప్పుడు పెళ్లి?"

"ఇంకా తేదీ నిర్ణయించలేదు. కాకపోతే అతి త్వరలో"

"గోపాల్ ఒప్పుకొన్నాడా?"

"ఒప్పుకోక తప్పదు! ఈ పెళ్లికాకపోతే మా కాంతం అత్త ఛస్తానంటోంది"

"ఒప్పుకోక పోవడానికి గోపాల్ ఎవర్నైనా ప్రేమించాడేమో?"

"ఆఁ ప్రేమలూ లేవు, దోమలూ లేవు! ఒకవేళ ప్రేమించినా నాలాగే అందర్నీ ప్రేమించి వుంటాడు" భాగ్యం కృతకంగా నవ్వుతూ అంది.

"పెళ్లినాటికి అంటే శోభనం నాటి రాత్రికి మా బావకి షరాయీ. కల్చీ, లాల్చీ కుట్టి ప్రజెంట్ చేయాలని వుంది. ఆ కటింగ్స్ నేర్పవూ" అనడిగింది.

"నేర్చుకుంటానంటే కాదంటానా?" అంది శాంతి.

"థాంక్స్!" అంటూ వెళ్లిపోయింది భాగ్యం.

శాంతికి మనసంతా అల్లకల్లోల మయిపోయింది.

భాగ్యం పెళ్లి గోపాల్‌తో ఖాయమా?

కట్న కానుకలు విపరీతంగా ఇస్తామంటే కాంతం, రాజయ్య వద్దనరు. డబ్బు ముఖ్యం కాంతానికి. పైగా మేనరికం!

కొడుకుని వాళ్లు ఒప్పించితీరుతారు!

అప్పుడు-తనేం కావాలి?

ఏడ్పు వచ్చింది శాంతికి. ఏడుస్తూనే పడుకొంది.

పంతులొచ్చాడు. కూతుర్ని లేపాడు.

శాంతి కళ్లు చూస్తూనే ఆత్రంగా-

"ఏం జరిగిందమ్మా?" అనడిగాడు.

"కంట్లో నలక పడింది అంతే" అంది. పెరట్లోకి వెళ్లిపోయింది.

బాధగా వుంది పంతులుకి.

ఎదిగొచ్చిన కూతురు ఎదురుగా వుంది. పెళ్లిచేయాల్సిన ఈడులోవుంది. ఆ వయసుకు కోరికలు సహజం.

తన అశక్తత ఆమెను ఓ ఇంటిదాన్ని చేయలేకపోతోంది.

ఏం చెయ్యాలి?

ఎందరి పెళ్ళిళ్ళో చేయగలుగుతోన్న తాను తన కూతురి పెళ్లి చేయకపోతు

న్నాడు.

దుఃఖించాడు పంతులు.




పరీక్షలు అయిపోయాయి. గోపాల్ ఇంటికి వచ్చాడు.

రత్నం, కోటయ్యలు పెళ్లికి వత్తిడి చేయాలనుకున్నారు. ఇప్పటికే సమయం మించిపోయింది. ఇంకా ఆలస్యం చేస్తే అభాసుపాలవుతామనుకొన్నారు.

"ఈ నెలలో ముహూర్తం నిర్ణయిద్దామనుకొంటున్నాం" అంది కాంతం గోపాల్ దగ్గరగా కూర్చుని.

తల్లివైపు కోపంగా చూశాడతను.

"నీ కెన్నిసార్లు చెప్పాలి. నాకీ పెళ్ళి ఇష్టం లేదు"

"ఎందుకిష్టంలేదు? ఆస్తిపాస్తులు లేవనా? అందచందాలు లేవనా?"

"నీ పిచ్చి నీదేనమ్మా! అంతేగాని వాడి ఇష్టాయిష్టాలు నీ కక్కర్లేనట్టుంది" ఉమ అంది.

కూతురివైపు తీక్షంగా చూసింది. కాంతం.

"మధ్యన నీ పెద్దరికం ఏమిటి? నోర్ముయ్! అసలు నాకంతా అయోమయంగా వుంది. మీరంతా కలసి ఏదో గూడుపుఠాణీ చేస్తున్నారు" అని లేచింది కాంతం. భర్తని పిలుచుకు వచ్చింది.

"నీ మాటకూడా చెప్పు! తమ్ముడూ, అక్కా ఒకే మాటమీదున్నారు. నీ ఉద్దేశం కూడా చెప్తే హాయిగా విని ఛస్తాను"

"అంత పనిచెయ్యకు! వాళ్ళ ఉద్దేశాలేమిటో కనుక్కో" అన్నాడు రాజయ్య.

"చెప్పరా గోపాల్! భయం దేనికి చెప్పు" అంది ఉమ తమ్ముడివైపు చూస్తూ.

"నేనూ, శాంతీ ప్రేమించుకొన్నాం. నేను పెళ్ళి చేసుకొంటే శాంతినే చేసుకొంటాను" ఒక్కొక్కమాట నెమ్మదిగా అన్నాడు గోపాల్.

"దాన్నా?!" అంది కాంతం నోరు తెరచి ఆశ్చర్యంగా. వెంటనే తేరుకొని పళ్లు నూరింది.

"అలాఅయితే దాన్నీ, నిన్నూ నిలువునా చీరేస్తాను" అంది.

"ఆ బజారుదాన్ని నా ఇంటి కోడల్ని చేస్తావా? నువ్వు నా కడుపున చెడ పుట్టావు కదరా" అంది.

"నోర్ముయ్! ఎందుకా అరుపులు" అన్నాడు గోపాల్.

"అరుస్తాను. ఇంకా గట్టిగా అరుస్తాను. అమ్మో...అమ్మో! భోగందానికూతుర్ని నాకు కోడలిగా తెస్తావా? నీకేమైనా బుద్ధుందిరా! సాని హొయలన్నీ ఒలకబోసింది నీ దగ్గర! నిన్ను కట్టుకొందామని చూస్తోందా? చూస్తాను. దానితో నీ పెళ్ళి ఎలా జరుగుతుందో చూస్తాను. అలాగే భాగ్యంతో నీ పెళ్లి ఎలా జరగదో చూస్తాను"

"భోగందాని కూతురా..." చేష్టలుడిగింది ఉమ.

గోపాల్ కూడా ఆశ్చర్యపోయాడు తల్లిమాటలకి.

రాజయ్య దీర్ఘంగా కాంతం కళ్లలోకి చూస్తూ నిల్చున్నాడు.

"నాన్నా! శాంతి..." ఉమ ఆత్రంగా

అడిగింది తండ్రిని.

"మీ నాన్నేం చెప్తాడు! నేచెప్తాను విను! ఇంతవరకూ దాచిపెట్టాను కాని ఇక దాచిపెట్టి లాభంలేదు. అమ్మో! నా పీకలకే ఎసరు పెట్టింది కదా!

"ఆ పంతులు గాడు లేడూ. వాడు నాటకాలరాయుడు. మీ నాన్నక్కూడా అదేపిచ్చి. ఇద్దరికీ స్నేహం జరిగింది. నాటకాలలో తిరుగుతూ భోగందాన్ని తగులుకున్నాడు పంతులు. దాంతో ఉన్న ఆస్తి పోయింది. బతకడానికి దారిలేక పోయింది. మీ నాన్నని ఆశ్రయించాడు. ఓ గొప్పగా మీనాన్న ఇక్కడికి వాణ్ని తెచ్చి ఆలయాన్ని అప్పగించారు.

"అప్పుడే నేను నెత్తి మొత్తుకున్నాను. అయ్యా, ఆ భ్రష్టుడితో పూజలేమిటని! వింటేనా?

"అంతేగాకుండా ఆ విషయాన్ని పైకి చెప్పొద్దని నోరు మూయించాడు ఇన్నాళ్ళూ! వాళ్ళిద్దరికీ పుట్టిన బిడ్డ శాంతి. అందుకే ఆ కులుకులు... పలుకులూను. సానిదాన్ని నా కోడల్ని చేస్తారా?" కాంతం చింతాక్రాంతమయింది.

ఆ మాటలు వింటూనే హతాశుడయ్యాడు గోపాల్.

ఉమ నిశ్చేష్టురాలైంది.



కాంతం ఆ ఇద్దర్నీ గమనించి తెప్పరిల్లింది.

మధ్యాహ్నం తల్లి దగ్గరగా వచ్చి–

"జాతిలో ఏముందమ్మా! ప్రేమకి మతాలు, కులాలు అడ్డుకావు" అందిఉమ.

"పిచ్చిగాని పట్టిందేమిటే నీకు! నాకు అనుమానంగావుంది. కొంపదీసి మీ ఇద్దరికీ అది మందుగాని పెట్టలేదు గదా?" అంది రెచ్చిపోతూ కాంతం.

"అంతగా సమ్మకపోతే ఆ పంతుల్నే అడుగు" అంది రెట్టించి.

"నిజమేనమ్మా కాదనము. కాని శాంతి బతుకును ఇప్పుడు నవ్వులపాలుచెయ్యకు. ఆ అమాయకురాల్ని అభాసు పట్టించకు. శాంతి అసలే వట్టి మనిషి కూడా కాదు! రేపోమాపోనీకు మనవణ్ని కనబోతోంది"

పిచ్చిగాఅరిచింది ఆమాటలకి కాంతం–

"అయ్యయ్యో! ఇదెక్కడిభాగోతంరా దేవుడా. అదెక్కడ పడుకొందో ఏమో! నా కొడుక్కి కట్టబెట్టాలని చూస్తున్నారు దేవుడోయ్!"

"ఇదిగో వెధవ కూతలు కూయకు! మర్యాదఇచ్చి మర్యాదపుచ్చుకో! లేదంటే నోర్మూసుకో! అంతేగాని శాంతి గురించి ఇంకొక్క చెడుమాటగాని అన్నావంటే నేనూరుకోను" ఉమ కోపంగా అంది.

"నాకంటే అదే నీకు ఎక్కువా?"

"ఆఁ"

"అయితే సరే! చూసాను! అది ఈ ఇంట్లో ఎలా అడుగు పెట్టేదీ చూస్తాను"

"అక్కర్లే ఈ ఇంట్లో అడుగు పెట్టదు. వాడితో పట్నం ఇంట్లోనే అడుగు పెడుతుంది"

"మధ్యన నీ పెత్తనం ఏమిటే నా కర్థం కాక అడుగుతాను. వెళ్లు. నువ్వు నా ఇంట ఒక్కక్షణం కూడ వుండకు. నీ అత్తారింటికిపో! అసలు ఇదంతా దగ్గరుండి నువ్వే చేయిస్తున్నావు. పో అవతలకి. నా కళ్ళకి కన్పించకు" శివతాండవం ఆడేసింది కాంతం.

ఉమ మరి మాట్లాడలేకపోయింది.

ఆమె కళ్ళల్లో నీళ్ళూరాయి.

తను తల్లిని దూరం చేసుకొంటోందా? లేక 'మంచి'ని దూరం చేసుకొంటోందా?

శాంతితో పెళ్లికి తల్లి ఒప్పుకోదు. తండ్రి కూడా అంతే! ఆయనకి ఆస్తి పాస్తులు కావాలి. అవి పంతులు దగ్గర ఎక్కడ వున్నాయి?

మనసు, ప్రేమ అని తనెంత వాదిస్తే మాత్రం వినకపోతే లాభం ఏమిటి? కాదు కూడదని తన నిర్ణయం చెప్పడానికి నిజంగా తనకి అర్హత లేదు! తను పరాయి పిల్ల. పరాయి పంచన బతుకుతోంది.

నిరాసక్తంగా నిల్చుందామె.

సాయంత్రం–

పంతుల్ని ఇంటి దగ్గరకి పిలిపించాడు రాజయ్య.

"పంతులూ! నువ్వెవరవో, నీ జాతీ,నీ నీతీ ఏమిటో నీకు తెలుసు, నాకు తెలుసు. బతుకు తెరువుకోసం నీకు పూజారికాన్ని అప్పగించానే తప్ప – నువ్వు నిజంగా పూజారిత్వానికి అర్హుడివా?" నిలదీసి ప్రశ్నించాడు రాజయ్య.

పంతులు అయోమయంగా చూసాడు అతని వైపు. తన పాత జీవితాన్ని తవ్వుతూన్న అతన్ని గూర్చి ఆలోచిస్తున్నాడు.

"నీ కులం ఏమిటి? శాంతి ఎవరికి పుట్టిన బిడ్డ? బాగా ఆలోచించు. నేను ఎందుకు చెప్తున్నానో విను. శాంతిని కాక మరెవర్నీ పెళ్లి చేసుకోనని మొండి కేస్తున్నాడు గోపాల్. కాని ఆ పెళ్లి జరగదు. అయితే శాంతి ఎదురుగా

వున్నంత కాలం మావాడు సరిగా వుండలేడు. కాబట్టి వీలయినంత త్వరగా నువ్వు ఈ ఊర్ని వదిలి వెళ్లిపో నువ్వూ, నీ కూతురూ ఇక ఇక్కడ ఒక్క క్షణం కూడా వుండడానికి వీల్లేదు" ఆజ్ఞాపిస్తున్నట్టుగా అన్నా, రాజయ్య మాటల్లో అభ్యర్థన తొంగి చూసింది.

"వద్దు రాజయ్యా! వద్దు. ఈ ఊరు విడిచి మేం ఎక్కడికి వెళ్లాలి ? నువ్వే చెప్పు ! గోపాల్‌తో శాంతి పెళ్లి జరక్కుండా చూసే పూచీ నాది. అలా జరగనివ్వను. అంతేగాని మమ్మల్ని ఈ ఊరి నుండి వెళ్ళగొట్టకు" పంతులు ప్రాధేయపడ్డాడు.

"లేదు పంతులు! శాంతి వాడి కంటికి కన్పించకూడదు. కాదంటే నువ్వు నానా అవమానాలు పడాల్సి వుంటుంది"

"రాజయ్యా!" పంతులు కళ్ళలో నీళ్ల తిరిగాయి.

"చీకటి పడ్డ తర్వాత మీ ఇంటికి పాలేరుతో బండిని పంపిస్తాం! గుట్టు చప్పుడు కాకుండా వెళ్లిపోండి" కాంతం ఆజ్ఞాపిస్తున్నట్టుగా అంది.

రాజయ్య చూపులు కూడా అవే మాటలన్నట్టుగా వున్నాయి.

పంతులు తల వంచుకొని ఇంటికి నడిచాడు.

శాంతిని దగ్గరగా తీసుకొని జరిగిన వివరాలన్నీ చెప్పాడు.

"కాలం మనకి కలిసి రావట్లేదమ్మా!" అన్నాడు బాధగా.

శాంతికి ఏమాత్రం దుఃఖం రావట్లేదు. పెద్దలు పెద్దరికాల్ని ఈ రకంగా వెలగబెట్టడం గురించి ఆలోచిస్తోంది.

"ఏం చేద్దాం నాన్నా?" అనడిగింది డగ్గుతికతో.

"ఏం చేస్తాం తల్లీ! అయిందేదో అయింది. ఇక ఒక్క క్షణం కూడా ఇక్కడ వుండడానికి వీల్లేదు. పోదాం పదమ్మా! ప్రేమించి నువ్వు తప్పుచేయకపోయినా—దాన్ని వాళ్లు తప్పు అంటున్నారు"

"నీ ఇష్టం నాన్నా! నీతో ఎక్కడికైనా రావడానికి నేను సిద్ధం" అంది. అంతవరకూ ఉగ్గబట్టుకొన్న అశాంతి ఒక్కసారిగా పెల్లుబికింది. ఏడుస్తూ కూర్చొంది.

పంతులు కూతుర్ని చూస్తూ ఆలోచిస్తున్నాడు—

ఎక్కడికి వెళ్లాలి?

ఎటు పోవాలి?

ఈ పూరి పరిసరచ్ఛాయల్లో కూడా తనుండకూడదు ?

గర్భవతి అయిన కూతుర్ని పెట్టుకొని ఏ చీకటి గుహల్లోకి దారి తీయాలి ? ఏ ఉచ్చుల వురి కంబాన్ని అధిరోహించాలి?

సమస్యలన్నీ చుట్టుముట్టాయి అతన్ని.

రాత్రి తొమ్మిది గంటలకు రాజయ్య పాలేరు బండి తీసుకొని వచ్చాడు.

పంతులు సాలోచనగా బండివైపు చూశాడు.

"ఎక్కడికి వెళ్తాం నాన్నా" అడగలేక అడిగింది శాంతి.

"పట్నం పోదామమ్మా! అక్కడ అయినవాళ్లు వున్నారు మనకి"

ఏడుస్తూనే బండిలో సామానుని సర్దింది. కుట్టుమిషన్, వంట పాత్రలూ అన్నీ జాగ్రత్తగా ఓ మూలన పేర్చింది.

ఆలయంలోనికి వెళ్లి దేవుణ్ని కడసారిగా చూసింది. చేతులెత్తి నమస్కరించింది. గర్భగుడి తలుపులు మూసి తాళం వేసింది.

తాళాన్ని తండ్రికి అందించింది.

నిర్మానుష్యంగా వున్నాయి వీధులు.

బండి కదిలింది.

రాజయ్య ఇంటి వెనగ్గా బండినాపి పంతులు ఆ ఇంటికి వెళ్ళాడు.

"ఇవిగో ఆలయం తాళాలు" అన్నాడు.

"అక్కడ పెట్టు" అన్నాడు రాజయ్య.

"వెళ్లొస్తాను రాజయ్యా!" పంతులు నిష్క్రమించాడు.

రాజయ్యకు బాధగా వుంది. పంతుల్ని, శాంతిని అమానుషంగా, అన్యాయంగా ఊర్నుండి వెళ్ళగొడుతున్నాడు. వాళ్ళ వుసురు తనకి తగలకమానదు.

తను వాళ్లకి ద్రోహం చేశాడు. వాళ్ళ పట్ల దౌర్జన్యంగా ప్రవర్తించాడు. ఇవన్నీ ఎవరి కోసం ? కట్టుకొన్న పెళ్ళాం కోసం? అంతే! భాగ్యంతో గోపాల్ పెళ్ళి కాకపోతే ఛస్తానన్న భార్య కోసం చేయరాని నేరాలు చేశాడు.

రాజయ్య మనసు పరితపిస్తోంది.

ఉదయం–

గోపాల్ ఆలయం వైపుగా చూసుకు వెళ్లాడు–శాంతిని పలకరించాలని. అయితే ఆలయం తలుపులు, పంతులు ఇంటి తలుపులూ తాళాలతో బిగించి వుంటటం చూసి గాబరాపడ్డాడు. ఇంటికి పరుగెత్తు కొంటూ వచ్చి తల్లిని అడిగాడు వివరాలు.

"నాకేం తెలుసు" అంది కాంతం.

"నీకే తెలుసు. కావాలని వాళ్ళని ఊర్నించి వెళ్ళగొట్టి వుంటావు. ఎందుకు–ఎందుకీ అన్యాయానికి ఒడిగట్టావు"

"న్యాయాన్యాయాలు నాకు బాగా తెలుసు"

ఉమ దగ్గరగా వెళ్ళాడు గోపాల్. చూసిందంతా చెప్పాడు.

"నిజంగా దీని వెనుక అమ్మా నాన్నల కుట్ర వుంది – పద! అడిగి తెల్సుకొందాం" అంది ఉమ.

తండ్రిని నిలేస్తూ "శాంతీ, పంతులూ ఎక్కడికి వెళ్లారు నాన్నా?" అనడిగింది.

"ఏమో? వూరొదిలి మాత్రం వెళ్లారు"

"ఎంత ద్రోహానికి పాల్పడ్డావు! వాళ్లు నీకేం అన్యాయం చేశారని" ఉమ బాధ పడింది.

"అదంతా నీకనవసరం. ఎవరో తోడ బుట్టిన వాళ్లు వూరొదిలి పోయినట్టుగా నీకెందుకే అంత బాధ" కాంతం కోపంగా అంది.

"అమ్మా! ఈ పాపాలన్నిటికీ నువ్వే కారణం. నీకేం అన్యాయం చేసిందమ్మా శాంతి! దాన్ని వూర్నుండి వెళ్ళగొట్టావు. భాగ్యాన్ని బలవంతంగా గోపాల్‌కి కట్టబెట్టాలన్న నీ వూహ ఎంత వికృతంగా వుందో ఆలోచించావా?"

"అన్నీ ఆలోచించే చేశాం! అతిగా మాట్లాడకు" కాంతం వ్యగ్రంగా అరిచింది.

"నాన్నా! వాళ్ళిద్దరూ ఎక్కడికి వెళ్లి వుంటారో తెలుసా?" ఉమ రాజయ్యను అర్థిస్తున్నట్టుగా అడిగింది.

"నాకేమీ వాళ్లు చెప్పలేదు"

రాజయ్య మరి సంభాషించక అక్కడి నుండి వెళ్ళిపోయాడు. కాంతం రుసరుస లాడుతూ భర్త వెనుకే నడిచింది.

"ఎక్కడికి వెళ్ళివుంటారు" ఉమ ఆలోచిస్తూ తనని తనే ప్రశ్నించింది.

గోపాల్ దీర్ఘంగా నిట్టూర్చాడు. వెళ్ళి మేడమీద పడుకొన్నాడు.

కావాలని తననీ, శాంతినీ వేరు చేశారు. వేరుచేసి తనని పెళ్ళికొడుకుని చేయాలని ఆలోచిస్తున్నారు.

భాగ్యాన్ని పెళ్ళిచేసుకోవాలా? భాగ్యం సుఖ సంతోషాల కోసమే తల్లిదండ్రులు

ఆలోచిస్తున్నారు తప్పా, కన్నకొడుకు మనసేమిటో తెలుసుకోలేక పోతున్నారు.

గోపాల్ హృదయం బాధగా మూలిగింది.

కాంతం వచ్చింది పైకి.

"కాఫీ" అంది కొడుక్కి అందిస్తూ.

"వద్దు" అన్నాడు గోపాల్.

"ఇదేం మాయ రోగంరా నీకు? పోయేదాని వెంట పోతానని కూర్చున్నావేమిటి ? సానిదానితో సంసారం ఎలా చేస్తావురా" బాధగా గొంతు పెగుల్చుకొని అంది కాంతం.

"వద్దు. ఎక్కువగా నాతో మాట్లాడకు. నేను సహించలేను. కన్న తల్లిగా నీకు చేతులెత్తి నమస్కరించమంటే నమస్కరిస్తాను. కాని, నన్ను శాంతినుండి దూరం చేసిన రాక్షసిగా నిన్నేం చెయ్యాలో నాకర్థం కావట్లేదు"

"గోపాల్...ఆలోచించరా ! భాగ్యానికేం లోటు చెప్పు? అందంగా వుంటుంది. బోలెడంత ఆస్తి. అణుకువైన పిల్ల..."

"షట్ యు గెటౌట్" పళ్లుబిగించి గట్టిగా అరిచాడు గోపాల్.

భయంగా చూసింది కాంతం అతని వైపు. వెళ్లిపోయింది.

"ఏమంటాడు?" అనడిగాడు రాజయ్య భార్యని చూస్తూ.

"ఏమంటాడు - వురేసుకుని ఛస్తానంటున్నాడు. నా మాటలు వింటే కదా! ఛీ ఛీ! నా కడుపున అంతా చెడపుట్టారు"

"మంచిపని చేశాడు. అంతకన్నా ఏం చెయ్యగలరు చెప్పు" అన్నాడు రాజయ్య నవ్వుతూ భార్యని చూసి.

కాంతానికి కోపం నసాళానికి అంటింది.

పంతులు కూతురితో వూరు వదిలి వెళ్ళిపోయాడని తెలిసి వూరివాళ్ళంతా తలో మాటా అనుకొన్నారు. అసలు విషయం తెలిసినా నోరెత్తలేదు చాలామంది.

కోటయ్య, రత్నం కోటిదేవుళ్ళకి మొక్కుకున్నారు - ఈ శుభవార్త తెలిసినందుకు.

భాగ్యం తృప్తిగా వూపిరితీసింది ఇది విన్న వెంటనే !

శని వదిలింది.

ఇక గోపాల్ తనవాడు. రేపోమాపో తన మెళ్ళో తాళికట్టబోయే తనమగడు... అతన్ని హాయిగా అనుభవించాలనుకొంది.

* * *

తెలతెలవారుతోంటే - పట్నం చేరింది బండి.

"ఎక్కడికి పోవాలి బాబూ?" అనడిగాడు పాలేరు.

చెప్పాడు పంతులు.

ఆస్పత్రి ముందుగా నిలిపాడు బండిని. సామాన్లు దించుకొన్నారు.

"వెళ్లొస్తాను" పాలేరు వాళ్ల దగ్గర శలవు తీసుకొని తిరిగి బయల్దేరాడు.

నిద్రమత్తుతో ఇంకా వరండాలోని నర్సు గురక తీస్తూనేవుంది. అయినా లేచిన పేషెంట్లతో ఆ ఆసుపత్రి అపుడే బద్ధకంగా ఒళ్లు విరుచుకొంటున్నట్లుగా వుంది.

"ఇక్కడ మనకి అయినవాళ్లెవరు ?" శాంతి అయోమయంగా ప్రశ్నించింది తండ్రిని.

"ఈ ఆసుపత్రి డాక్టరమ్మా!"

"ఆవిడెవరో నీకు తెలుసా?"

"తెలుసమ్మా ! ఒకప్పుడు ఈ డాక్టరమ్మది మనవూరే! నేనంటే అభిమానం. ముందు నుంచీ పెద్దలంటే గౌరవంగల వ్యక్తి. మనలాగే నానా కష్టాలూ పడింది.

ఇప్పుడీ దశకి చేరుకుంది. అయినా పాత జీవితం మరిచిపోదు. అందరికీ చేతనైనంత సహాయం చేస్తుంది.

నాకూ ఆమెవల్ల సహాయం పొందాలని రాసివుంది జాతకంలో. అందుకే మనమిక్కడికొచ్చాం. నిన్ను తల్లిని కాకుండా చేసే బాధ్యత ఆమెవల్లే తీరుతుంది."

"నాన్నా!" అంది శాంతి ఆందోళనగా.

పంతులు ఆమె వైపు దీనంగా చూశాడు.

"వద్దు నాన్నా...వద్దు! కడుపుతీపిని నానుండి దూరం చెయ్యకు"

''అదే కడుపుతీపి తల్లీ నాది కూడా! మోయలేని పాపాన్ని మోస్తున్న నిన్ను ఇలా చూస్తూ నేను బతకలేను. నీకు పెళ్ళి చెయ్యాలి. అపుడు నువ్వు పిల్లా పాపల్తో చల్లగా వుండాలి. అంతేగాని పెళ్ళి కాకుండా పిల్ల తల్లివయితే లోకులు కాకుల్లా పొడుస్తూ నిన్ను చంపుతారమ్మా! ఆ దృశ్యాన్ని నేను వూహించుకోలేను"

పంతులు ఓదార్పుగా శాంతి తల నిమిరాడు.

అక్కళ్ళుబుక్కళ్ళుగా రోదిస్తోంది శాంతి.

డాక్టర్ గీత వచ్చింది –

"నమస్కారం పంతులుగారూ!"అంది పంతుల్ని చూస్తూనే. పంతులు ప్రతీ నమస్కారం చేశాడు. శాంతి తల నిండుగా పైట లాక్కుని తండ్రి పక్కగా నిల్చుంది.

"ఈ అమ్మాయి ఎవరు?" అనడిగింది గీత.

"నా కూతురమ్మా ! చిన్న పిల్లపుడు చూసుంటావు"

"అవును ... మన్నూరు వచ్చి అప్పుడే పదేళ్ళయింది మరి" నవ్వింది డాక్టర్.

శాంతిని అక్కడే వుండమని చెప్పి- పంతులు ఆమెతో కన్సల్టింగ్ రూమ్‌లోకి వెళ్లాడు.

గీత ప్రశ్నార్థకంగా చూసింది అతని వైపు.

పంతులు జరిగిన కథంతా చెప్పుకొచ్చాడు.

"దానికెలాగైనా అబార్షన్ చేసిపుణ్యం కట్టుకో!"అన్నాడు చేతులు జోడిస్తూ.

"తొందరపడకండి పంతులుగారూ ! గోపాల్ నాకు బాగా తెలుసు. పిలిపించి మాట్లాడతాను. తర్వాతే అన్నీ ఆలోచిద్దాం"

"లేదమ్మా! ఈ పెళ్లి జరగదు..జరగకూడదు"

"ఆవేశపడకండి"

"ఆవేశం కాదమ్మా! ఆవేదన.శాంతిని ఎలాగూ గోపాల్ పెళ్లిచేసుకోలేడు. ఒకవేళ చేసుకొన్నా కాంతం దాన్ని బతకనివ్వదు. అన్నీ ఆలోచించే ఈ నిర్ణయానికొచ్చాను"

నచ్చజెప్పబోయింది గీత.

వినే స్థితిలోలేడు పంతులు.

"సరే-అమ్మాయిని లోనికి పంపండి మాట్లాడతాను" అంది.

శాంతి లోనికి వచ్చింది.

"కూర్చో" అంది గీత.

"నిన్ను అయిదారేళ్ల పిల్లగా చూశాను. అంతే మళ్లీ చూడలేదు" అంది.

శాంతి మాట్లాడలేదు.

"మీ నాన్నగారు నీకు అబార్షన్ చేయమంటున్నారు. నీ కిష్టమేనా?" సూటిగా శాంతి కళ్లల్లోకి చూస్తూ ప్రశ్నించిందామె.

కన్నీళ్లు గిర్రున తిరిగాయి శాంతికి. ఇష్టం కాదన్నట్టుగా తలూపింది.

"రేపు భవిష్యత్తు ఆలోచించావా?"

మాట్లాడలేదు శాంతి.

"బిడ్డ తల్లిగా నిన్నెవరూ పెళ్లిచేసుకొందికి ముందుకు రారు"

"నాకు మళ్లీ పెళ్లా డాక్టర్!"

విసుపోయింది గీత.

"గోపాల్ నీవాడు కానినాడు–అతని ప్రతిరూపంతో నువ్వేం సాధిస్తావు ?"

"ఆత్మ తృప్తి"

గీత నోరు తెరిచింది ఆశ్చర్యంగా. వెంటనే గుండెల్లో 'శభాష్' అనుకొంది. పంతుల్ని పిలిచింది –

"మా ఇంటికి ఇద్దరూ వెళ్ళండి. తర్వాత మిగతా విషయాలు మాట్లాడుకొందాం" అంది. నర్సుని తోడుగా పంపించింది

పన్నెండుగంటలకి ఇంటికొచ్చింది గీత.

"శాంతికి ఎబార్షన్ ఇష్టం లేదు. బలవంతంగా చేస్తే క్రయిమ్ అవుతుంది. ఆలోచించండి!

పరిస్థితులెప్పుడూ ఒకేలా వుండవు. బిడ్డని కన్న తర్వాత శాంతి బతుకు చక్కబడుతుందేమో ఎవరు చెప్పగలరు. అందుకే తొందరపడకూడదనుకొంటున్నాను" అంది గీత పంతుల్ని పరీక్షగా చూస్తూ.

"అయితే...?"

"ఏం భయపడకండి ! భవిష్యత్తును వూహించుకొని భయపడడం కంటే వర్తమానాన్ని ఎలా నెట్టుకు రావాలో ఓపిగ్గా యోచించండి!

శాంతిని ఇక్కడే వుంచండి ! కుట్టు మిషన్ ఎలాగూ వచ్చు గనుక చిన్న చిన్న పనులు చేస్తూ తన పొట్ట తను పోషించుకొంటుంది. తర్వాత పరిస్థితులు చక్కబడితే అంతా సవ్యంగానే జరుగుతుంది" అంది మళ్లీ.

గీత మాటల్ని కొట్టిపారేయలేక పోయాడు పంతులు.

"నీ ఇష్టం తల్లీ! దాని బాధ్యత అంతా నీదే" అన్నాడు.

మర్నాడే పౌరోహిత్యానికి కొత్త కొత్త గ్రామాలు వెతుక్కొంటూ బయల్దేరాడు–శాంతిని గీత దగ్గర వుంచి.

* * *

రెండు నెలలయింది. శాంతి ఆచూకీ తెలీలేదు. ఎక్కడ వెతికినా కన్పించలేదు. పంతులు జాడ కూడా లేదు.

పిచ్చెత్తినట్టుగా వుంది గోపాల్‌కి.

కాంతం కొడుకుని వప్పించితీరాలని పట్టుబట్టి కూర్చుంది. ఓరోజు భాగ్యాన్ని పెళ్లిచేసుకోకపోతే వురిపోసుకుని ఛస్తానని బెదిరించింది.

గోపాల్ పట్టించుకోలేదు ఆ మాటల్ని. దాంతో కాంతానికి చిర్రెత్తుకొచ్చినట్టయి ఉరిపోసుకునే ప్రయత్నం చేసింది.

ఇంట్లో అందరూ బెంబేలుపడ్డారు. గోపాల్ని చుట్టాలూ, సన్నిహితులూ అనరాని మాటలన్నారు.

చిచ్చు పెరిగి పెద్దది కాకముందే ఓ నిర్ణయానికి రావడం మంచిదనుకొని ఉమతో అన్నాడు–

"ఇంట్లో పరిస్థితులు బాగా లేవు. ఈ స్థితిలో నన్నేం చేయమంటావు. శాంతి ఎక్కడుందో, ఏమైందో తెలీదు. ఆమె కోసం ఎన్నాళ్ళిలా నిరీక్షించాలో అర్థం కావట్లేదు.

ఓ వైపు అమ్మ చచ్చిపోతానని బెదిరిస్తుంటే అందరూ నన్ను ఆడిపోసుకుంటారు. అందుకని..."

"అందుకని'' ఆత్రంగా అడిగింది ఉమ.

"భాగ్యాన్నే పెళ్ళి చేసుకుందామను

కొంటున్నాను..."

"గోపాల్..."

"భాగ్యంతో నాకు పెళ్లి మాత్రమే జరుగుతుంది. కాపురం మాత్రం జరుగదు– జరగనివ్వను. అమ్మ సంతోషానికే ఇదంతా!"

"వద్దు గోపాల్ వద్దు. పెళ్ళయిన తర్వాత కాపురం చేయకుంటే లోకం ఏమనుకుంటుంది. తర్వాతర్వాత విపరీత పరిణామాలు ఎదుర్కోవలసి వస్తుంది"

"ఇంతకన్నా ఇంకే పరిణామాలుంటాయి."

"గోపాల్"

"అక్కా" ఏడుస్తున్నాడతను.

"భాగ్యాన్ని పెళ్ళి చేసుకొన్నతర్వాత శాంతి కన్పిస్తే ఏం చేస్తావు?"

అవును!

ఏం చేస్తాడు? శాంతిని మళ్లీ చేసుకుంటాడా? అందుకు భాగ్యం అంగీకరిస్తుందా?

గోపాల్ పిచ్చివాడిలా తలపట్టుకు కూర్చున్నాడు.

ఉమకి అక్కడ క్షణం కూడ నిలవాలనిపించక కిందికి దిగివచ్చేసింది.

"ఏమంటాడు?" అనడిగింది కాంతం ఉమని కళ్ళతోనే.

"భాగ్యాన్ని పెళ్లి చేసుకుంటాట్ట"



"నిజమా"

"నువు ఛస్తానంటుంటే ఏం చేస్తాడు– నిజమే"

"నా బంగారు తల్లే – ఎంత శుభవార్త చెప్పావే" కాంతం కూతుర్ని కౌగిలిలోకి తీసుకొంది.

ఉమ ఇబ్బందిగా చూసింది తల్లివైపు.

ఆకాశమంత పందిరి – భూదేవంత పీట వేసి – గోపాల్,భాగ్యాల పెళ్లి అట్టహాసంగా జరిపించారు పెద్దలు.

కోటయ్య కూతురి పేర్న సలభై తులాల బంగారాన్ని ఇచ్చారు. కాంతం సంతోషించింది.

రాత్రి–

భోజనాలు అయింతర్వాత పెళ్లికూతుర్ని అలంకరించారు. మొగలిపూల జడ వేశారు. జరీ చీర కట్టించి – సెంట్ స్ప్రే చేసి శోభనం గదిలోకి నెట్టారు.

సిగ్గుపడుతూ వచ్చింది భాగ్యం లోనికి. ఆమె చేతిలో నిండుగా పాలగ్లాసు వుంది.

మంచం మీద ఆ వైపుకు తిరిగి పడుకొన్నాడు గోపాల్. గది నిండా మొగలి వాసన 'గుప్'మంది.

భాగ్యం పాలగ్లాసుని దగ్గరగా వున్న టేబుల్‌పై వుంచి గోపాల్ని తనివితీరా కళ్లతో చూసి – "బావా" అని పిలిచింది.

గోపాల్ విసురుగా ఆమె వైపు చూశాడు.

"పాలు" అంది తత్తరపడుతూ భాగ్యం.

"వద్దు"

"నా మీద కోపంగా వుందా?" అనడిగింది. గోపాల్ చేతిని తన చేతిలోకి తీసుకొంది. చెయ్యి విదిలించుకున్నాడు గోపాల్.

"నిద్రొస్తోంది. పడుకో" అన్నాడు.

"కాని నాకు నిద్ర రావట్లేదు" నవ్వింది భాగ్యం.

"అయితే భజన చెయ్యి"

"భజన చెయ్యడానికా ఈ అందమంతాను"

"షటప్! ఐ హేట్ యూ! నువ్వంటే నాకిష్టంలేదు. అయినా మా అమ్మ పోరు పడలేక నిన్ను పెళ్లి చేసుకున్నాను. పెళ్ళయింది కాబట్టి నువ్వు నా పెళ్లానివి. అంతే! అంతకుమించి నువ్వేంకాదు. నాతో సరసాలాడాలని నీకు సరదా వుంటే అది ఈ జన్మకి తీరదు"

"బావా!"

"ఎస్! ఈ రోజునుంచి మనిద్దరం పడుకొనే గది ఒకటికాని, మంచం ఒకటి కాదు. జ్ఞాపకం వుంచుకో! నీకంతగా నా ప్రవర్తన నచ్చకపోతే – ప్లీజ్ గివ్‌మి డైవోర్స్. ఓకే"

భాగ్యం నోరెత్తక వూరుకొంది.

ఏడ్చింది.

"గట్టిగా ఏడవకు. నాకు నిద్రపట్టదు" గోపాల్ విసుక్కున్నాడు.

భాగ్యం గొంతు నొక్కుకుంది. ఏడుస్తూనే పక్క మంచంలో పడుకుంది.

తెల్లారింది.

రత్నం కూతుర్ని ఏవేవో అడిగింది. భాగ్యం వేటికీ సమాధానమివ్వలేదు. తల దించుకుంది.

సిగ్గుపడుతోందనుకున్నారంతా.

కాంతం తృప్తిగా నవ్వుకొంది భాగ్యం ప్రవర్తన చూసి.

* * *

గీత ఇంటి పక్కనే ఇల్లు అద్దెకు తీసు

కొన్నాడు పంతులు. ఆ ఏర్పాటు డాక్టరు స్వయానా దగ్గరుండి చేయించింది.

శాంతి కుట్టుపనితో కాలాన్ని మరిచి పోతోంది. రకరకాలుగా ఫాషన్లలో వున్న ఆమె పనితనానికి బాగానే మెప్పు వచ్చింది.

అంతా అక్కడే కుట్టించుకుంటు న్నారు. క్షణం తీరిక దొరకట్లేదు.

ఆవూరూ – ఈవూరూ తిరిగి పంతులు పౌరోహిత్యాన్ని సంపాదించుకున్నాడు. నాలుగు రోజుల్లో నాలుగు డబ్బులు సంపాదించుకొస్తున్నాడు.

రోజులు గడిచిపోతున్నాయి.

శాంతి ప్రసవించింది.

బాబు పుట్టాడు. పొత్తిళ్లలోవున్న పసి కందునుచూసి మురిసిపోయింది...!

"బాబు బాగున్నాడా?" అనడిగింది గీతని.

"నువే చెప్పు" అంది గీత.

"కాకిపిల్ల కాకికి ముద్దు! నా బాబు బాగానే వున్నాడంటాను. నువ్వు చెప్పు?

''చాలా బాగున్నాడు" అంది గీత నవ్వి.

శాంతి ఆనందపడింది.

"గోపాల్ పెళ్ళి భాగ్యంతో జరిగి పోయిందిట!"

గీత మాటలు వెయివేల శతఘ్నుల్లా పేలాయి.

శాంతి మూగబోయింది.

"ఆ వూరి పేషంటు ఒకడొచ్చాడు. ఆయన చెప్పాడు"

ఏడుస్తోంది శాంతి.

"బాధపడకు! ఈ పరిస్థితిలో ఎక్కువగాఆలోచించి ఆరోగ్యంపాడుచేసుకోకు"

కన్నీటితో గీతను చూసింది.

కళ్లతోనే ధైర్యం చెబుతున్నట్టుగా కళ్లార్పింది గీత.

పంతులొచ్చాడు –

"బాగున్నాడమ్మా" అన్నాడు నుదుటిని ముద్దుపెట్టుకుంటూ. సంతోషంగా వుందతనికి.

"అంతా నీ పోలికే! తాత పోలిక" అంది శాంతి.

నవ్వాడతను.

"రెండ్రోజుల వరకూ తిరిగిరానమ్మా! నా బిడ్డని, ఆ బిడ్డ బిడ్డనీ చూసుకొనే బాధ్యత నీదే" అన్నాడు గీతను చూస్తూ పంతులు.

"వెళ్లిరండి" హామీ ఇచ్చింది గీత.

పంతులు వెళ్ళిపోయాడు.

"ఆసుపత్రికి వెళ్లి తొందరగానే వస్తాను. బాబు జాగ్రత్త" అంది గీత.

నవ్వింది ఆ మాటలకి శాంతి.

గీత వెళ్ళిపోయింది. తిరిగి సాయంత్రం వచ్చింది.

ఆపాటికి మిషన్‌మీద ఏదో కుడుతూ కన్పించింది శాంతి.

"ఏం చేస్తున్నావు?"

"బాబుకి టోపీ కుడుతున్నాను"

బాబుని చేతుల్లోకి తీసుకుంది గీత.

"ఏదైనా గొప్ప అదృష్టవంతురాలివి" అంది.

"నాదా డాక్టర్ అదృష్టం" చకితురాలైంది శాంతి,

"నీ అదృష్టానికేం తక్కువ! అందంగా వుంటావు. నీకు పుట్టినబిడ్డ కూడా అందంగానే వున్నాడు. పోతే కాలూ, చేయీ కూడ్చుకుని పైసో పరకో మిషన్ మీద సంపాదిస్తూ–నీ పొట్ట నువ్వు పోషించుకొంటున్నావు. నిజంగా నీకన్నా అదృష్టవంతులెవరు చెప్పు"

"డాక్టర్!"

"అవునమ్మా! ఈ సమయంలో నిన్ను

పెళ్లాడ్డానికి మగాళ్లు క్యూ కట్టి నిలబడ తారు"

"డాక్టర్!"

"నా మాట విను. హాయిగా పెళ్లి చేసుకో"

"నాకు రెండో పెళ్లా?"

"కాదు శాంతీ! మగతోడు లేనిదే నువ్వు ఈ సమాజంలో నెట్టుకురాలేవు. నన్ను కాదనకు! యోగ్యుడైన పెళ్లికొడుకును చూస్తాను. నీ విషయాలన్నీ చెప్తాను. అతగాడు అంగీకరిస్తేనే పెళ్లి ఏమంటావు"

"మగతోడు అవసరమన్నావు. బాబు వున్నాడుగా!"

"శాంతి!"

"అవును డాక్టర్! ఈ హృదయంలో గోపాలొక్కడికే స్థానం. ఇంకెవరూ ఇందులో చొరకోలేరు. సో...నో వేకెన్సీ ఇన్ మై హార్ట్" అంటూ నవ్వడానికి ప్రయత్నించింది శాంతి.

గీత మరేమీ మాట్లాడలేకపోయింది.

"మీ నాన్న లేడుగదా! రాత్రి పడుకొందుకి తోడుగా నర్సును పంపిస్తాను" అంటూ వెళ్లిపోయిందామె.

ఆసుపత్రికి వచ్చిన నర్సుకు చెప్పింది. అలాగేనంది నర్సు.

బాబుని వుయ్యాల్లో వూపుతూ ఆలోచిస్తోంది శాంతి—

ఇపుడు గోపాల్ ఏం చేస్తుంటాడు?

హాయిగా భాగ్యంతో కబుర్లాడుతూ కూర్చుంటాడు. భార్యగదా అని మురిపాలు పోతాడు! అంతే!

గోపాల్ తనని ప్రేమించాడనుకొని భ్రమపడింది. తనకోసం అతనే త్యాగమైనా చేస్తాడనుకుంది. అంతా వుత్తదే!

తనని వంచించాడు...

తనని వాడుకొన్నాడు...మోసం చేశాడనుకొంది బాధగా.

భాగ్యాన్ని పెళ్లిచేసుకోనని అన్నాడు. ప్రమాణం చేశాడు!

ఆ ప్రమాణాలన్నీ ఏమైపోయాయి?!

పెళ్ళినాడు భాగ్యంతో మళ్ళీ ప్రమాణాలు చేస్తూ మరచిపోయాడా?

ధర్మేచ—

కామేచ—

మోక్షేచ—

నాతిచరామీ—

అంటూ పెళ్ళినాటి ప్రమాణాల్లో తనకి చేసిన వాగ్దానాల్ని తృణీకరించాడా...!

డబ్బునాశించి భాగ్యాన్ని పెళ్లిచేసుకున్నాడు. హాయిగా వుండి వుంటాడు.

తనే...తనే ఇలా ఏడుస్తోంది.

ఆక్రందించింది శాంతి.




భాగ్యం, గోపాల్ బయట భార్యాభర్తల్లా నడుస్తున్నా- గదిలో ఎవరి మంచాలు వారివే! కూతురు తనకే విషయాలూ చెప్పకపోతే సంసారాన్ని చక్కగానే దిద్దుకొంటోందని పొంగిపోయింది రత్నం.

కొడుకు దారికి వచ్చాడనుకొంది కాంతం.

ప్రతిరోజూ ఆ ఇంటికీ, ఈ ఇంటికీ తిరగడం తప్పితే భాగ్యానికి మరో పని

లేదు.అందరిళ్లా చక్కదిద్దుకొని రావడమే ఘనకార్యంగా వుందామెకి.

కాంతానికి ఆ విధానం నచ్చకపోయినా కొత్తపెళ్లికూతురు కదా అని వూరుకొంటుంది. కడుపున పిల్లో, పిల్లాడో పుడితే అప్పుడే బాధ్యతలు తెలిసొస్తాయని నచ్చజెప్పుకుంది.

గోపాల్ ఎవర్నీ పట్టించుకోవట్లేదు. పనివుంటే పొలం వెళుతున్నాడు. లేకపోతే మేడపై కూర్చుని శూన్యంలోనికి చూడ్డం అలవాటుచేసుకొన్నాడు.

తనది కాని బతుకు-తను బతకలేక పోతున్నాడు. ఎంతసేపూ శాంతి ఆలోచనలు ఆతన్ని నిలువనివ్వడంలేదు.

ఎక్కడుంది శాంతి?

ఏమైంది...?

ఇవే ఆలోచనలు అతన్ని కుదిపేస్తున్నాయి.

భాగ్యానికి నలతగా వుందని ఆరోజు పుట్టింటికి వెళ్ళింది.

రత్నానికి కూడా పొలం పనులులేక ఇంట్లోనే వుంది. తలనొప్పి అంటూ పడుకొన్న భాగ్యం తర్వాత రెండు మూడుసార్లు వాంతి చేసుకుంది. కడుపులో ఏదో తిప్పుతోందని తల్లికి చెప్పింది.

రత్నం గాబరాపడింది. డాక్టర్ దగ్గరకు తీసుకువెళ్ళి చూపించింది.

డాక్టర్ నవ్వుతూ "భాగ్యం గర్భవతి" అంది.

రత్నం సంతోషానికి అవధులు లేకపోయాయి. భాగ్యాన్ని అక్కడికక్కడే ముద్దుపెట్టుకుంది.

పరుగెత్తుకుంటూ ఇంటికొచ్చి చుట్టుపక్కలవాళ్ళకి శుభవార్త చెప్పింది. కూతురి తలంటింది.

కాంతానికి ఈ విషయం తెలిసి ఆనందంగా వచ్చింది. భాగ్యాన్ని వళ్ళోనికి తీసుకుంటూ ముద్దుపెట్టుకుంది

భాగ్యం సిగ్గుపడింది.

"అయితే రత్నం! ఇక నా కోడలు బాధ్యత నీదే. వేగంగా నాకు మనవణ్ని పంపాలి" అంది కాంతం.

రత్నం రత్నాలు రాలినట్టుగా నవ్విందా మాటలకి.

భాగ్యాన్ని ఇంటికి తీసుకువచ్చింది కాంతం.

రాజయ్య వసారాలో కూర్చుని వుంటే వెళ్లి వివరాలు చెప్పింది. మామగారు సంతోషంగా చూస్తుంటే భాగ్యం తలొంచుకొని లోనికి తుర్రుమంది.

ఆ రోజల్లా ఇల్లు ఆనందంగా వుంది.

గోపాల్ మేడమీద ఒంటరిగా కూర్చుని వుండడం చూసి కాంతం పరుగెత్తింది అక్కడికి.

"ఒరేయ్! నీకు కొడుకు కావాలా? కూతురు కావాలా?" అంది గలగలా నవ్వుతూ.

అర్థంగాక తల్లి మొహంలోకి వెర్రిగా చూశాడతను.

"నీ పెళ్లానికి మూడోనెల" అంది కాంతం. స్వీటు అతని నోటికి ఆప్యాయంగా అందించి వెళ్లిపోయింది.

గోపాల్‌కి మాటరాక నిశ్చేష్టుడై పోయాడు.

భాగ్యం గర్భవతి...

మూడో నెల...

ఇదెలా సాధ్యం ?

పెళ్ళయిన దగ్గర్నుంచి తనుభాగ్యాన్ని కళ్ళతో నిండుగా కూడా చూడనేలేదు.

అంటలేదా మేను...ముట్టలేదు.

మరెలా సాధ్యం ?

బుర్ర బద్దలవుతోందతనికి. 'భాగ్యం'

అనుకొన్నాడు కసిగా.

అయితే భాగ్యం పూర్వపు బుద్ధులు మానుకోలేదన్నమాట? ఏ సరసుణ్ణో దాపరికంగా అనుభవించి—ఫలితాన్ని తన తలకి చుడుతోంది.

వీల్లేదు....

భాగ్యం గర్భానికి తనేవిధంగానూ కారకుడు కాడు. ఆ విషయం రూఢీగా తనకి తెలుసు.

అయితే ఏం చెయ్యాలి?

తలకొట్టుకున్నాడు గోపాల్

కరుణ వచ్చింది మేడపైకి

"కాఫీ తీసుకురా" అన్నాడు. అతని కళ్ళు అగ్నిగోళాల్లా వుండడం గమనించింది.

"అలా వున్నావేం?" అనడిగింది కరుణ.

"తలనొప్పిగా వుంది"

"అమృతాంజనం తీసుకురానా"

"వద్దు" గట్టిగా కసిరాడు. తుళ్ళి పడిందామె. కిందికి చరచరా వెళ్ళి కాఫీ తెచ్చింది. వెంటనే మళ్ళీ వెళ్ళిపోయింది.

తలదిమ్ముగా వుంటే అలా కళ్ళు మూసుకున్నాడో లేదో వెంటనే నిద్ర పట్టేసింది. రెండు గంటలకుపైగా నిద్ర పోయాడతను. తర్వాత ఏదో అలికిడికి మెలకువ వచ్చింది.

ఎదురుగా తల్లి!

"అన్నానికి రా" అంది. ఆమె వెంట వెళ్ళక తప్పిందికాదు. భోజనం చేయ నంటే లేనిపోని గొడవలు! అంపరూ కారణం ఏమిటని పీక్కుతింటారు. అందుకు తప్పింది కాదు.

భోజనం అయిందనిపించి మేడపైకి చేరాడు. కిటికీ తెరచి ఆలయం వైపు చూశాడు.

అక్కడ వసారాలో ముష్టివాళ్ళు ముడుచుకుపడుకున్నారు. ఆలయం అంతా బోసిపోయినట్టుగా వుంది.

శాంతి జ్ఞాపకానికొచ్చింది. వెచ్చగా రెండు కన్నీటి బొట్లు రాల్చాడు.

'భాగ్యం' అనుకొన్నాడు కసిగా.

'దీని అంతు చూస్తాను. ఎవరడ్డుపడ్డా దీన్ని క్షమించేది లేదు" అనుకొన్నాడు.

భాగ్యం వచ్చింది. చేతిలో పాలగ్లాసుంది. ఆనాటి చీరా, రవికా మళ్ళీ కట్టింది. జడ నిండా మల్లెలు తురుముకొంది. ఒకొక్క అడుగూ వేస్తూ వస్తోంది.

ఆమెకు భయం భయంగా వుంది.

ఆందోళనగా వుంది.

అస్సలు పైకి రాకూడదనే అనుకొంది కాని పెద్దలు బలవంతం చేసి మరీ పంపారు.

గోపాల్ ఏం చేస్తాడు?

గుండెల్లో గుబులుగా వుంది!

గోపాల్ వీధి వైపు చూస్తున్నవాడల్లా ఇటు తిరిగి –

"ఇలారా" అని పిల్చాడు.

భాగ్యం తత్తరపాటుగా నడుస్తూ వచ్చింది.

"కూర్చో" కుర్చీ చూపించాడు.

"ఆనాడు నే చెప్పిన మాటలు నీకు జ్ఞాపకమున్నాయనుకొంటాను" అన్నాడు.

అవునన్నట్టుగా తలూపింది భాగ్యం. చూపులు కిందనే వుంచుకొంది.

"నేనన్న మాటలు ఓసారి తిరిగి చెప్పు"

తటాలున గోపాల్ ముఖంలోకి చూసిందామె. ఆ కళ్ళు ఎర్రగా వున్నాయి. చింత నిప్పుల్లా కాలుతున్నాయి. అదురు కలిగింది.

"చెప్పు" రెట్టించాడు.

"మర్యాదగా వుండమన్నావు. నిన్ను ముట్టుకో వద్దన్నావు. అంతగా ఇష్టం లేక పోతే విడాకులు తీసుకోమన్నావు''

"అవునా?"

"అవును" గుండెల్ని గుప్పిట పట్టుకొంది.

"మరిప్పుడు నువ్వేం చేశావు?"

భాగ్యం తలెత్తలేదు. నేల చూపులు చూస్తోంది.

"నీ కడుపు పంటకి కారకుణ్ని నేనా?"

పలకలేదు భాగ్యం.

"చెప్పు"

తల అడ్డంగా వూపింది.

"మరెవరు?"

భాగ్యం జవాబివ్వలేదు.

"చెప్పు" గట్టిగా అరిచాడు.

జవాబు లేదు.

పిచ్చి కోపం లేచింది అతనిలో. కాలితో బలంగా తన్నాడు ఆమెను. ఆ తాపుకి కుర్చీ ఓ పక్కా—భాగ్యం ఓ పక్కా తూలి పడ్డారు. మళ్లీ పురికి రాబోతున్నాడతను.

భాగ్యం అతని కాళ్ల పట్టుకొంది ఏడుస్తూ. మోచేతికి దెబ్బ తగిలి రక్తం చిమ్ముతోంది.

మళ్లీ బలంగా కాలు జాడించాడతను. దూరంగా ఎగిరి పడిందామె. 'అమ్మా' అంటూ గట్టిగా అరిచింది.

"ఏమైంది" కాంతం ఆదుర్దాగా ఆ కేకని విని ఆశ్చర్యపోయింది.

కరుణ పరుగుతో మేడ పైకి వచ్చి చూసింది కిటికీలోంచి. కిందికి వచ్చి—

"అన్నయ్య వదినను కొడుతున్నాడు" అంది. కాంతం గాబరాగా మీదికి పరుగెత్తింది. ఆమెతో పాటు రాజయ్యా పరుగందుకొన్నాడు.

తలుపులు బాదారిద్దరూ.

తెరుచుకొన్నాయి.

గదిలోని వాతావరణం చూసి నిశ్చేష్ఠులయ్యారు.

భాగ్యం స్పృహతప్పి పడివుంది. చేతి గాజులు పగిలి నేలంతా చెల్లా చెదురుగా వున్నాయి. మోచేతి నుండి రక్తం కారుతోంది.

"ఏం జరిగింది?'' గోపాల్ని కోపంగా ప్రశ్నించింది కాంతం.

అంతే!

ఆమె చెంప మీద బలంగా గోపాల్ చెయ్యి పడింది. కాంతం ఏడుపు లంకించుకొంది.

"ఏమిట్రా ఇది" రాజయ్య అసహనంగా అరిచాడు.

భాగ్యం కళ్లు విప్పి చుట్టూ తేరిపార చూస్తోంది.

"దాన్నడుగు చెబుతుంది" అన్నాడు గోపాల్.

"ఏమయింధమ్మా" రాజయ్య భాగ్యం దగ్గరగా వచ్చాడు.

భాగ్యం ఏడుస్తోంది.

"అది మర్యాదగా అడిగితే చెప్పదు" అంటూ గోడకి తగిలించి వున్న కొరడాని అందుకున్నాడు

ఛళ్! ఛళ్! ఛళ్!

వరుసగా బాదాడు ఆమెను. కాంతం అడ్డుకోబోయి తనూ దెబ్బలు తింది. రాజయ్య కొడుకుని వారించాడు. అయినా గోపాల్ ఆవేశం పాలు తగ్గలేదు.

భాగ్యం దగ్గరగా వచ్చి లేపి కూర్చోబెట్టాడు—

"చెప్పు" అన్నాడు చాచి పెట్టి మళ్లీ చెంపదెబ్బ వేస్తూ.

''కొట్టొద్దు-చెబుతాను" అంది కాళ్ళ

మీద పడి ఏడుస్తూ.

"చెప్పు! నువ్వు తల్లివి కాడానికి కారణం నేనా?"

"కాదు"

"మరెవరు?"

"మా పాలేరు"



కాంతం అవాక్కయిపోయింది. భూన భోంతరాలు బద్దలవుతున్నట్టుగా వుందామెకి. నిజం వినాలంటే ఎంత బాధ!

భాగ్యం ముఖం చూడాలంటే అసహ్యంగా వుంది.

రాజయ్యకి అంతా అయోమయంగా వుంది.

"ఇంతకు ముందు కూడ నీకిలాంటి సంబంధాలు చాలా వున్నాయి కదూ?"

"ఉన్నాయి"

"ఎన్నిసార్లు నువ్వు అబార్షన్ చేసుకొన్నావు?"

"రెండుసార్లు"

"మీ అమ్మకీ, నాన్నకీ ఈ విషయ
అన్నీ తెలుసు కదూ?"

"తెలుసు"

కాంతానికి వళ్లు మండింది. భాగ్య
దగ్గరగా వచ్చి ముఖంమీద కాండ్రిం
వుమ్మింది. తనివితీరా కాలితో తా
తన్నింది.



"మా పసుపులు మంటగలిపావు కదే! వాడు చేసుకోనన్నా నేను ఛస్తానని బెదిరించి మరీ వాడి మెడకి నిన్ను కట్టాను. మాకు తగిన శాస్తి చేశావు. నీలాంటి పాపిష్టిది ఇక్కడ క్షణం కూడ వుండడానికి వీల్లేదు. పో...పో"

ఆవేశంగా మీద పడి భాగ్యాన్ని కొట్టింది కాంతం. రాజయ్య ఆమెను పక్కకి లాగాడు.

"అది మనిషనుకొన్నారా- జంతు వనుకొన్నారా? చస్తుంద్రా" అన్నాడు.

"చావనీ" అంది కాంతం.

"వాళ్ళింటికి పొమ్మన్నావుగా... పోతుంది. అంతవరకూ దాన్ని బతక నివ్వండి"

వళ్లు నుగ్గునుగ్గయిపోయి నొప్పులు పుడుతున్నాయి. బాధగా అన్పించి ఏడుస్తోంది భాగ్యం.

తన బతుకు ఇంత తొందరగా ముగుస్తుందనుకోలేదు. తల్లికి చెప్తే అబార్షన్ చేయిస్తుందనుకొంది. తీరా తల్లికి తెలిస్తే-సంబరంగా అందరికీ చెప్పకొంది కాని తన పాట్లు ఆలోచించలేదు.

తనని ప్రాణంతో విడిచి పెడతారా?

బాధగా మూలిగింది భాగ్యం.

గోపాల్ ఆవేశంగా చూస్తూ నిలబడ్డాడు. అతని గుండెలు ఎగిసెగసి పడుతున్నాయి. బాధగా వుంది. ఆలోచించే కొద్దీ అసహ్యంగా వుందతనికి.

రాజయ్య అతని దగ్గరగా వచ్చాడు.

"దాన్ని మరేం చేయకు" అన్నాడు.

"రా ! కిందికి పోదాం'' అన్నాడు మళ్లీ. అతనక్కడ వుంటే మళ్లీ ఏ అవాంతరాలు ఎదురౌతాయోనన్నది రాజయ్య ఆలోచించలేకపోతున్నాడు. చేయిపట్టి తీసుకు నడిచాడు.

భాగ్యం ఒక్కతే కూర్చుంది. ఏడుస్తోంది.

గోపాల్ హాలులో పడుకొన్నాడు. నిద్ర రావడంలేదు.

రాజయ్య కొడుకుని చూస్తూ ఆలోచిస్తున్నాడు. ఆయనకి నిద్రరావట్లేదు.

తెల్లారింది-

గోపాల్ మేడపైకి వెళ్లాడు. భాగ్యం కూర్చున్న చోటే నిద్రపోతోంది. తట్టి లేపాడు. భయంగా కళ్లు తెరిచిందామె.

గోపాల్ !

ఆమె తలపై చేయివేసి లాలనగా నిమిరాడతను. భాగ్యాన్ని దగ్గరగా తీసుకున్నాడు.

భాగ్యం దుఃఖం పెల్లుబికి ఏడుస్తూ అతన్ని కరుచుకుపోయింది.

"తప్పంతా నీదే కాదు భాగ్యం! నాదికూడా వుంది. నేనే నిన్ను ఆదరిస్తే నువ్వా చెడుదార్లు తొక్కేదానివికాదు. శాంతి మీదున్న వ్యామోహంతో నిన్ను దూరం చేసుకొన్నాను.. నన్ను క్షమించు భాగ్యం! క్షమించు" అన్నాడు.

భాగ్యం సున్నితంగా అతని నోటిని చేతో మూసింది. రాత్రి జరిగినదంతా పీడకలనుకొంది.

సంతోషంగా వుంది. గోపాల్ని గాఢంగా కౌగలించుకొంది. తన తప్పును మన్నించడంతో గోపాల్ని దేవుడనుకొంది.

"చెప్పు భాగ్యం-నన్ను క్షమించావు కదూ"

"ఎంతమాట బావా! క్షమించవల్సింది నన్ను-నన్ను క్షమించు బావా! ఇక ఎరిగిమరిగి ఏ తప్పూ చేయను"

గోపాల్ ఆమె పెదవుల్ని చుంబించాడు.

మేడ మీదికెళ్ళి కొడుకు మళ్లీ ఏ అఘా

యిత్యం చేయబోతున్నాడోనని భయంగా చూసొద్దామని వెళ్లిన కాంతమ్మకి ఆ దృశ్యం పెద్ద ప్రశ్న మార్కయింది. ఆశ్చర్యపోయింది. కిందికి దిగొచ్చి భర్తతో చెప్పింది.

"ఎంతయినా వాళ్లిద్దరూ భార్యాభర్తలు" అన్నాడు రాజయ్య.

"కాదు – ఎంతమాత్రంకాదు. ఇంత తెలిసి కూడా దాన్ని ఒక్కక్షణంకూడ ఇక్కడుంచలేను"

"మధ్య నువ్వెవరివే! మొగుడు పెళ్ళాల మధ్య అనేకంగా తగావాలుంటాయి. కల్పించుకొంటే నిన్నే అంటారంతా రేపు"

కాంతానికి నోట మాట రాలేదు.

"కాఫీ తెసావా"అనడిగాడు గోపాల్.

ఎంతో ప్రేమగా, ఆప్యాయంగా అత సడుగుతోంటే కాదనలేక పోయింది భాగ్యం. ఉప్పొంగిపోతూ – "క్షణంలో తెస్తాను బావా" అంది. గబగబా కిందికి నడిచింది. కాఫీ చేసి పట్టుకొచ్చింది.

"మీ ఇంటికి వెళ్ళాలని వుందా" అనడిగాడు కాఫీ తాగుతూ.

"లేదు" అందామె.

సాయంత్రం గోపాల్ని పిలిచి కాంతం "చెడినదానితో సంసారం ఏమిట్రా? రేపు బిడ్డని కనిపారేస్తే ఏ పక్కచుట్టం అని దాన్ని వళ్ళోసికి తీసుకోను"అంది.

"అనుభవించు"

"ఇది ఇంత రణరాలుగాయని నాకానాడు తెలియలేదు. తెలిసినా మీకు చెప్పలేదు."

"మరప్పట్లో దాన్ని పెళ్ళి చేసుకోకుంటే ఛస్తానన్నావే".

మాటకి మాటా జవాబు తప్పా– గోపాల్ తల్లితో సవ్యంగా మాట్లాడటం మానుకొన్నాడు.

ఉమ వచ్చింది–

"కరుణ చెప్పింది నిజమేనా?" అనడిగింది గోపాల్ని చూస్తూ.

"అదెందుకు అబద్ధం చెప్తుంది. విన్నదంతా నిజమే"

"అయితే దాన్నింకా ఇంట్లో వుంచుకొంటావా"

"మరేం చేయమంటావు. పొమ్మంటే ఏ ఆత్మహత్యోచేసుకొని మనల్ని చంపుతుంది. అందుకని ఏం చెయ్యాలా అని ఆలోచిస్తున్నాను"

"బంగారంలాంటి శాంతిని పోగొట్టుకుని ఈ శనిని తలకి చుట్టుకొన్నావు. నీ బతుకు కాలింది" ఏడ్చింది ఉమ.

"బాధపడకు. అయిందేదో అయింది" అన్నాడు గోపాల్. ఉమ భారంగా వెళ్లిపోయింది.

రాత్రి తొమ్మిదయింది.

భాగ్యం మేడపైకి వచ్చింది.అందంగా అలంకరించుకొంది. జడలో కనకాంబరాలు తురుముకొంది.

మంచం దగ్గరగా వచ్చి నిలబడింది. గోపాల్ కళ్లు మూసుకుని పడుకొన్నాడు

"బావా" పిల్చింది భాగ్యం. శోభనం నాటి రాత్రి తర్వాత మళ్ళీ ఇన్నాళ్ళకి అలా లాలనగా పిల్చిందామె.

కళ్లు తెరచి చూశాడు గోపాల్.

"నిద్రవస్తోంది భాగ్యం" అన్నాడు.

ఎక్కువగా మాట్లాడి అతని మనసు నొప్పించకూడదనుకొని తనూ అతని పక్కగా పడుకొంది.

"బావా! ఈ పాపాన్ని పోగొట్టుకొంటాను. అబార్షన్ చేయించు" అంది అర్థింపుగా.

"అబార్షన్ ఏ డాక్టర్ దగ్గర చేయించ

మంటావు?"

"పట్నంలో గీత దగ్గర"

"సరే! అట్టే ఆలోచించి బుర్ర పాడు చేసుకోకు"

"నన్ను క్షమించవా బావా!"

"ఊఁ" అనగలిగాడు అయిష్టంగా.

"నీ పెద్ద మనసుకు నా జోహార్లు బావా!"

కసిగా నవ్వాడు.

"దేవుడు ఎక్కడో లేదు బావా! నువ్వే దేవుడివి"

సూటిగా ఆమె కళ్లలోకి చూశాడతను.

"అయితే నేను నిన్నేం చెయ్యాలి?" గోపాల్ గొంతు వికృతంగా పలికింది.

భాగ్యం చలించింది.

అతను లేచి కూర్చున్నాడు.

అతని కళ్లు నిప్పు కణాల్లా మెరుస్తున్నాయి. కసిగా పళ్లు నూరాడు. భాగ్యం మెడ చుట్టూ చేతులు వేసి బిగించాడు.

"బావా..." ఆకులా వణికిపోతూ చూసింది భాగ్యం

అతని చేతి కండరాలు బిర్ర బిగుసుకొంటున్నాయి.

భాగ్యం అరవడానికి ప్రయత్నిస్తోంది. అయినా లాభం లేకపోతోంది. కాళ్ళూ, చేతులూ కొట్టుకొంటోంది.

బలాన్నంతా ఉపయోగించి మట్టిని పిసికినట్టుగా ఆమె గొంతును నులిమాడు గోపాల్.

కీచుమంది భాగ్యం గొంతు. భయంగా చివరి చూపు చూసి కళ్లు తేలేసింది. నిర్జీవమై పోయింది.

తృప్తిగా చేతులు సాచి విరుచుకొన్నాడు గోపాల్. గబగబా కిందికి వచ్చి చూశాడు. అప్పటికీ అంతా నిద్రపోతున్నారు. వెళ్ళి వీధి తలుపు చప్పుడు కాకుండా తెరచి వుంచాడు. పిల్లిలా అడుగులు వేస్తూ మళ్లీ మేడ పైకి వచ్చాడు.

చలనం లేని కళ్ళతో అతని వైపు భాగ్యం చూస్తోంది.

భయం వేసిందతనికి. చేతో ఆ కళ్ళని మూసేశాడు. శవాన్ని భుజమ్మీద వేసుకొని వూరవతలి పొలాల్లోకి నడిచాడు.

అంతకు ముందే తీసి వుంచిన గోతిలో ఆమెను పూడ్చి ఇటుగా తిరిగాడు.

ఎవరిదో నీడ!

క్షణంలో సగం బెదిరిపోయాడు. మళ్లీ తేరిపార చూస్తే ఏమీ లేదు. గట్టిగా వూపిరి పీల్చాడు. గబగబా ఇంటికి నడిచొచ్చాడు.

వీధి తలుపులు వేసి వున్నాయి. ఇంట్లోవాళ్లెవరో తెరచి వుండడం చూసి మూసేసుంటారు.

తలుపు కొట్టాడు గోపాల్.

కాంతం తలుపు తీసింది.

గోపాల్ నిలువునా వణికిపోతున్నాడు. చరచరా మేడమీదికి వెళ్ళిపోయాడు.

"బాబేమిటి అలా వణికిపోతున్నాడు" అంది భర్తని లేపి.

"ఏమిటీ"విసుక్కున్నాడు రాజయ్య.

"అదికాదండీ వాడేదోలా వున్నాడు. నాకు భయంగా వుంది"

ఇంతలో పెద్దగా ఏడుపు విన్పించింది.

ఒక్కడూ గదిలో కూర్చుని బిగ్గరగా ఏడుస్తున్నాడు గోపాల్.

రాజయ్య, కాంతం అక్కడికి పరుగెత్తారు.

"ఏం జరిగిందిరా?"రాజయ్య ఆత్రంగా అడిగాడు.

"భాగ్యం ఏదీ?" కాంతం ఆదుర్దాగా

అంది.

"దాన్ని చంపేశాను" గోపాల్‌లో ఆవేశం తగ్గిపోయి ఆక్రోశం చోటు చేసుకొంది.

"ఏం చేశావు?"

"భాగ్యాన్ని పీక పిసికి చంపేశాను"

కాంతానికి స్పృహ తప్పింది.

రాజయ్య వణికిపోయాడు.

"నిజంగా?!" అనడిగాడు.

"నిజం నాన్నా! ఈ చేతులతోనే భాగ్యాన్ని చంపేశాను" గోపాల్ చేతులు రెండింటినీ మంచానికేసి కొట్టుకొన్నాడు.

రాజయ్య కేమీ పాలుపోవట్లేదు. అయినా ధైర్యం చేసుకొని ఉమకి కబురంపాడు.

"పాపాన్ని పాపం చేసే అంతం చేశాను"

రాజయ్య గోపాల్ మాటలకి చలించిపోతున్నాడు. కాంతానికి తెలివొచ్చింది. పెద్దగా ఏడ్చింది. రాజయ్య ఆమె నోరు మూస్తూ-

"గట్టిగా ఏడవకు. ప్రమాదం" అని హెచ్చరించాడు. కాంతం చీర కొంగును నోటిలో కుక్కుకొని కుమిలిపోతోంది.

ఉమ భర్తతోసహా వచ్చింది ఏడుస్తూ.

"ఏడవడం దేనికక్కా—ఆ పాపిని నే చంపినందుకు సంతోషపడాలి నువ్వు"

"గోపాల్...." ఉమ అతని మీదుగా పడి దుఃఖించింది.

"అయిందేదో అయింది - పెద్దగా ఎవరూ ఏడవద్దు. మామయ్యా! ముందు గోపాల్ని ఇక్కడ్నుంచి ఏ వూరైనా పంపే ఏర్పాటుచెయ్యి" అన్నాడు ఉమ భర్త రావు ఆలోచనగా.

రాజయ్య క్కూడా ఆ వూహ వుంది. ముందు గోపాల్ని ఇక్కణ్నుంచి ఎక్కడికైనా పంపివేయాలి! లేకపోతే లేనిపోని గొడవలు!

"లే-పట్నం వెళ్లిపో" అన్నాడు రావు గోపాల్ని లేపుతూ.

కాంతం ఏడుస్తూనే సూట్ కేస్ సర్దింది. రాజయ్య రెండువేల రూపాయలు ఇచ్చాడు. రావు తొందరచేస్తున్నాడు.

"ఏడ్చి లాభంలేదమ్మా! నా గురించి ఏడవద్దు-నా శాంతిని గూర్చి ఏడవండి. అదెన్ని కష్టాలు పడుతోందో" అన్నాడు గోపాల్.

సూట్ కేస్ అందుకుని బయల్దేరాడు.

కాంతం గగ్గోలుగా ఏడ్చింది.



భాగ్యాన్ని గోపాల్ చంపేశాడన్న వార్త 'గుప్' మంది. అయితే శవం బయటపడలేదు.

కోటయ్య పాలేరు శవాన్ని బయటపెడతానన్నాడు. అతగాడు ఆ రాత్రి పొలం కాపలా కాస్తూంటే గోపాల్ భాగ్యాన్ని పూడ్చడం చూశానన్నాడు.

కోటయ్యనూ, రత్నాన్నీ తీసుకు వెళ్లాడు. అయితే గోతిని తవ్వి శవాన్ని బయటకు తీసేముందుగా పోలీసు రిపోర్టు ఇవ్వడం మంచిదన్నారు అంతా.

సరేనన్నాడు కోటయ్య. వెళ్లి పోలీసు రిపోర్టిచ్చాడు.

మధ్యాహ్నం రెండు గంటలకి యస్.ఐ. బలగంతో వచ్చాడు. గోతిని తిరగతవ్వి శవాన్ని బయటకు లాగారు. భయంకరంగా వుంది భాగ్యం మొహం.

రత్నం ఏడుస్తూ కూర్చుంది.

"శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించాలి" అన్నాడు యస్.ఐ. పట్నానికి తరలించారు. కోటయ్య, రత్నం వెనుకనే వున్నారు.

మర్నాడు ఉదయం పోస్టుమార్టమ్ చేశారు. డాక్టర్ రిపోర్టు తర్వాతిస్తానని శవాన్ని తల్లిదండ్రులకి అప్పగించాడు.

కోటయ్య శవాన్ని వూర్లోకి తీసుకొచ్చి పెద్దగా వూరేగింపు లేవదీశాడు.

రాజయ్య కుటుంబం తమకు చేసిన అన్యాయాన్ని ప్రచారం చెయ్యాలన్నదే కోటయ్య వూహ! అందుకే ఆ వూరేగింపు.

"నా కూతురు చెడ్డదే కావచ్చు. నచ్చకపోతే ఏలుకోనని పుట్టింటికి పంపొచ్చుగా! అంతేగాని దాని ప్రాణాలు తీసి మా వుసురు పోసుకుంటారా" అంది రత్నం.

రత్నానికి కడుపు తరుక్కుపోతోంది.

కోటయ్య దుఃఖాన్ని నిభాయించుకోలేకపోతున్నాడు. కేసు పెట్టి వాళ్ళ అంతాన్ని చూడాలనుకున్నాడు.

* * *

గీత అర్జంట్‌గా రమ్మంటే-శాంతి ఆ ఇంటికి ఆదరా బాదరాగా వెళ్ళింది.

"ఎందుకు పిల్చారట" అనడిగింది.

దీర్ఘంగా చూసింది శాంతి కళ్ళల్లోకి గీత.

తర్వాత మెల్లిగా అంది "భాగ్యం చచ్చిపోయింది."

ఆశ్చర్యపోయింది శాంతి. "ఎపుడు" అనడిగింది.

"అపుడే పదిహేనురోజులైంది"

"పిచ్చిపిల్లకి ఈ నేలపై నూకలు చెల్లిపోయాయన్నమాట" బాధపడింది శాంతి.

"ఎలా చనిపోయింది?" అంది మళ్ళీ.

"అది తర్వాత చెప్తాను-ముందు ఇది చెప్పు? ఈ పదిహేనురోజుల్లో గోపాల్ నీ ఇంటికి ఎపుడైనా వచ్చాడా?"

"రాలేదే! ఏం" ఆత్రంగా అడిగింది.

"అతగాడిపుడు సబ్ జైల్లో వున్నాడు" గీత తల దించుకుని చెప్పింది.

శాంతి మొహం పాలిపోయింది ఆమాటలకి. నిలువుగుడ్లతో ఆమెవెపు ఆశ్చర్యంగా చూస్తూ నిల్చుంది. ఏడుస్తోంది.

"భాగ్యాన్ని గోపాల్ హత్యచేశాడు."

బావురుమంది శాంతి.

"అన్యాయాన్నీ, అధర్మాన్నీ సహించలేకపోయాడు. భార్య కదా అని వూరుకోలేకపోయాడు. ఆవేశంలో ఆ పని చేశాడు"

"గోపాల్ అంతపని చేశాడంటే నేను నమ్మలేకున్నాను" శాంతి బాధగా అంది.

"నువ్వు నమ్మలేనంత మాత్రాన నిజం అబద్ధం కాదు"

వెక్కి వెక్కి ఏడుస్తోంది శాంతి.

"ఎలా తెలిసింది డాక్టర్!"

"ఇలాంటివి దాగవమ్మా! ఆ నోటా ఈ నోటా ప్రచారమవుతాయి"

"నేను వెంటనే గోపాల్ని కలుసుకోవాలి. అవకాశం వుంటుందా" ప్రార్థనగా అడిగింది శాంతి.

"ప్రయత్నిద్దాం! మేజిస్ట్రేట్ తో మాట్లాడాలి" అంది గీత.

దాదాపు ఆరు నెలల తర్వాత మళ్ళీ గోపాల్ని కలుస్తోంది. 'ఎప్పుడెప్పుడా' అని ఎదురు చూస్తోంది.

ఇలా గోపాల్ని కటకటాల వెనుక

చూడాల్సి వస్తుందనుకోలేదు.

బాధనిపించింది శాంతికి. పంతులు వచ్చాడు. వివరాలు వింటూ చలించి పోయాడు.

"ఇంతపని చేస్తాడనుకోలేదు. మనిషిలో ఆవేశం ఎక్కువ" అంటూ నిట్టూర్చాడు.

"నేను వెళ్తాను నాన్నా!" అంది పిల్లాడిని చేతుల్లోకి తీసుకొని.

"వేగంగా పద. కోర్టులో అర్జీ రాసిచ్చి మేజిస్ట్రేట్ పర్మిషన్ తీసుకొందాం" అంది గీత.

త్వరత్వరగా బయల్దేరారు. మేజిస్ట్రేట్ పర్మిషన్ తీసుకొన్నారు.

అరగంట పర్మిషన్ ఇచ్చాడు.

సబ్‌జైలు గదులకు ఎదురుగా పోలీసు స్టేషన్ వుంది. అక్కడ వాళ్లంతా చీట్ల పేక ఆడుకొంటున్నారు. ఆ పరిసరాలు ఎన్నడూ చూడని శాంతి భయం భయంగా నడుస్తోంది.

హెడ్‌కానిస్టేబుల్ గీతకి నమస్కరిస్తూ-"ఇలా వచ్చారేమమ్మా" అనడిగాడు.

సమాధానం చెప్పింది గీత.

అర్జీ చూసి "రండమ్మా" అన్నాడు ముందుకు నడిచి. అతన్ని అనుసరించారు.

సెల్‌లో పడుకొని వున్నాడు గోపాల్. హెడ్డు పిలిస్తే ఇటు తిరిగి చూశాడు. శాంతిని చూస్తూనే ఆదుర్దాగా తలుపు దగ్గరకి వచ్చాడు.

గోపాల్ని ఆస్థితిలో చూడాల్సి వచ్చినందుకు ఏడుస్తోంది శాంతి. గోపాల్ కూడా అంతే! ఏమీ మాట్లాడలేక మౌనంగా రోదిస్తున్నాడు.

"శాంతి మీకెలా తెలుసు డాక్టర్?" గీతని ప్రశ్నించాడు తర్వాత.

"ఊర్నుంచి మీరు వెళ్ళగొట్టాక నన్నాశ్రయించింది" అంది గీత.

బాధగా శాంతి చేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు గోపాల్.

"మీ దగ్గరున్నట్టుగా ఎందుకు చెప్ప లేదిన్నాళ్ళూ" అతగాడు ఆవేదనగా అడిగాడు.

"చెప్తే ఏం చేసేవాడివి? భాగ్యంతో చూడొచ్చేవాడివా"

తల వంచుకొన్నాడతను.

"భాగ్యాన్ని ఎందుకు హత్య చేశావు?" వివరాలడిగింది గీత.

చెప్పాడతను.

"ఆ పరిస్థితుల్లో ఆ అవమానం భరించా లంటే సాధ్యంకాలేదు. ఆవేశంతో ఆ పని చేశాను"

"మీవాళ్ళెవరూ వచ్చి నిన్ను కలవ లేదా?"

"నాన్నా, రావు, బావా వచ్చారు. జామీను కోసం ప్రయత్నిస్తున్నారు. అమ్మా వాళ్ళు రేపో ఎల్లుండో వస్తార"

శాంతి మాట్లాడలేకపోతోంది. గోపాల్ వైపు చూస్తూ ఏడుస్తోంది.

"మాట్లాడు శాంతీ!" గోపాల్ ఆప్యాయంగా అడిగాడు.

ఏం మాట్లాడాలి? అతన్నేరకంగా వూరడించాలి?

శాంతికేమీ అంతుపట్టలేదు. ఏడుస్తూ నిల్చుంది.

"టైమయింది. వెళ్దాం పద" అంది గీత.

"బ్రేవ్ మై ఫ్రెండ్-వుయ్ విల్ మీట్ ఎగైన్" అంటూ డాక్టర్ ముందుకు నడిచింది. శాంతి కన్నీటి కళ్లతో వస్తానని చెప్పి ఆమె వెంట కదిలింది.

గోపాల్ వెళ్తున్న శాంతిని కన్నీటి పొరల మధ్య చూశాడు.

రెండ్రోజుల తర్వాత—

ఉమ ఇంటిలోకి వస్తూ కన్పించింది శాంతికి. ఏడుస్తూ ఇద్దరికిద్దరూ అల్లుకు పోయారు.

కాంతం, కరుణ కూడా వచ్చారు.

స్నేహితురాల్ని చూస్తూనే శాంతి గుండె ద్రవించింది. పెద్దగా ఏడ్చింది.

పంతులు వచ్చాడు..అతన్ని చూస్తూనే కాంతం అవమానంగా తలొంచుకొంది.

"ఎప్పుడొచ్చారమ్మా?" అనడిగా డతను కాంతాన్ని.

"ఇప్పుడే" అందామె. కాంతం పశ్చాత్తాపపడుతోంది.

ఆరోజు తాను ఆ విధంగా ప్రవర్తించకుండా వుండే శాంతి తన కోడలయ్యేది. పరిస్థితి మరో విధంగా వుండేది. తన మూర్ఖంతో శాంతిని కాదని అశాంతిని వెంటబెట్టుకొందనుకొందామె.

బాబుని చేతుల్లోకి తీసుకొంది ఉమ. ముద్దాడింది.



"అతన్ని కలిసొచ్చాను" అంది శాంతి.

"మేమూ అక్కడినుండే వస్తున్నాం! గోపాల్ నువ్విక్కడ వుంటావని చెప్పాడు" అంది కాంతం.

"ఆయన్ని విడుదల చేస్తారంటారా" దగ్గుత్తికతో అడిగింది.

"దానికే ప్రయత్నాలు చేస్తున్నారంతా. లాయర్‌తో మాట్లాడుతున్నారు" అంది ఉమ.



గీత వచ్చింది. "బాగున్నావా" అనడిగింది ఉమని.

"బాగోకేం-బ్రహ్మాండంగా వున్నాను" అంది ఉమ.

నవ్వింది గీత.

"నేనూ, ఇదీ క్లాస్‌మేట్స్! ఇది డాక్టర్ నవుతానంది అప్పట్లో! మరెందుకో కాలేకపోయింది"

"నాకు పెళ్ళయింది" అంది ఉమ.

"అదో పెద్ద ఘనకార్యమా"

"కాదా?" అని నవ్వింది.

కాంతం గీతని పరీక్షగా చూస్తోంది.

ఎంతగా ఎదిగింది? ఆనాటి గీత కాదు అన్పించింది. పూటకి ఠికాణాలేని కుటుంబంలో పుట్టి ఆ ఇంటా, ఈ ఇంటా తిరుగుతూన్న గీతని అప్పట్లో ఎవరూ ఇంత దశకి వస్తుందనుకోలేదు.

అయితే కష్టపడింది. కృషి ఫలించింది. డాక్టరయింది.

ఈనాడు పదిమందికీ ఇంత తిండి పెట్టగల స్తోమతు సంపాదించింది. గౌరవం, మన్ననా నేర్చుకొంది.

ఎలాంటి మనిషి ఎలా తయారయిందీ అన్పించి ముక్కుమీద వేలేసుకొంది కాంతం.

* * *

మర్నాడు మళ్లీ అంతా సబ్‌జైలు దగ్గరికి గోపాల్ని చూడడానికి వెళ్లారు. మేజిస్ట్రేట్ పర్మిషన్ ఇవ్వనన్నాడు. గీత తనని తాను పరిచయం చేసుకొని—"ఈ ఒక్కసారికి ఇవ్వండి! ప్లీజ్" అనడిగింది.

"అలా వీలు కాదమ్మా! పదే పదే రాకూడదు. సరే - అక్కడి పోలీసుల దగ్గరకి వెళ్ళండి! పది రూపాయలు వాళ్ల చేతుల్లో పెడితే చూడనిస్తారు. మాకేం తెలీనట్టుగా మేం ప్రవర్తిస్తాం తర్వాత" అన్నాడు.

'ఈ పద్ధతి బాగుందే' అనుకొంది గీత. నవ్వుకొంది.

పోలీసుల దగ్గరకొచ్చి హెడ్డుని పిలిచి పది రూపాయలు అతని చేతిలో ఉంచింది వివరాలు చెప్పి.

"దీండేముందమ్మా! వెళ్లి మాట్లాడి రండి" అంటూ డబ్బులు నిరాకరించాడు హెడ్డు.

అంతా సెల్ దగ్గరకు వెళ్లారు. గోపాల్ నిద్రపోతున్నాడు. ఉమ పిలిస్తే ఉలిక్కిపడి లేచి ఆత్రంగా తలుపు దగ్గరికి వచ్చాడు. రోజులు గడుస్తూండడం వల్ల బాధలూ, ఏడ్పులూ తగ్గి మామూలుగా మాట్లాడుకోసాగారంతా.

"ఆరోగ్యం ఎలావుంది?" అనడిగింది గీత.

"నంబర్ వన్" నవ్వుతూ అన్నాడు గోపాల్.

"సాయంత్రం మనూరికి వెళ్లిపోతున్నాం" అంది కాంతం.

"సరే"

"మీ నాన్నా, బావా నిన్ను కలసి ఏమైనా చెప్పారా?"

"ప్లీడర్ని హైదరాబాదు తీసుకు వెళ్తామన్నారు. హైకోర్టు ద్వారా బెయిల్-సంపాదిస్తారట!"

"బెయిల్ ఇస్తారంటావా?" అనడిగింది ఉమ సందేహంగా.

నిర్లక్ష్యంగా తలెగరేశాడు గోపాల్ ఇవ్వక ఏంచేస్తారన్నట్టుగా.

అనుకున్నంతగా బలమేమి లేదు కేసులో. పైగా సాక్ష్యాలు ఇంతవరకూ ఏమీ పకడ్బందీగాలేవు. భయపడనవసరం

లేదంటున్నాడు లాయరు. ఏం జరుగు
తుందో చూడాలి?

"ఇక్కడ 'పోలీసులు కొట్టరా?'"
అనడిగింది కరుణ అమాయకంగా.

"ఏం కొట్టరు. ఇది మేజిస్ట్రేట్
అధికారంలోనిది. పోలీసులు ఇక్కడ
కాపలాదార్లే కాని కొట్టేవారు కాదు. పైగా
నాన్న అయిదొందల రూపాయలు
పోలీసులకు నిన్న లంచం ఇవ్వడంతో
నన్ను వాళ్ల అల్లుడిగా చూసుకొంటూ
సకల మర్యాదలూ చేస్తున్నారు" అన్నాడు
గోపాల్ నవ్వి.

శాంతి అతన్ని కన్నార్పకుండా
చూస్తోంది.

"శాంతిని మనూరు రమ్మనమంటే
రానంటోంది. ఇక్కడే వుంటుందట!
నువ్వు విడుదల అయితేకాని ఏ విషయం
చెప్పదట" అంది ఉమ.

"దానిష్టం. అయినా నా ఉద్దేశం మీతో
పాటు రావడమే మంచిది" అన్నాడు.

"సరే! వెళ్లామయితే" అంది గీత.

"రేపు మళ్లీ శాంతి వచ్చి కలుస్తుందిలే"
అంది తిరిగి.

"థాంక్స్" అన్నాడతను.

అందరూ ఇంటికి చేరారు.

"మాతో రా శాంతీ! ఇక్కడ ఒంట
రిగా ఏం చేస్తావు" అనడిగింది ఉమ.

"బాబుని చూసుకొంటూ జీవితాన్ని
నెట్టుకొస్తాను. రేపుదయం వాడి తల్లి ఓ
బోగందాని కూతురని తెలిసినా ఆదరించ
గలిగే ఉన్నతుణ్ని చేస్తాను వాణ్ని"

"ఎందుకు శాంతీ నువ్వు బాధపడి
మమ్మల్ని బాధ పెడతావు. అయిందేదో
అయింది. అమ్మ ఇప్పటికే నీకు జరిగిన
అన్యాయానికి కుమిలిపోతోంది. తనతప్పును
తను తెలుసుకొని బాధపడుతోంది. రా!
నామాట విను"

"అవునమ్మా! ఇంకా నా మీద నీకు
కోపం పోలేదా" అడిగింది కాంతం.

"లేదత్తయ్యా! అదికాదు నేననేది!
ఆయన ఇక్కడ ఉంటుంటే నేనక్కడ
ఉండలేను. విడుదల అయితే ఇద్దరం కలసి
వస్తాం! ఆయనకి తోడుగా నేనుండడం
అవసరం"

"నీ ఇష్టం తల్లీ!" అంది కాంతం
ఆప్యాయంగా శాంతిని దగ్గరకి తీసు
కొంటూ.

"తొందరపాటుగా రాత్రికి రాత్రి
మేం గోపాల్‌కి చెప్పకుండా ఇక్కడికి
వచ్చేసినందుకు ఆయనకి బాధగా ఉంది.
క్షమాపణ చెప్పుకోవాలి ముందు. తర్వాత
ఇద్దరం కలిసొస్తాం"

"అలాగే కాని" అంది ఉమ.

వాళ్లంతా బయల్దేరారు. బస్సులో
వాళ్లు పోతుంటే బాధనిపించింది శాంతికి.
పిల్లాడిచేయి ఎత్తిపట్టి 'టాటా' చెప్పించింది.

గీత వచ్చింది ఇంటికి.

శాంతీ, పంతులూ ఏవేవో మాట్లాడు
కొంటున్నారు.

"మీరింకా వెళ్ళలేదేం" అనడిగింది
గీత.

సమాధానంగా పంతులు నవ్వి వూరు
కొన్నాడు.

"మీరుకూడ వెళ్ళిపోండి పంతులుగారూ!
జరిగిందేదో జరిగిపోయింది. అందరూ
బాధలుపడ్డారు. ముఖ్యంగా గోపాల్ విష
యంలో ఆలోచించండి. ఈ సమయంలో
శాంతికూడ అతడికి దూరమయితే అతనెంత
గానో కుమిలిపోతాడు. పోతే రాజయ్య,
కాంతం కూడ మిమ్మల్ని ఇప్పుడు దూరం
చేసుకోలేరు. కొడుకు పరిస్థితి తెలుసు.
భాగ్యం అడ్డురాకపోతే ఆనాడే మిమ్మల్ని

వదులుకొనేవారుకారు. అయితే మేన కోడలన్న ఆశతోనూ-శాంతి అక్కడే వుంటే గోపాల్ భాగ్యాన్ని పెళ్లిచేసుకో డన్న భయంతోనూ వాళ్లు ఆ విధంగా అప్పట్లో ప్రవర్తించాల్సి వచ్చింది. అంతే గాని మీ మీద వాళ్ళకెటువంటి కోప తాపాల్లేవని స్పష్టంగా తెలుస్తోంది.

ఆలోచించండి! ప్రశాంతగా ఎప్పట్లాగే మీ ఆలయం—ఆలయ ప్రాంగణంలో మీ జీవితం చల్లగా వెళ్ళమార్చుకోండి" అంది గీత.

పంతులు ఆలోచిస్తూ కూర్చున్నాడు.

తండ్రి సమాధానం కోసం ఎదురు చూస్తోంది శాంతి.

"కేసు ఏమవుతుంది" అనడిగాడు.

"కేసుదేముంది. సులభంగా తేలిపో తుందంటున్నారంతా"

"గోపాల్ విడుదలయితే ఆలోచిం చొచ్చు కదా..."

"గోపాల్‌ని గురించి ఆలోచించేదేమీ లేదు. అతని మనసు నాకు తెలుసు. అత నికూవల్సింది శాంతి. శాంతి తోడయితే అతని జీవితం సుఖంగా సాగిపోతుంది. ఈ సమయంలో మీరు మరోరకంగా ఆలో చించి వచ్చిన అవకాశాన్ని కాలదన్ని శాంతి జీవితాన్ని నవ్వులపాలు చేయకండి.అందరి జీవితాలూ ఇప్పుడు శాంతి జీవితంతో ముడిపడి వున్నాయి.శాంతి తానుగా కాదన డంలేదు. మీరేమంటారోనన్న భయంతో పూరుకొందంతే! చెప్పండి ! ఏమంటారు"

"నేను శాంతిని వాళ్ళనుండి దూరం చేయాలని ఆలోచించటం లేదు. దానికేది ఇష్టమయితే నాకూ అదే/ఇష్టం ! అదేమి చెయ్యమంటే అదే చేస్తాను. నా కూతురి సుఖం మాత్రం నాదికాదా ! అయినా గోపాల్ లేక మేం అక్కడ చేసేపని ఏముందని ఆలోచిస్తున్నాను"

గీత మరి మాట్లాడలేదు.

చెప్పి చెప్పి విసుగన్పించి- లేచి వెళ్లి పోయింది.

"నీ ఉద్దేశం ఏమిటి తల్లీ" అనడి గాడు శాంతిని పంతులు.

"వెళ్ళిపోదామన్పిస్తోంది. కాదని వాళ్లను కాలదంతే రేపు నా బిడ్డ భవి ష్యత్తు ఏమిటి? గోపాల్ కోపగించుకుని నా నుండి దూరమయితే బాబు పెరిగి పెద్దయి 'మా నాన్న ఎవరు' అంటే నేనేం సమాధానం చెప్పాలి. ఇపుడు నాకు కావ ల్సింది నా సుఖంకాదు నా బిడ్డ సుఖం"

"నువ్వు కాదంటావేమోననే నేనిలా అన్నాను.నీకిష్టమయితే పదమ్మా!పోదాం" అన్నాడు పంతులు.

సాయంత్రం గీత మళ్ళీ వచ్చింది.

శాంతి వెళ్ళిపోతున్నామని చెప్పింది.

గీత తృప్తిగా నిట్టూర్చింది. తర్వాత బాధగా-

"మంచి స్నేహితురాలివి — నువ్వు వెళ్లిపోతుంటే బాధగా వుంది. నువ్వె క్కడవున్నా సుఖంగా, సంతోషంగా వుండాలి. నన్ను మరిచిపోవుకదూ" అంది గీత.

ఆమెను కౌగిలించుకుని ఏడ్చింది శాంతి.

"ఎలా మరిచిపోతాను డాక్టర్? మీరే నాకూ, నా బాబుకూ ప్రాణదానం చేశారు. ఆనాడు మీరుకాబట్టి నాన్నని ఒప్పించి నాకు కడుపుతీపి చవి చూపిం చేరు. ఆశ్రయాన్నిచ్చి ఆదుకున్నారు. వేరెవ్వరు ఇలా చేస్తారు చెప్పండి! మీ సహాయం, సహకారం నేనెప్పుడూ మరచి పోను. ప్రతిక్షణం మిమ్మల్ని జ్ఞాపికి

తెచ్చుకుంటాను"

"నాకో మాటివ్వాలి డాక్టర్" అంది శాంతి.

"ఏమిటో"

"ఇస్తానంటేనే చెప్తాను"

"సరే! చెప్పు"

"నేను మళ్ళీ మిమ్మల్ని చూడొచ్చే సరికి మీరు పెళ్ళిచేసుకుని ముత్తయిదువులా కన్పించాలి"

"అంతేకదా-రేపే పెళ్లిచేసుకుంటాను" అన్నట్టు మరిచిపోయాను. ఈవాళ మా వుడ్‌బితో సినిమా ప్రోగ్రాం వుంది. వెళ్లొస్తాను." పరుగుతీసింది.

మర్నాడే తండ్రీ కూతుళ్ళిద్దరూ ప్రయాణమయ్యారు పల్లెకి. పల్లె చేరేసరికి ఉదయం పదిగంటలయింది.

శాంతినీ,శాంతి భుజంపైనున్న బాబునీ, పంతుల్నీ చూస్తూ వూరివాళ్ళంతా ఆశ్చర్యపోయారు - ఇన్నాళ్ళూ ఎక్కడున్నారంటూ.

రాజయ్య ఇంటి దగ్గరకి వచ్చారు. కరుణ ముందుగా చూసింది వాళ్ళని. లోనికి పరుగెత్తింది.

"అమ్మా! వదినా వాళ్లొస్తున్నారు"అని కేకేసింది. కాంతమ్మ ఎదురొచ్చింది.

శాంతి చేతిలోని బిడ్డనందుకుని ముద్దాడింది.

"ఇదేనా రావడం" అంది.

అవునంటూ నవ్వింది శాంతి.

రాజయ్యా, పంతులూ ఒకర్నొకరు చూసుకుంటూ నిలబడ్డారు.

"జరిగింది మరిచిపో పంతులూ!నన్ను క్షమించు" అన్నాడు రాజయ్య.

"రాజయ్యా!" గట్టిగా కౌగిలించుకున్నాడతన్ని పంతులు.

శాంతి వచ్చినట్లు తెలిసి ఉమ వచ్చింది.

"నీకెవరు చెప్పారప్పుడే" అంది కాంతం కూతుర్ని చూస్తూ.

"ఒకరు చెప్పేదేమిటి? శాంతి ఈ రోజు వస్తుందని నాకు తెలుసు. అందుకే పరుగెత్తుకు వచ్చేశాను" అంది.

"ఏయ్-మరదలు పిల్లా! వదినగార్కి మర్యాదలు చేయవా"

"మా ఇంట్లో అతిథి మర్యాదలు భోజనాల దగ్గర్నుంచే మొదలవుతాయి"

"అపుడే మా ఇల్లు..." ఆశ్చర్యపోయింది ఉమ, మా ఇల్లు దగ్గర నొక్కి పలుకుతూ.

"అవునే! కోడలిదే ఎప్పుడైనా ఇల్లు! ఆడబడుచులది కానేకాదు" కాంతం సర్ది చెప్పొచ్చింది.

"అమ్మా! అనవసరంగా కోడలికి కొమ్ములిస్తున్నావు" బెదిరించింది

"కొమ్ములిచ్చినా శాంతి పోట్లగిత్త కాబోదు" కాంతం నవ్వుతూ అంది.




మెడికల్ రిపోర్టు వచ్చింది. చంపిన విధానాన్ని వివరంగా రాశారు. మెడ దగ్గరి కండరాలు పిసుక్కుపోయాయి. హత్యా సమయానికి దాదాపు మూడు నెలల గర్భవతి—ఆరోగ్యం బాగానే వుందంటూ వివరించారు.

రావు లాయరు దగ్గర రిపోర్టు చూశాడు. రిపోర్టు బలంగా వుంది. గోపాల్ వేలిముద్రలు కూడ స్పష్టంగా వున్నాయని తెలుస్తోంది. అయితే సాక్ష్యం సరిగ్గా లేదు.

కోటయ్య దగ్గరి పాలేరు కళ్ళారా చూసినట్టుగా చెప్పలేదు. అనుమానపడుతున్నాను అన్నాడు. ఆ రాత్రే భాగ్యాన్ని పూడ్చి పెట్టింది గోపాల్. అంతటి పొడవైన వ్యక్తి అన్నాడు తప్పా 'గోపాలే' నని నిర్దిష్టంగా చెప్పలేదు.

ఇతరుల సాక్ష్యాలు కూడా వాదనకు నిలబడలేదు. గోపాల్ ఆవేశంగా ఆమె మెడచుట్టూ చేతులు వేసి వుండొచ్చు-కాని చంపే ప్రయత్నం చేయలేదు.

రాత్రి జరిగిన తగాదా ఫలితంగా భాగ్యమే-తెలివిగా మెడచుట్టూ రుమాలు కట్టుకొని వురిపోసుకు ఆత్మహత్య చేసుకొందని తేల్చారు.

ముందు నుంచీ గోపాల్ అంటే ఇష్టం లేకపోవడం వల్ల అతన్ని హింసించాలని ఈ ప్రయత్నం చేస్తూ భాగ్యం తనని తానే బలిచేసుకొందని - తర్వాత వురిపోసుకొన్న భాగ్యాన్ని చూసి భయపడి గోపాల్ ఆమెను పూడ్చి వేశాడని అబద్ధపు సాక్ష్యాలు సెలవిచ్చారు. దాంతో హత్యా నేరం బలహీనమైపోయింది.

లాయరుని జామీను ప్రయత్నం చేయమన్నాడు రావు. లాయరు సరేనని హైకోర్టు ద్వారా చివరికి కండిషన్డ్ బెయిల్ సంపాదించాడు. దాని ప్రకారం-

ప్రతిరోజూ గోపాల్ స్థానిక పోలీస్ స్టేషన్లో హాజరయి సంతకం చేసిరావాలి. వూరు విడిచి ఎక్కడికీ వెళ్ళకూడదు.

గత్యంతరం లేక ఆ విధంగానే బెయిల్ తీసుకొన్నారు. తగిన సహకారం వుంటే కండిషన్ లేకుండా ఆర్డినరీ బెయిల్ సంపాదించేవారే! కాని కుదిరింది కాదు.

లాయర్ మాత్రం ముందు ముందు దాన్నే ఆర్డినరీ బెయిల్ చేయొచ్చంటూ ధైర్యం చెప్పాడు.

బెయిల్‌ని మేజిస్ట్రేట్‌కి చూపించారు. ఆర్డర్ పొందారు.

జైలు నుండి గోపాల్ని తీసుకు రమ్మనమని మేజిస్ట్రేట్ జమాన్‌ను పంపాడు.

జైలు నుండి గోపాల్ని బయటకు తీసుకొచ్చారు. బేడీలు వేస్తామన్నారు పోలీసులు. అలాగే కోర్టుకు రావాలన్నారు.

గోపాల్ ఇబ్బందిగా చూశాడు రావు వైపు.

"వాళ్ళ చేతిలో ఓ పదిరూపాయలుంచండి" అన్నారు లాయరు నవ్వి.

పోలీసులకి పదిరూపాయలిచ్చాడు రావు. మేజిస్ట్రేట్ కోర్టుకు వచ్చారు. అక్కడ ఆఫీసులో "మామామూళ్లేవీ" అనడిగాడు హెడ్‌క్లర్క్-లాయర్ని.

"ఇస్తార్లే కానీ" అన్నాడు లాయరు.

ఫైలు తీసి క్లర్క్‌కు అందించాడు హెడ్. క్లర్క్ సంతకాలు తీసుకొన్నాడు హామీదార్లతో.

హెడ్‌క్లర్క్‌కి ఇరవై రూపాయలిస్తే తీసుకోలేదు. ముఖం చిట్లించుకొన్నాడు.

"ఈ పద్ధతి బాగా లేదండి" అన్నాడు.

రావు లాయర్ని చూశాడు. లాయర్ కళ్ళతోనే సౌంజ్ఞ చేస్తే మరో ఇరవై అర్పించాడు రావు.

క్లర్క్‌కి మరో పదిరూపాయలు ముట్టజెప్పారు. ఇంతలో కోర్టు జవాన్ వచ్చాడు. ముసిముసిగా నవ్వులు నవ్వుతూ-

"మా మీద దయలేదు" అన్నాడు.

"ఆయనకో అయిదివ్వండి" అన్నాడు

లాయరు. రావుకి ఇవ్వక తప్పిందికాదు.

"ఇద్దరం పంచుకోవాలి! మరో అయి దిప్పించండి" అన్నాడు జవాను.

మాట్లాడలేదు లాయరు. రావు అతని వెంట నడిచాడు. ఇద్దరూ కోర్టుకు ముందుగా వున్న చెట్టు నీడలో కూర్చు న్నారు.

మధ్యాహ్నం బెయిల్‌ని 'సరే' నన్నా రంతా.

బెంచి గుమస్తా వచ్చాడు దగ్గరగా.

"బాగున్నారా" అని లాయర్ని పలక రిస్తూ చేతులు నులుముకొంటూ నిల్చు న్నాడు. అతగాడికో పదినోటు అందిం చాడు రావు.

హెడ్ కానిస్టేబుల్ వచ్చాడు రంగం లోనికి.

"నమస్కారం సార్" అన్నాడు రావుకి పోలీస్ సాల్యూట్ చేసూ. అతనికి ఓ పాతిక సమర్పించారు.

"ఇక్కడ ఇంకో క్షణం వుంటే నిన్ను కూడ పంచుకుంటారు" అన్నాడులాయర్ రావువైపు చూసి నవ్వుతూ.

"గొప్ప కోర్టులండీ బాబూ! నీళ్ళలా డబ్బు ఖర్చుచేస్తున్నా మనల్ని ఎవరూ ఖాతరు చేయడంలేదు. మరిడబ్బులేని వాళ్ళ విషయంలో ఎలా ఉంటారో"

"ఎలా ఉంటారన్నది ఆ దేవుడికే ఎరిక! డబ్బుంది కాబట్టే యావజ్జీవ కారా గార శిక్ష పడాల్సిన గోపాల్ తప్పు కొన్నాడు. డబ్బుంది కాబట్టే న్యాయం అన్యాయం అయిపోయింది. లేకపోతే ఏమీలేదు" లాయరు అనుభవాన్నంతా వెళ్ళగక్కాడు.

రావు మాట్లాడలేదు మరి. ఖాళీ అయిన జేబుల్ని చూసుకొంటూ కూర్చొన్నాడు.

జైలు వార్డన్ పరుగెత్తుకుంటూ వచ్చా డక్కడికి.

"మనకేమీ లేదా సార్" అనడిగాడు చేయిసాచి. ఆ చేతిలో అయిదు నోటువుంచి రావు అక్కడినుండి పరుగందుకొన్నాడు.

గోపాల్, రావూ గీత ఇంటికి వచ్చారా మధ్యాహ్నం.

గీత ప్రయాణ హడావుడిలో వుంది.

"ఎక్కడికి ప్రయాణం" అనడిగాడు గోపాల్.

"హనీమూన్! పెళ్ళికాకుండానే. మా వుడ్‌బి టూర్ వేద్దామన్నారు. అవుననక తప్పలేదు నేను. అన్నట్టు బెయిల్ ఇచ్చారా" అనడిగింది.

"ఇచ్చారు దేవుడిదయవల్ల" అన్నాడు రావు.

తర్వాత ఆమె చేసిన సహాయానికి కృతజ్ఞతలు చెప్పి అక్కడినుండి బయల్దే రారు బస్ స్టేషన్‌కి.

గోపాల్ వూరిలోనికి వచ్చాడు.

'గుప్' మంది వార్త!

కోటయ్యా, రత్నానికీ వివరాలు తెలి శాయి. విని వూరుకొన్నారంతా!

ఆ ఆవేశంలో చీలుస్తాం - చూస్తాం అన్నారుగాని అవి చల్లారిన తర్వాత సద్దుమణిగారు. వాళ్ళు చేసినదానికి బాధపడుతున్నాడు.

పోయిన కూతురు ఎలాగు పోయింది. మళ్ళీ తిరిగిరాదు. అయితే డబ్బు మాత్రం విపరీతంగా ఖర్చవుతోంది. ఇది ఎవరు తిన్నదీ కాదు.

కేసువల్ల వాళ్ళు సాధించేదేమిటో అర్థంకాలేదు వాళ్ళకి. కేసు బలంగా వుంటే గోపాల్‌కి శిక్ష పడేది. అయితే గోపాల్‌కి శిక్ష పడినంత మాత్రాన చనిపోయిన కూతురు లేచి రాదు.

అయిందేదో అయింది.

గోపాల్‌పై కక్ష సాధించడంలో తమకి కలిసొచ్చేదేమీ లేదు. తను తీసు కొన్న గోతిలో తనే పడిందని కూతురు మీద ఓ కన్నీటిచుక్క రాల్చి వూరు కున్నారు.

చెడిన కూతుర్ని అసలు గోపాల్‌కి అంటగట్టడం తాము చేసిన మొదటితప్పు! పోనీ పెళ్ళితో బాగు పడుతుందనుకుంటే మళ్ళీ చెడతిరిగి చావు కొని తెచ్చుకొంది.

—అంతా గందరగోళ మనిపించింది వాళ్ళకి !

గ్రామ పెద్దలంతా రాజీ ప్రయత్నాలకి కోటయ్యను పిలిచారు.

"అయిందేదో అయింది! చచ్చిన నీ కూతురు ఎలాగూ తిరిగిరాదు. అలాగని బతికున్న గోపాల్‌ని చంపడం కూడ భావ్యంకాదు. ఆలోచించు! ఈ కేసులవల్ల ఇల్లూ, వళ్లూ హూనం తప్పితే కలిసొచ్చే దేమీలేదు. నామాట విని సఖ్యత కుదుర్చు కోండి" ప్రసిడెంట్ సర్దిచెప్తున్నట్టుగా అన్నాడు.

"అందుకని నోరు మూసుకొని వూరుకోమంటారా" అనడిగాడు కోటయ్య.

"నోరు మూసుకోక పోతే నోరు చేసుకో-నష్టం నీకే! కలిసొస్తే కూతురి బంగారం నలభై తులాలు నీకంట గడ తారు. లేదని విర్రవీగితే కేసూలేదు- బంగారం లేదని 'ఫుఫ్' మంటారు"

"అందుకని..."



"నామాట విని వాళ్ళతో రాజీకిరా! కాంతం ఎవరో కాదు-నీ రక్తసంబంధం. దాంతో మరోసారి వియ్యమందు"

"అంటే"

"కరుణని నీ కొడుక్కి చేసుకో"

కోటయ్య చివ్వున లేచాడు—

"ఛస్తే చేసుకోను. ఒకసారి చేసి చేతులు కాల్చుకొంది చాలు" అన్నాడు.

"ఆవేశాన్ని తగ్గించుకో! కాస్తంత బుర్రకి పనిచెప్పు! గోపాల్ చేసింది తప్పే. కాదనం. మరి నీ ఇంటి బంగారం మంచిదంటావా? కాదే! ఆలోచించు. కాబట్టి కోపాలూ, తాపాలూ మాని బంగారం-బంగారంలాంటి పిల్లా నీ ఇంట అడుగు పెట్టాలంటే నా మాటలు పాటించు. లేదంటే మానుకో" ప్రెసిడెంటు తేల్చేశాడు.

"నేనొప్పుకొన్నా నా భార్య వప్పుకోదు" కోటయ్య విసుక్కున్నాడు.

"నీభార్యని వప్పించే పూచీ నాది" అన్నాడు ప్రెసిడెంట్.

తర్వాత రాజయ్యని కలిశాడు.

గోపాల్ తండ్రి దగ్గరగా కూర్చున్నాడు.

ప్రెసిడెంట్ వస్తూనే అసలు విషయం బయటపెట్టాడు.

"కక్షలూ, కార్పణ్యాలూ పెంచుకొంటే జరిగే మేలేమీలేదు. కాబట్టి కరుణని వాళ్ళింటి కోడల్ని చేయండి" అన్నాడు.

"నేనొప్పుకోను. నా కూతుర్ని రాసి రంపాన పెడుతుంది ఆ రత్నం" అంది వింటూనే కాంతం అంతెత్తుకు ఎగిసిపడుతూ.

"ఇది వూరా! వల్లకాడనుకొన్నావా? అలా చేస్తే అడిగేవాళ్ళం మేం వున్నాం! భాగ్యాన్ని చంపినా గోపాల్ని వెనకేసుకొచ్చామంటే రెండువైపులా తప్పులున్నాయని అలా వచ్చాం! అదే ఒకవైపు తప్పంటే తలతీసి మొలవెయ్యం?"

గోపాల్ ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఇదీ ఒకందుకు మంచిదే! విడిపోయిన బంధుత్వాలు మళ్ళీ కలుస్తాయి" అన్నాడు.

"బాగా ఆలోచించే అంటున్నారా? ఏది ఏమైనా తర్వాత ఏడుస్తూ కూర్చోవలసి వస్తుంది" శాంతి కల్పించుకొంది.

"ఏమీ జరగదు. దీనివల్ల అందరూ మళ్ళీ అయిన వాళ్ళవుతారు. ఒకసారి తప్పుచేసి తెలుసుకున్న తర్వాత మళ్ళీ మళ్ళీ తప్పులుచేయరెవరూ.నా ఉద్దేశంలో కరుణ సుఖంగానే వుంటుంది"

శాంతి మరి ఎదురు చెప్పలేదు గోపాల్ కి. అసలు కరుణ అభిప్రాయం అడక్కుండానే పెద్దలంతా పెళ్ళి నిశ్చయించడం ఆమెకు బాధగా వుంది.

కరుణకి పెళ్ళి ఇష్టం లేకపోతే మళ్ళీ లేనిపోని గొడవలు. ఆమె అభిప్రాయం తెలుసుకోవాలనుకొంది.

కరుణని పిలిచి అంతా చెప్పింది శాంతి.

"నా కిష్టమే! బావా, నేనూ ప్రేమించుకొన్నాం కూడా. అయితే ఈ తగువుల్లో మా పెళ్లి అవుతుందా కాదా అని భయపడుతున్నాం! దేవుడు మేలే చేశాడు" అంది కరుణ.

శాంతి ఆమాటలకి ఆశ్చర్యపోయింది.

కరుణని గట్టిగా కౌగిలించుకుని—

"అయితే నువ్వా కథానాయకురాలివే నన్నమాట" అంది.

సిగ్గుపడింది కరుణ.

ఉమకి ఈ విషయం తెలియగానే

సంబరపడింది.

మనస్పర్థలు మటుమాయమై రెండిళ్ల ఒకటిగా కలిసుంటాయంటే ఆనందమని పించింది.

రెండు వర్గాల వాళ్ళకి నచ్చజెప్పి పూర్తిగా ఇష్టపడ్డ తర్వాత ఇచ్చి పుచ్చు కోడాలు నిర్ణయించుకోమన్నారు పెద్దలు.

భాగ్యానికి ఇచ్చిన డబ్బు మొత్తం- బంగారం తిరిగి ఇచ్చే విధంగా నిర్ణయించు కొన్నారు. అదిగాక కరుణ పేరుతో కొంత పొలం రాసిస్తానన్నాడు రాజయ్య.

కోటయ్య కొడుక్కీ, కరుణకీ పెళ్లి జరిగిపోయింది.

తిరిగి ఆ రెండు కుటుంబాలూ కలుసు కొంటాయని ఎవరూ ఊహించలేదు. జరిగినదాన్ని రత్నం మరిచిపోదను కున్నాడు. కాని, పెద్దలు చెప్పడంతో ఆమె కూడా ముందడుగు వేసింది. అనవసరంగా కలతలు రేపుకోవడం మంచిది కాదనుకొంది.

కోడల్ని కూతురిలా చూసుకొంటానని హామీ ఇచ్చింది.

దాంతో—

కేసు మళ్లీ కోర్టులకి వెళ్లకుండానే పోలీసుస్టేషన్ పరిధిలోనే ఫైసలా అయింది. కోటయ్య కేసుని ఉపసంహ రించుకొన్నాడు. కొంత డబ్బు ఖర్చు చేయాల్సొచ్చినా జంకలేదు దానికోసం!

కరుణ పెళ్లికి గీత వచ్చింది.

దంపతులిద్దర్నీ ఆశీర్వదించింది.

పెళ్లి పెద్దలా కలివిడిగా తిరుగు తున్న శాంతిని పిలిచి —

"మరి నీ పెళ్లెప్పుడు ?" అని ప్రశ్నించింది.

"నా పెళ్లేమిటి?" అంది ఆశ్చర్య పోతూ శాంతి.

"నీకూ, గోపాల్‌కి పెద్దల దగ్గర పెళ్లి కాలేదుకదా! దాంతో మీరిద్దరూ భార్యాభర్తలుగా లెక్కరారు"

"సరే అయితే. పెళ్లెప్పుడు చేసుకో మంటారు"

"నీ ఇష్టం" నవ్వింది గీత.

ఉమ వచ్చింది అక్కడికి.

"ఏమిటి?" అని అడిగింది.

"నీ మరదలు శాంతి పెళ్లి పెద్దల ముందు ఎప్పుడా అని అడుగుతున్నాను" అంది గీత.

"ఇవాళే! గుడిలో ఇద్దరిచేతా దండలు మార్పిద్దాం! సాక్ష్యంగా నువ్వే ఉండాలి" ఉమ నవ్వుతూ అంది.

"తప్పకుండా"

గుళ్లో దండలు మార్చుకొన్నారు శాంతి-గోపాల్.

"దీవించండి డాక్టర్" శాంతి గీత పాదాల్ని కళ్లకద్దుకొంది.

"వెయ్యేళ్లు సుఖంగా వర్ధిల్లు" గీత శాంతి భుజాలు ఎత్తిపట్టుకొని లేపింది. ఆమె నుదుటిని చుంబించింది.

అప్రయత్నంగా కళ్లలో నీళ్ల తిరిగాయి శాంతికి. వాటిని చూసి గాబరా పడింది గీత.

"ఏమిటిది?"

"ఆనందం పట్టలేక"

"చంపావు. గోపాల్ని పెళ్లి చేసుకో వడం నీ కిష్టం లేదేమోననుకొన్నాను" నవ్వుతూ అంది గీత.

అందరూ ఆమె చమత్కారానికి నవ్వారు.

ఆలయంలో గుడిగంటలు మోగాయి.

పంతులు హారతి అందించాడు...

★

# వ్యామోహం

[యదార్థ గాథలు]

రాండర్ గై

ఉదయం పదకొండయినా రత్నాబాయి ఇంకా పడుకునే వుంది. మెత్తటి బూరుగు పరుపు మీద మగతగా ఇటూ అటూ దొర్లుతూంది. అయినా ఇదేమీ ఆమెకు కొత్తకాదు.

కర్నాటకలోని కరకల్- ఉడిపిల మధ్యనున్న బిల్లూరు గ్రామంలో మంచి పేరున్న నాటకరంగ నటి రత్నాబాయి.. కొంచం పొట్టిగా వుండి. బంగారు





ఛాయలో మెరిసిపోయే ఆమె తన సోగ కన్నుల చిలిపి చూపుల్తో యువకుల హృదయాల్లో తీరని ఆశలు లేపేది. కను సైగలతో పురుషుల్ని తన చుట్టూ తిప్పుకుని వారిచేత ఎలాంటి పనైనా చేయించగల గడసరి.

కన్నడ నాటక రంగంలోని కళాభిమానులే కాక ఇతరత్రా కూడా ఆమె అందాన్ని పంచుకుని తమ యవ్వనాన్ని సార్థకం చేసుకునే రసికులెందరో ఆమె పంచన చేరేవారు. ఇలాటి వారిలో గురవప్ప, వామనరావులు ఆమెకు సన్నిహితులు. వీళ్ళతో ఆమె తరచు ఉడిపి, మల్పే, ముల్కి, మూడ బిదిరి, కరకల్, ఇన్నవుజె, కుందాపూర్ ప్రాంతాల్లో కన్నడ, కొంకణి, తుళు నాటకాలు వేస్తూ తిరిగేది. వారానికి రెండు మూడు రోజులిలా విరామంలేకుండా రాత్రింబవళ్లు తిరుగుతూ రాత్రి బాగా పొద్దుపోయిందాకా మేల్కొని ఉదయం పొద్దెక్కేక నిద్ర లేవటం ఆమె కలవాటు.

ఆ రోజుదయం పదకొండయినా నిద్ర లేవని రత్నాబాయిని పోలీసులొచ్చిపట్టుకు పోయారు. తన భర్త చికోనప్పను హత్య చేసిందన్న నేరం మోపి కోర్టులో హాజరుపరచారు.

చికోనప్పకు చిన్నప్పటినుంచీ నాటకాల పిచ్చి. తన యవ్వనంలో తను ఎవరెవరితో వేషాలు వేసిందీ, ఏయే ప్రదేశాలు తిరిగిందీ మొదలైన విషయాల్ని తన స్నేహితులతో చిలవలు పలవలుగా వివరించి చెబుతూ ఉంటారాయన. గుబ్బి వీరన్న, సుబ్బయ్య నాయుడు, వరదాచార్ లాంటి నాటక రంగ మేటిలతో వేషాలు వేశాడాయన. అలాంటి కళాకారుడిప్పుడేడీ? అసలు ఆ కాలమే వేరు. ఇదీ ఆయన బాధ!

ఆయన డ్రామా కాంట్రాక్టరుగా పని చేసే కాలంలో రత్నాబాయి అతన్ని కలుసుకోవటం జరిగింది. తల్లీతండ్రీ లేని రత్నాబాయి తన చిన్నాన్న ఇంట్లో పెరిగింది. ఆ చిన్నాన్న ఓ తాగుబోతు. అస్తమానం తాగిన మైకంలో ఆమెను తెగ హింసించేవాడు. ఆ బాధ భరించ లేక రత్నాబాయి అతన్నుంచి తప్పించుకుని పారిపోయి వచ్చింది. చికోనప్ప పంచన చేరింది. పొట్టిగా, అందంగా చూడ ముచ్చటగావున్న ఆమెను చికోనప్ప చేరదీసి, నటన నేర్పి, ఆమెను నాటక రంగంలో ప్రవేశపెట్టాడు. ఈ రుణాన్ని తీర్చుకుందుకు రత్నాబాయి అతన్ని పెళ్లాడింది. కాని తను అతనికి నాల్గో భార్యో, అయిదో భార్యో మాత్రం తెలీదు. ఇలా తన్ను చేరదీసి, తనకు నీడనిచ్చిన వ్యక్తిని అందునా స్వయానా తన భర్తను తను హత్య చేయటమేమిటని రత్నాబాయి వాపోయింది.

ప్రాథమిక విచారణ తర్వాత ఆమెను మంగుళూరు సెషన్సు కోర్టులో హాజరు పరచారు.

ఆమెతోబాటు గురవప్ప, వామనరావు, జవారగౌడల్ని కూడా నిందితులుగా కోర్టులో హాజరుపరచారు. కోర్టులో పబ్లిక్ ప్రాసిక్యూటరు వీరి నేరాన్ని వివరిస్తూ అతిదారుణంగా చికోనప్పను హత్య చేసిన వీరికి ఉరిశిక్ష విధించాలని కోర్టువారికి విన్నవించుకున్నాడు. అతనివాదన ప్రకారం :

రత్నాబాయి ఓ నీతిలేని స్త్రీ. నాటకాల పరదా వెనక రత్నాబాయి ఆడే రాసక్రీడలలో గురవప్ప, వామనరావులు ముఖ్యులు. వీళ్లిద్దరూ పొద్దస్తమానం తన భార్య దగ్గరకు వచ్చి పోతూండటం చికోనప్పకు నచ్చలేదు. ఆమాటే అతనెన్నోసార్లు తన భార్యతో అంటే వాళ్లు తమ డ్రామా పార్టీలోని సభ్యులనీ, వాళ్లు తన దగ్గరకు రిహార్సల్సు కోసం వస్తూ వుంటారంతే గానీ ఇతరత్రా వారికెలాంటి దురుద్దేశం లేదనీ ఆమె అనేది. కాని ఆ నాటకరంగ కళాకారుల రసికత చికోనప్పకు తెలీందేం కాదు. రత్నాబాయి మాటలు అతనికి తాతకి దగ్గు నేర్పేవిగా అనిపించాయి.

ఇలా అస్తమానం తన సుఖాలకు అడ్డొస్తూ తన్ను వేధిస్తున్న భర్తను వదిలించుకోవాలనుకుంది రత్నాబాయి. అందుకోసం ఆమె గురవప్ప, వామనరావుల సాయం అర్థించింది. వాళ్ళూ సరేనని ఈ విషయంలో జవారగౌడ సాయం కోరారు. ప్రతిఫలంగా అతనికి రత్నాబాయి పొందు ఆశ చూపారు. అతను సరేనని వాళ్ళలో కలిసిపోయ్యాడు.

జవారగౌడ చికోసప్ప తాగుడు స్నేహితుడు. అతనొక రోజు చికోసప్పను తాగుడు పార్టీకని అడవిలోకి దూరంగా పిలుచుకునిపోయి, చిత్తుగా తాగించి, అతను స్పృహతప్పి పోయిం తర్వాత నలుగురూ కలిసి, అక్కడే పడున్న ఓ పెద్ద బండరాయితో అతన్ని తలమీద బాది చంపేశారు. అందుకు నిదర్శనం హత్యాస్థలం దగ్గర దొరికిన రాయే!



* * *

కానీ...

రత్నాబాయి తిరిగే చెడు తిరుగుళ్ళ ఫలితంగా ఓ దుర్ముహూర్తాన గర్భవతి అయింది. దాంతో ఆమె తలమీద పిడుగు పడినట్టయింది! ఎలా? చికోసప్పకు తండ్రి అయ్యే వయస్సు ఎప్పుడో దాటిపోయింది అదీగాక అతను తన భార్యను వయసులో వున్న ఓ స్త్రీగా ఎన్నడూ చూడలేదు. మొదటినుంచీ ఆమెనతడు తన ఆధీనంలో ఉన్న ఓ విలువైన వస్తువుగానే భావిస్తూ ఆమె గురించి నలుగురికీ గర్వంగా చెప్పకుంటూ వచ్చాడు. అసలు అతనిది అతి చిన్న ప్రపంచం. అందులో అతనూ, అతని స్నేహితులూ, గతించిన అతని నాటకరంగ స్మృతులు. తన స్నేహితుల మధ్య కూచుని అరక్ తాగుతూ ఒళ్లు తెలీని మైకంలో బూతులు వాగుతూ, తను గడిపిన మైసూరు మహారాజుల కాలం, గుబ్బి వీరన్న నాటక కళ, తన నటనా చాతుర్యం లాంటి జ్ఞాపకాలుండేవి అతని ప్రపంచంలో.

ఇలా ఆ సమానం వాసవికతకి దూరంగా గతంలోనే జీవించే చికోసప్పకు తను గర్భవతినని తెలిస్తే ఇంకేమయినా వుందా? కాదు. ఏనాటికీ అతనికీ విషయం తెలీకూడదు. అందుకోసం రత్నాబాయి తన గర్భం దించుకుందుకు ఎన్నో మందులు వాడింది. అయినా ఏమీ ప్రయోజనం లేకపోయింది. విసిగివేసారిన రత్నాబాయికి ఒకసారి ఆ ముసలాయన్ని చంపేస్తే- అన్న ఆలోచనొచ్చింది.

అవును. గుట్టుచప్పుడు కాకుండా చికోసప్పను హతమారిస్తే తన పాపం

అతని కెప్పుడూ తెలీదు. ఈ విషయం గురవప్ప, వామనరావులతో సంప్రదిస్తే వాళ్లు సరేనన్నారు. చికోనప్పకు తాగుడు స్నేహితుడయిన జవారగౌడ సాయం కోరారు. ప్రతిఫలంగా అతనూ రత్నాబాయి ప్రియుల లిస్టులో చేరిపొయ్యే ఆశ చూపారు. అతనూ సరేనని అనుకున్న ప్రకారం చికోనప్పను తాగుడు పార్టీకని అడవిలో దూరంగా పిల్చుకుపోయి చిత్తుగా తాగించాడు. అప్పుడు ఈ నలుగురూ కలిసి దగ్గరే పడున్న ఓ పెద్ద బండరాయితో అతని తలమీద బాది చంపేశారు.

కోర్టులో నలుగురు నిందితులూ తాము ఏ పాపం ఎరగమని బుకాయించారు. అసలు ఆరోజు తాము ఆ ఊళ్ళోనే లేమన్నారు. కాని ప్రాసిక్యూషన్ సాక్షులు మాత్రం వీళ్లని బస్సులోంచి దిగటం, అడవుల్లోకి పోవటం తాము కళ్లారా చూశామని చెప్పారు. వీళ్లు తరుచు నాటకాల్లో వేషాలు వేస్తుండటం మూలాన వీళ్ళను తాము బాగా ఎరుగుదుమని కూడా అన్నారు. అంతేకాక హత్యాస్థలం దగ్గరే దొరికిన మారణాయుధం మీది రక్తపు మరకలు, వెంట్రుకలు, మాంసకణాలు చికోనప్పవేనని రుజువయింది. ఇంకా హత్య జరిగిన స్థలంలోనూ, ఆ చుట్టుపట్ల నేలమీద వీళ్ళ చెప్పుల గుర్తులు కనిపించాయి. ఇవన్నీ వీళ్ళ నేరాన్ని రుజువు చేశాయి.

కోర్టువారు గురవప్ప, వామనరావు, రత్నాబాయిలకు ఉరిశిక్ష వేశారు. జవారగౌడకు మాత్రం ఆజన్మ శిక్ష పడింది. నేరస్థులు నలుగురూ మద్రాసు హైకోర్టుకు అప్పీలు చేసుకున్నారు.

రత్నాబాయి తన అప్పీలులో తాను గర్భవతిననీ, అందుకోసం తన్ను ఉరి తీయ వీల్లేదనీ అంది. జైలు డాక్టరు ఆమెను పరీక్షించి ఆశ్చర్యపోయారు. ఆ పరీక్షా ఫలితాన్ని విన్న రత్నాబాయి దుఃఖంతో మెలితిరిగిపోయింది. విధి తన్ను వంచించిందని వాపోయింది!

ఏదిఏమైనా మద్రాసు హైకోర్టు రత్నాబాయి శిక్షను ఆజన్మఖైదుకు తగ్గించింది.

ఇంతకూ జైలు డాక్టర్లు రత్నాబాయిని పరీక్షించి తేల్చిందేమిటి?

సాధారణంగా కొందరు స్త్రీలకు అప్పుడప్పుడూ కనిపించే కృత్రిమ గర్భధారణ చిహ్నాలే ఆమెలోనూ కనిపించాయి. అంతేగాని ఆమెకు నిజంగా గర్భం రాలేదు!

నిష్కారణంగా తన భర్తను చంపానన్న వ్యధ, తన్ను దారుణంగా వంచించిన తన విధి వైపరీత్యానికి తట్టుకోలేక రత్నాబాయి జైలులోనే పిచ్చిదైపోయింది!

*

# కసి

చంద్రశేఖర రెడ్డి నెల్లూరు జిల్లాలో గొప్ప మోతుబరి కింద లెక్క. అతను వుండేది ఇనమడుగు గ్రామంలో. దానికి దగ్గరగా వుండే సర్వేపల్లి, మారేడుగుంట, గూడూరులలో అతనికి అయిదువందల ఎకరాల సుక్షేత్రం వుంది. అంతేకాదు మామిడి, జామ, కొబ్బరి వంటి తోటలు కూడా చాలా వున్నాయి. డబ్బు ఇబ్బంది అంటే అతని ఊహకు అందని విషయం. నలభై పైబడుతున్న రెడ్డి అందగాడి కిందే లెక్క. భార్య యశోద అందగత్తె కాకుండా మంచి సరసురాలు. ఆమె సరదాలు,

సుఖాలు పట్టవతనికి. ధనార్జనే అతని జీవిత ధ్యేయం. ఆ దంపతులకు సంతానం లేదు. ఇద్దరిలోనూ ఆ బాధ బాగా కనిపిస్తుంది.

"నెల్లూరులో డాక్టర్లదగ్గర మందులు తీసుకుంటాను" అని రెడ్డి తరచుగా నెల్లూరు వెళ్తూంటే, యశోద వ్యంగ్యంగా "అలా ఎప్పుడూ వూరిపైబడే తిరిగే బదులు ఓ నాల్రోజులపాటు ఇంటిపట్టునే వుండి చూడండి. సంతానం కలిగి తీరుతుంది" అంది చాలాసార్లు. యవ్వనంతో మిసమిసలాడుతూ, అనుభూతులకోసం తపించిపోతోంది యశోద అప్పట్లో.

ఓసారి రెడ్డి ఎప్పట్లాగే కేంప్ వెళ్లి



పోయాడు.

ఒంటరిగా, మెత్తని పరుపుతోవున్న తన విశాలమైన మంచంమీద వేడి నిట్టూర్పులు విడుసూ రాని నిద్రకోసం వృథా ప్రయత్నం చేసింది యశోద. అలా చాలాసేపు గడిచింది మగతగా నిద్ర. ఆ మగతలోనే ఒక మగతనం ఆమెను వివశను చేసింది. బలమైన కౌగిళ్ళను, మృదువైన స్పర్శలను కోరుకుంటున్న ఆమె ఆశ అక్షరాలా తీరిపోయింది.

తననీ, తన వయసునీ నలిపి ముద్ద చేస్తున్నా, ఎముకలు విరిగిపోయేంత గట్టిగా తనని హత్తుకుంటున్నా యశోద మారు మాటాడలేదు. పైగా ఆ అనుభవంతో ఆమె పురుషుడి పొందులో వుండే ఆనందాన్ని తనివితీరా జుర్రుకుంది. అతనెవరు- అనే ఆలోచనైనా లేకుండా, ఏనాడూ చవిచూడని శారీరక సుఖాన్ని అందిస్తున్న అతణ్ణి మరింత దగ్గరగా వాటేసుకుని, ఆనందంలో తడిసి ముద్దయిపోయింది. అసలు సంగతి-తలుపులు వేసుకోకుండా అర్ధనగ్నంగా, మగత నిద్రలోవున్న ఆమెను చూసి చలించిపోయిన ఆ ఇంటి ఇరవై రెండేళ్ళ పాలేరు గోపయ్య, తన మగతనపు జోరునంతా యశోదపై గుమ్మరించాడు. అయితే యశోదకు తన శారీరక ఆనందం తీరడానికి పంపబడ్డ గంధర్వుడులాగే కనబడ్డాడు గోపయ్య.

ఆనాడు అలా ప్రారంభమైన వారి కామకేళీ, రెండో కంటికి తెలీకుండా కొనసాగజొచ్చింది. భర్త ఊళ్లో వున్నా, తన స్నేహితులతో చతుర్ముఖ పారాయణంలో మునిగిపోతాడేగాని యశోద గురించి పట్టించుకోడు.

ఆ రోజు సాయంత్రం యశోద దగ్గరగా వున్న తమ మామిడితోటకు వెళ్లి ఆరముగ్గిన పళ్ళను గంపలెత్తించుకువస్తానని చెప్పి బయలుదేరింది.

నడిచివెళ్లవద్దనీ, కారులో వెళ్ళమనీ డ్రైవర్ బాషాని పిలిచాడు భర్త. అతను

చాలా బలంగా, పొట్టిగా, కాస్త కౄరంగా వుంటాడు.

యశోదకు ఆ కారులో వెళ్ళక తప్ప లేదు. తోట దగ్గర ఆమె దిగిపోతూ కారు తీసుకువెళ్ళిపోమంది. బాషా ముందు అంగీకరించకపోయినా, చివరకు వెళ్ళి పోయాడు.

ఆ తోటలో వున్న చిన్న రెండు గదుల ఇంటికేసి నడిచింది యశోద. అప్పటికే రెండు గంపలనిండా అరముగ్గిన మామిడిపళ్ళను నింపి, రెండు చేతుల తోనూ యశోదను గాఢంగా అందుకు నేందుకు గోపయ్య సిద్ధంగా వున్నాడు.

చీకట్లు ముసురుకుంటున్నా, మేఘాలు పరుచుకుని సన్నగా చినుకులు ప్రారంభ మైనా వారికి ఆ దృష్టేలేదు.

బైట చిరుచలితో కూడుకున్న గాలి, చిన్న నీటి తుంపరతో మరీ చలెక్కి వారిని మైమరపింపజేసింది. అలా ఎంత సేపు వున్నారో వారికే తెలియదు. ఆ మైకంలో ఆ గది తలుపులు తెరుచుకో వడం, నగ్నంగా రత్యానంతర సుఖంతో అలసటగా ఒకరినొకరు పెనవేసుకున్న వారిని రెండు కళ్ళు స్పష్టంగా గమనిం చడం వారు గమనించలేదు.

అలా చూసిన ఆ వ్యక్తి తన రాకను తెలియజేస్తూ చిన్నగా దగ్గుతూ అక్కడి నుంచి కదిలాడు.

మైకం విడిపోగా గోపయ్య ఆ వెళు తున్న వ్యక్తికేసి చూశాడు. అతను బాషా. కారు డ్రైవరు. గోపయ్య నిలువునా వణికిపోయాడు. తనకు చావు తప్పదను కున్నాడు. ఆమె చేతులు పట్టుకుని తనని రక్షించమని వేడుకున్నాడు. యశోద కంగారు పడింది. అయితే పైకి అదేమీ కనిపించనివ్వకుండా జాగ్రత్తపడింది.

కంగారుపడవద్దని గోపయ్యను శాంతపరిచి విడిచిన బట్టలు తిరిగి ధరించి, ఇంటి ముఖం పట్టింది.

ఇంటి దగ్గర భర్త ప్రవర్తనలోగానీ, మాటల్లోగానీ ఎలాంటి ఉద్రేకమూ కని పించలేదు యశోదకు.

చాలా ప్రశాంతంగా ఎప్పట్లావున్నాడు భర్త. ఇది గమనించి ఎంతో ఆనందిం చింది ఆమె.

అయితే జరిగింది అది కాదు. బాషా చూసింది చూసినట్టు, పూసగుచ్చినట్టు చెప్పేశాడు ఆమె భర్తకు.

కొద్దిరోజుల తర్వాత నెల్లూరులో వున్న తన చెల్లెలు శారదను చూడ్డానికి వెళ్తానంది యశోద.

అభ్యంతరం చెప్పలేదు రెడ్డి. ఎప్ప ట్లాగే, భర్త ఊళ్ళో లేనప్పుడు గోపయ్యను తీసుకుని నెల్లూరు బయలు దేరింది యశోద.

నెల్లూరులో ఓ పాత సినిమా హాలు దగ్గరగా వున్న ఓమురికి కాలువ పక్కన వున్న ఇంట్లో శారద, ఆమె భర్త వెంగళరెడ్డి, అతని తమ్ముడు పెంచల రెడ్డి వుంటున్నారు.

పెంచలరెడ్డి మద్రాసులో చదువు కుంటూ అప్పుడప్పుడు నెల్లూరు వస్తుం టాడు. ఇప్పుడు యశోద వెళ్ళే సమయానికి పెంచలరెడ్డి కూడా నెల్లూరులోనే ఉన్నాడు. ఆరాత్రి చాలా సేపు నలుగురూ కూర్చుని పేకాడుకున్నారు. బాగా నిద్ర వసుందంటూ శారద, ఆమె భర్త లేచి పోయారు. వాళ్ళు వెళ్ళాక కొంత సేపు యశోద, పెంచలరెడ్డి కలిసి ఆడారు.

బాగా ఉక్క పెడుతుండడంతో పెంచలరెడ్డి వేసుకున్న చొక్కా విప్పేసి కేవలం లుంగీతో మాత్రం కూర్చున్నాడు.

అతని విశాలమైన ఛాతీ, బలమైన చేతులు ఆమె తదేకంగా చూసింది. అదే సమయానికి పెంచలరెడ్డి కూడా యశోదను చూశాడు. కొద్దిసేపటికి ఆట ఆపి, డాబా దిగి కిందకు వచ్చేశారు వాళ్లిద్దరూ. ఉక్కగా వుందని యశోద వరండాలో వున్న మంచంమీద పడుకుంది పమిటతో విసురుకుంటూ. పెంచలరెడ్డి మాత్రం గదిలోనే ఫ్యాను వేసుకుని పడుకున్నాడు.

ఓ గంట గడిచిన తర్వాత, ఆమె కళ్లు గోపయ్యకోసం వెతికాయి. వరండా అరుగుమీద వారగా ఈతచాప వేసుకుని చిన్న గావంచావంటిది కట్టుకుని పడుకుని వున్నాడు గోపయ్య. అది నిద్రకాదు.

ఆమె లేచి మెల్లగా గోపయ్యను సమీపించి, అతన్ని పెనవేసుకుని పడుకుంది. మరుక్షణం ఇటు తిరిగాడు గోపయ్య.

* * *

సూర్యోదయం అయీ అవని, చిరు చీకట్లు ఇంకా విడీవిడని తెల్లవారు ఝామున ఆ ఇంటి పనిమనిషి శశి వచ్చి వీధి తలుపు తట్టబోయింది. అయితే అవి వాటంతట అవే తెరుచుకోవడంతో ఒకింత ఆశ్చర్యంతో లోపలికి వచ్చి, మూలవున్న చీపురు అందుకుని, వరండాలో వున్న ముగ్గుబుట్ట, చెంబుతో నీళ్లు తీసుకునేందుకు ముందుకు నడిచింది. రెండడుగులు వేసిందో లేదో, అక్కడ ఎదురైన దృశ్యం చూసి ఆమె రక్తం గడ్డగట్టుకుపోయింది. శరీరమంతా కర్రకట్టుకు పోయింది. భయంకరంగా ఆమె వేసిన కేకకు ఉలిక్కిపడి లేచి, గబగబా కిందకుదిగారు శారద, వెంగళరెడ్డి.

ఆ ప్రాంతమంతా రక్తపు మడుగుగా వుంది. ఆ రక్తపు మడుగులో రెండు శరీరాలు నగ్నంగా తేలుతున్నాయి. ఆ శరీరాలకు మొండాలేగాని, శిరసులులేవు. ఆ మొండాలు కూడా అతి క్రూరంగా చిత్రవధ చెయ్యబడి వున్నాయి. తెగిన చర్మం, మాంసం ముక్కలు, రక్తం — ఆ ప్రదేశమంతా అత్యంత బీభత్సంగా వుంది.

అవి యశోదా, పెంచలరెడ్డి శరీరాలని గుర్తించారు. ఆ దృశ్యం చూసి స్పృహ కోల్పోయింది శారద.

పోలీసులు రంగంలోకిదిగి ఆ తలలేని మొండాలను పోస్టుమార్టంకు పంపేరు.

కొద్ది రోజుల తర్వాత ఆ ఇంటికి దగ్గరగా వున్న మురికికాలువలో పెంచలరెడ్డి తల కనబడింది. దానికి ముక్కూ, నాలుక ఖండించబడి ఉన్నాయి. రైల్వే లైనుకు దగ్గరగా ఒక పొదలో ఒక గుడ్డ సంచీలో యశోద తల కనుగొన్నారు పోలీసులు. పైథాలజిస్టు రిపోర్టు ప్రకారం ఆ భయంకర హత్యలు రాత్రి రెండు గంటల సమయంలో జరిగి వుంటవచ్చని తేలింది. ఆ సమయానికి మద్రాసు వేపు రెండు రైళ్ళు వెళ్లాయి. హంతకుడు హత్యల అనంతరం మద్రాసు వెళ్లిపోయి వుండాలని భావించారు పోలీసులు. ఆ ఇంటికి దగ్గరగా వున్న ఓ టీస్టాలు యజమాని మూడుగంటల ప్రాంతంలో తన దుకాణానికి ఎవరో పొట్టిగా కనిపించే ఒక ముస్లిమ్ వచ్చి టీ, రొట్టె తీసుకున్నాడని, అతని చేతిలో ఒక సంచీ వుందని, అది రక్తసిక్తమైవుందని చెప్పాడు.

పరిశోధనల తర్వాత కొద్ది రోజులకు చంద్రశేఖర రెడ్డిని, అతని డ్రైవర్ బాషాని మద్రాసులో అరెస్టుచేసి తీసుకువచ్చారు నెల్లూరు పోలీసులు. టీ దుకాణం అతను

బాషాను గుర్తించాడు.

అనేకరకాల బాధించాక బాషా అసలు విషయాన్ని కక్కేడు. నెల్లూరులో ఉన్న యశోదను, గోపన్నను హత్య చేసేందుకు యజమాని తనని వాడుకున్నాడని చెప్పాడు బాషా.

ముందే నిర్ణయించుకున్న ప్రకారం నెల్లూరులో తాను దిగి, రోశయ్య, పీటర్, మసూద్ అనే కిరాయి రౌడీల సహాయంతో ఈ హత్య చేశానని అంగీకరించాడు బాషా.

అయితే హత్య చేయవలసింది గోపన్ననుకాగా, మరి పెంచలరెడ్డి ఎలా హత్య కావించబడ్డాడో ఎవరికీ అర్థం కాలేదు. చివరకు ఎలా అయితేనేం గోపయ్యను కూడా పోలీసులు అరెస్ట్‌చేసి నెల్లూరు జిల్లా సెషన్స్ జడ్జి కోర్టులో ప్రవేశపెట్టారు.

"ఆ రాత్రి మేం ఇద్దరం చాలాసార్లు ఆనందాన్ని అనుభవించాం. ఇంతలో పెంచలరెడ్డి గదిలో లైటు వెలగడంతో మేం భయపడ్డాం. ఆమె నన్ను పెరటింటి గదిలోకి వెళ్లిపొమ్మంది. నేను మెల్లిగా జారుకున్నాను. అయితే రెండు గంటలు దాటుతున్నా నాకు నిద్రపట్టలేదు. మెల్లిగా లేచి వరండాకేసి నడిచాను. అక్కడ పెంచలరెడ్డితో నగ్నంగా సుఖిస్తున్న యశోదను చూసి అసూయతో వూగిపోయాను. కానీ, నేనేం చెయ్యగలను? ఆడజాతిని నిందించుకుంటూ నా పెరటిగదిలోకి వచ్చి పడుకున్నాను. ఉదయం జరిగిన ఘోరం చూసి భయపడి పారిపోయాను" అన్నాడు గోపయ్య

చంద్రశేఖరరెడ్డికి, బాషాకి, మిగిలిన ముగ్గురికీ జిల్లా జడ్జి ఉరిశిక్ష విధించాడు. వారు హైకోర్టుకు, తర్వాత ఫెడరల్ కోర్టు ఢిల్లీకి కూడా అప్పీలు చేసుకున్నా ప్రయోజనం లేకపోయింది. చివరికి లండన్‌లో వున్న ప్రీవీ కౌన్సిల్‌కూ విన్నవించుకున్నాడు రెడ్డి. అక్కడి నుంచి కూడా వీరి మరణ శిక్ష ఖాయ పరచబడింది. అందర్నీ ఉరితీశారు.

ఇది 1947కు పూర్వం జరిగిన సంచలనాత్మక సంఘటన. *

# ఈ...ర్...ష్య

సెషన్స్ కోర్టులో పబ్లిక్ ప్రాసిక్యూటర్ కోర్టువారికి విన్నవించుకుంటున్న మాటలకి బోనులో నిల్చున్న వెళ్లప్పన్‌కి మతి పోయింది. తన భార్య పొన్నిని హత్య చేశాడన్న నేరంమీద పోలీసులు అతన్ని అరెస్టుచేసి కోర్టులో హాజరుపరచారు. పబ్లిక్ ప్రాసిక్యూటర్ ఏకధాటిగా మాటాడుతోన్న ఒక్క ఇంగ్లీషు ముక్క అతనికి అర్థం గాలేదు. ఆ భాషే అతనికి రాదు.

ఒక్క ఇంగ్లీషు భాషేకాదు, అసలు ఆ వాతావరణమే అతనికి కొత్తగా ఉంది. నల్లకోటు వేసుకుని కోర్టులో అటు ఇటు తచ్చాడుతున్న లాయర్లు, ఖాకీ యూనిఫారాలు తొడుక్కుని తన చుట్టూ వున్న పోలీసులు, బెంచీలమీద కూచుని తన్ని అదోలా చూస్తున్న ప్రేక్షకులు—అంతా అయోమయంగా ఉందతనికి.కాని అతన్ని వరించబోయే మృత్యు దేవత నీలినీడలు మాత్రం అతని మొహమ్మీద అప్పుడే తాండవం చేస్తున్నాయి. పట్టరాని ఆవేశంతో, కన్నుమిన్ను గానక తనాపని చేసేటప్పుడు ఇలా కోర్టులో ముద్దాయిగా

నల్పుంటానని కలలో కూడా అనుకో లేదతను.

వెళ్ళప్పన్ అయిదేళ్ళ కుర్రాడప్పటి నుంచీ కనపడిన గోడమీదల్లా చేతికందిన బొగ్గుముక్కతో పక్షులు, జంతువులు, దేవాలయాలు–ఒకటేమిటి? ఏది వెయ్యా



లనుకుంటే ఆ బొమ్మను వేసేవాడు. కుట్టియూర్ హైస్కూల్లో డ్రాయింగు మాస్టారుగా పనిచేసే అతని తండ్రి, తన తనయుడి కళానైపుణ్యానికి మురిసిపోయి అతనింకా మంచి బొమ్మలు వేసేందుకు ప్రోత్సహించేవాడు. ఈ ప్రోత్సాహంతో వెళ్ళప్పన్ మంచి చిత్రకారుడయ్యాడు. కుట్టియూర్‌స్కూల్లోనే తన తండ్రి తర్వాత డ్రాయింగు మాస్టరయ్యాడు. ఆ తర్వాత తన దూరపు బంధువులమ్మాయి పొన్నిని పెళ్లాడాడు. శోభనం నాటి రాత్రి ఒణుకు తూన్న వేళ్ళతో పొన్ని దుస్తుల్ని విప్ప దీసేప్పుడు వెళ్ళప్పన్‌కు అంతులేని ఆనందమయింది. పొన్ని అందం అలాటిది!

వెళ్ళప్పన్‌నేగాక కుట్టియూర్‌లోనూ, ఆ పరిసర గ్రామాలలోని పురుషులందర్నీ ఆకర్షించింది పొన్ని. బంగారు ఛాయలీనే ఆమె శరీరం సన్నగా, పొడుగ్గా వుండి అందంగా వుండేది. తడిపెదాలు, చిన్నగా ఉండి ఎత్తుగాఉన్న ఆమె పక్షాలు పురుష ల్లోని కామప్రకోపాల్ని ప్రేరేపించేవి. పట్టుకుచ్చులా మెత్తగా ఉన్న నల్లని కురులు ఆమె పిరుదులు దాటిపొయ్యేంత పొడుగ్గా వుండేవి! ఈ కురులు ఆమె మొహంచుట్టూ కప్పుకున్నప్పుడు ఆ మొహం చంద్ర బింబంలా కనిపించేది!

కుట్టియూర్, ఆ పరిసర ప్రాంతాల్లో ఏ ఇద్దరు మగాళ్లు కలుసుకున్నా వారి సంభాషణల్లో పొన్ని అందం శృంగార నైషధాల్ని సృష్టించేది. ఏ ఇద్దరాడాళ్ళు కలుసుకున్నా, ఆమె అందం వారి సంభాషణల్లో ఈర్ష్యకు కొత్త అర్థాల్ని వినిపించేది. పొన్ని అలా నాలుగడుగులు వీధిలోకి వెళ్లాస్తే ఓ వెయ్యి మగకళ్లు ఆకలితో ఆమెవైపు చూసేవి. ఇలాటి ఆకలి చూపులకి తన భార్య గురికావటం వెళ్ళప్పన్‌కి ఏమాత్రం ఇష్టముండేదికాదు.

తమ పెళ్ళయిన కొత్తలో పొన్నిని వెంటేసుకుని గర్వంగా తన స్నేహితులు, బంధువుల ఇళ్ళకూ, తమిళ సినిమాలకూ వెళ్లొచ్చేవాడు వెళ్ళప్పన్. ఒక్కో రాత్రి తన ఇంటి నేలమీదున్న గారమీద పొన్ని బొమ్మను అనేకానేక భంగిమల్లో చిత్రించి మురిసిపోతూ గంటలకొద్ది కాలం గడిపే వాడు. అప్పుడు పొన్ని సిగ్గుపడిపొయ్యేది. అలాంటి ఆ అందమే ఇప్పుడు వెళ్ళప్పన్‌కు కంటకప్రాయమై కూచుంది. ఇప్పుడు తనముందు పొన్ని అందాన్ని వృద్ధులు పొగిడినా భరింపలేకపోతున్నా డతను!

ఒకసారి ఈ దంపతులిద్దరూ పొరుగూరున వున్న తమ బంధువులింటికి పెళ్లికని వెళితే, తాము ఎరుగున్న ఓ

అమ్మాయి వెళ్ళప్పన్ ముందు పొన్ని అందాన్ని తెగపొగిడింది. చిర్రెత్తిన వెళ్ళప్పన్ ఆ అమ్మాయి రెండు చెంపలూ వాయించాడు. ఏడుస్తూ పరుగెత్తిపోయిందా అమ్మాయి. ఇలాంటి సంఘటనలు తరుచు జరగటంతో తనతో పొన్నిని తీసుకెళ్లటం మానేశాడు వెళ్ళప్పన్. బితుకు బితుకు మంటూ ఒంటరిగా ఇంట్లో పడుండేది పొన్ని. నలుగురిముందు దర్జాగా భర్తతో కలిసి తిరగాలనుకునే పొన్నికి ఇలా ఇంటి దగ్గర ఒంటరిగా ఉండటం కష్టమనిపించింది. ఈ మాటే భర్తతో అంటే, అతను రెచ్చిపోయి ఆమెను తెగబాదేవాడు. ఈ విషయం పొరిగింటి అమ్మలక్కలు ఒకరి చెవులొకరు కొరుక్కునే బహిరంగ రహస్యమైపోయింది.

ఒకరోజు వెళ్ళప్పన్ స్కూలునుంచి తిరిగొస్తుంటే దారిలో ఓ పాడుపడిన ఇంటిగోడమీద చిత్రమైన ఓ చిత్రం అతని కంట పడింది. కటకటాల వెనక వున్న ఓ అందమైన అమ్మాయికి ఒంటి మీద ఏ ఆచ్ఛాదనాలేదు. ఆమె తన పొడుగాటి తల వెంట్రుకల్తో ఒళ్ళంతా కప్పుకుని సిగ్గుతో ముడుచుకుపోయి దీనంగా బయటకి చూస్తోంది. ఆమె పక్కన చేతిలో కత్తులు, కటార్లు లాఠీలు పట్టుకున్న ఓ పురుషుడు నుల్చున్నాడు. అతనికీ, వెళ్ళప్పన్‌కీ పోలికలున్నాయి! ఆ చిత్రాన్ని చూసి ఒళ్లు తెలియని కోపంతో ఇంటికొచ్చిన వెళ్ళప్పన్‌కు తల దువ్వుకుంటున్న పొన్ని కనిపించింది. చాపమీద కూర్చుని తన వెంట్రుకలని కుచ్చులా ఒక చేత్తో పట్టుకుని ఇంకో చేత్తో చెక్క దువ్వెనతో తాపీగా తల దువ్వుకుంటోన్న పొన్నిని చూడగానే వెళ్ళప్పన్‌కి అగ్నిలో ఆజ్యం పోసినంత కోపమొచ్చింది. మూలవున్న కొడవలిని పొరకబుచ్చుకుని ఆమె అందమైన నీలాల్ని నిర్దాక్షిణ్యంగా కోసేశాడు. తను ప్రాణప్రదంగా పెంచుకున్న నీలాల్ని కత్తిరించవద్దని ఎంత మొత్తుకున్నా వెళ్ళప్పన్ వినిపించుకోలేదు. ఆమె గుండెలు బాదుకుని ఏడ్చింది. వారంరోజులు అన్నం ముట్టలేదు. భర్తని కన్నెత్తి చూడలేదు. అతని పంచన చేరలేదు.

అప్పటినుంచీ తను బయటకెళ్ళేప్పుడు పొన్నిని ఇంట్లోనే వుంచేసి బయటతాళం వేసి వెళ్లేవాడు వెళ్ళప్పన్. తను ఇంట్లో ఉండే సమయాల్లో ఆమెను తెగతిట్టి బాదేవాడు. ఎందుకో తెలీని కసిని ఆమె మీద ఇలా తీర్చుకునేవాడు. పాపం పొన్ని వాటన్నిట్నీ మౌనంగా భరించింది. కాని అతని మీద తనకున్న కసిని మౌనంగానే తీర్చుకుంది. నలుగురు ఆడపిల్లలున్న నలభై ఏళ్ళ పొరుగింటాయన్ని ప్రియుణిగా చేరదీసి అతనితో ప్రేమకలాపాల్ని సాగించింది. తన కామవాంఛల్ని తీర్చుకుంది!

వెళ్ళప్పన్ కొకరోజు స్కూల్లోనే అతిగా కడుపు నొయ్యటంతో ఇంటికి పరుగెత్తుకొచ్చాడు. ఇంట్లో అడుగు పెడుతూన్న అతనికి తమ ఇంటి వెనకభాగాన ఉన్న చీకటి కొట్లోంచి నవ్వులు, మాటలు, మూలుగులు వినిపించాయి. అటువెళ్ళి చూస్తే ఇంకేముంది! పొరుగింటాయన కౌగిట్లో పొన్ని కరిగిపోతోంది! అంతే వెళ్ళప్పన్ ఒక్క ఉదుటన వంటింట్లోకి పరుగెత్తి అక్కడున్న మాంసంకోసే కత్తిని చేజిక్కించుకుని వచ్చాడు. అప్పటికే పొన్ని ప్రియుడు పరుగెత్తి

పోయ్యాడు! పొన్ని మాత్రం భర్త కోపానికి ఆహుతైపోయింది. పోలీసులు వెళ్ళప్పన్‌ని అరెస్ట్‌చేసి తీసుకెళ్ళారు.

కోర్టులో వెళ్ళప్పన్‌లాయరు పర పురుషుడితో పొన్ని కామకలాపాలు జరుపుతుండటం కళ్ళారా చూడటంవల్ల వెళ్ళప్పన్ ఆకస్మిక తీవ్రప్రకోపానికి గురి అయ్యాడనీ, అందువల్ల విచక్షణా జ్ఞానం కోల్పోయి, ఆ పరిస్థితుల్లో ఏభర్త అయినా చేసేపనినే ఇతనూ చేశాడనీ, అందుకు వెళ్ళప్పన్ క్షమార్హుడనీ వాదించాడు. కోర్టువారు ఈ వాదనని కొంత వరకు అంగీకరించి వెళ్లప్పన్‌కు అయిదేళ్ళ శిక్ష విధించారు. వెళ్లప్పన్ అప్పీలు చేసుకున్నా హైకోర్టు ఈ శిక్షనే ధృవపరిచింది. *

# మితిమీరిన ప్రేమ

నెల్లూరుకు దగ్గరలో ఎద్దుపల్లి అనే ఊరుంది.

అందులో బాషా అనే ఓ చిన్న సైజు వ్యాపారస్థుడు వుండేవాడు.

చుట్టూ విశాలమైన పంటపొలాలు, నిరంతరం ప్రవహించే ఓ పేరు తెలియని నది,గుబురుగా దట్టంగా పెరిగిన పొదలు, ఆకుపచ్చని ముఖమల్ గుడ్డ వేసి కుట్టిన పరుపుల వంటి విశాలమైన పచ్చిక బయళ్లు– ఎద్దుపల్లి,దాని పరిసరాలు ఎంతో అందంగా వుండేవి.

బాషా చేసే వ్యాపారాలేమిటో ఎవరికీ తెలీదు. అయినా ఎప్పుడూ కేంపులని తిరుగుతూ వుంటాడు.

ఎక్కువగా పచ్చిక బయళ్లలోనూ, అడవి మొక్కల పొదలలోనూ,నదీతీరాన వుండే విశాలమైన చింతతోపుల్లోనూ అతను ఎప్పుడూ కనబడుతూ వుంటాడు.

అయితే ఎప్పుడూ ఒంటరిగా మాత్రం కనబడడు.

ఎవరో ఒక యువ్వనవతి ఎప్పుడూ అతనితో వుంటూంటుంది. ప్రకృతిలో ప్రకృతి సిద్ధమైన కోర్కెల్ని, ప్రకృతికి ఆకృతిగా నిలిచే రమణీయమైన జానపద రమణీమణుల శారీరక సౌందర్యం ఆరాధిస్తూ,ఆస్వాదిస్తూ, అనుభవిస్తూ అతను కాలానికి గాలం వేస్తూంటాడు.

అతని చంచలతత్వానికీ,స్త్రీలోలతకూ విసిగిపోయి ఏం చెయ్యాలో తోచక అతని భార్య హసీనాబి అతణ్ణి వదిలేసింది.

విధివశాన విధవలైన వాళ్లు,భర్తలున్నా శారీరక సుఖాల శిఖరాలు చేరనివారు, బహురుచులకై అన్వేషించేవారు – ఇలా చాలామంది స్త్రీలు అతనికై వచ్చేవారు.

అందరికీ న్యాయం చేకూర్చి పెద్ద హీరో అయిపోయాడు బాషా.

బాషాను ఎంతగానో ప్రేమిస్తూ, మనసా వాచా కర్మణా అతనినే స్మరించి వరించే స్త్రీ ఒకతె వుంది. ఆమె పేరు పేరమ్మ.

బాషాను ఎప్పుడైతే హసీనాబీ వదిలేసి పోయిందని ఖచ్చితంగా తెలుసుకుందో, అప్పుడే పేరమ్మ అతని సరసన చేరి, అతణ్ణి కొంగున ముడేసుకుని అతని మకాం తనింటికి మార్పించేసింది.

బాషా తెలివితక్కువవాడేం కాదు.

ఎంత స్త్రీలోలుడైనా తనని హమేషా కనిపెట్టుకుని వుండే స్త్రీ ఒకతె వుండడం ఎంతేనా అవసరమనే జీవితసత్యం ఎరిగిన వాడు. కాబట్టి ఇంట్లో వుండేంత సేపూ పేరమ్మకు స్వర్గసౌఖ్యాలు రుచిచూపిస్తూ,

పైన మాత్రం విశృంఖలంగా విజృంభించే వాడు. ఆ విషయాలు పేరమ్మకు తెలీ కుండా ఎన్నో జాగ్రత్తలు తీసుకునే వాడు.

పేరమ్మ తన ప్రియుడి లీలల గురించి విన్నప్పుడల్లా అతనిని నిలదీసి అడిగేది. బాషా నిర్లక్ష్యంగా వున్నాడని భావిస్తే, స్వచ్ఛమైన తెలుగులో రెండక్షరాల బూతుల్ని తిట్టింది.

అయినా బాషా తన ప్రతాపాన్ని చూపడం మానలేదు.





బాషాను ఎలాగేనా కొంగున కట్టేసు కోవాలనీ, అతడిని తన విధేయుడిగా చెయ్యాలనీ, దానికి తాను ఎలాంటిపని చెయ్యడానికైనా సిద్ధంగా వున్ననని- పేరమ్మ తన స్నేహితురాళ్లతో అంటూండేది.

"భర్తనిగాని, ప్రేమించిన వ్యక్తిని గాని వశం చేసుకోవడానికి వశీకరణ విద్యలని వుంటాయి. మందుపెట్టి కూడా మనుషుల్ని మనవేపు తిప్పుకో వచ్చు. దానికి ఎన్నో మార్గాలుంటాయి" అని ఇరుగమ్మా,పొరుగమ్మా కర్తవ్య ప్రబోధం చేశారు.

అసలె బాషా పిచ్చిలో వున్న పేరమ్మ ఎలాగైనా అతనిని తన వాడినిగా చేసు కుందామని నిశ్చయించుకుంది.

* * *

చింత తోపులో పడివున్న ఓ శవాన్ని చూసి ఎవరో నెల్లూరు పోలీసు స్టేషన్‌లో రిపోర్టు చేశారు.

పోలీసులు హడావుడిగా రంగ ప్రవేశం చేసి, శవాన్ని స్వాధీనం చేసుకున్నారు. నెల్లూరు పోలీసు అధికారులే కాదు, ఆ చుట్టుపక్కల ప్రాంతమంతా ఆశ్చర్య పోయింది ఆ శవాన్ని చూసి.

అది బాషా శవం.

అతని శరీరం మీద ఎలాంటి కత్తి పోట్లుగాని, తుపాకీ తూట్లుగాని, గాయాలుగాని, కాలిన గుర్తులు గాని, పీక నులిమి చంపిన గుర్తులుగాని-ఏమీ లేవు.

అయితే బాషా ఎలా చచ్చిపోయాడు? అది హత్యా? ఆత్మహత్యా?- అంతా ఆశ్చర్యపోయారు.

అతని శవానికి దగ్గరగా కొంతవమనం చేసుకున్న చిహ్నం కనిపించింది. ఆ వమనం లో రక్తపు జీర కూడా కని పించింది. శవాన్ని దగ్గరగా పరిశీలిస్తే,

ముక్కులోంచి కూడా కాస్త రక్తం స్రవించిన చిహ్నం కనిపించింది. ఆ రక్తం మరకలు కట్టింది.

శవాన్ని పోస్టుమార్టమ్‌కి పంపించారు. రిపోర్టులో అతను నల్లమందు, జిల్లేడు పాలు, పువ్వులు, కాయలు కలిపిన ఆహారం తిన్న కారణంగా మరణించినట్లు స్పష్టమైంది.

ఇది మరీ ఆశ్చర్యహేతువైంది పోలీసు అధికారులకు. దక్షిణ నాయకుడుగా ప్రసిద్ధి చెందిన బాషా తనకి తానుగా ఆత్మహత్య చేసుకుంటాడా?

ఇది హత్యే అయితే ఇలాంటి హత్యలు పురుషులు చెయ్యరు.

అతని కాముకత్వ కారణంగా ఎక్కువగా అతనికి పురుష విరోధులు వుండడానికి అవకాశం వుందిగానీ, స్త్రీ శత్రువులకు అవకాశం లేదు.

అయితే అసూయాగ్రస్తురాలైన స్త్రీ కూడా ఇలాంటి హత్యచేసే అవకాశం లేకపోలేదు.

మరి ఆ స్త్రీ ఎవరై వుంటారు?

అతని భార్య హసీనాబీనా? ప్రేయసి పేరమ్మా? లేక అతని అసంఖ్యాక ప్రేయసీమణులలో ఎవతో ఒకతా?

భార్య హసీనాబీకి, బాషాకు ఏనాడో సంబంధాలు తెగిపోయాయి. ఇకపోతే ముఖ్య ప్రేయసి పేరమ్మ!

పోలీసుల దృష్టి పేరమ్మ మీద పడింది.

ఆమె లబోదిబోమంటూ తానొక పాపిష్టిదానననీ, తన పాపానికి నిష్కృతి లేదనీ, చేజేతులా తన ప్రియుడిని తానే చంపేసానని స్వచ్ఛందంగా అంగీకరించింది.

"బాషా అంటే నాకు వల్లమాలిన ప్రేమ. అదో రకం మైకం, పిచ్చిని. అయితే బాషాకి రోజుకోరుచి కావాలి. అది నేను భరించలేను. అతను నాకు మాత్రమే పరిమితం కావాలి. మరో ఆడదాని గురించి అతగాడు ఆలోచించకూడదు. ఏం చెయ్యాలో తోచలేదు. నా స్నేహితురాళ్లతో నా బాధ చెప్పాను. తలోరూ, తలోసలహా చెప్పారు... బల్లి చర్మం నుంచి తీసిన నూనెతో చేసిన వంటకం తినిపిస్తే, అతను మనసు మార్చుకుని నన్నే అంటి పెట్టుకుంటాడని; కోతివృషణాలను లేత కల్లులో నానబెట్టి, దానిని ఊరగాయగా చేసి తినిపిస్తే బాషా నా వశం అయిపోతాడని; జిల్లేడు పూలు, ఆకులు, కాయలు వీటిని నల్లమందులో కలిపి నూరి అది అన్నంలో కలిపి పెడితే, అతనికి ఇక నా ధ్యాసే తప్ప మరో ఆలోచన వుండదని—ఇలా చాలా సలహాలు చెప్పారు.

"అయితే బల్లి చర్మపు నూనె, కోతి వృషణాల ఆవకాయ ఇవేవీ నాకు అందుబాటులో లేవు. జిల్లేడు మొక్కలు ఎక్కడ పడితే అక్కడ దొరుకుతాయి. అంచేత నల్లమందు కొని, ఆ ప్రయోగం చేశాను. అతనికి అనుమానం కలగకుండా ఇతర సుగంధ ద్రవ్యాలు కూడా చేర్చి, అతి రుచికరంగా వంటకం తయారు చేసి అతనికి పెట్టాను.

"అది తిన్నాక అతను నిద్రపోతాడని, నిద్రలేచాక ఇక అతనికి నా ధ్యాసే తప్ప మరో ఆలోచన వుండదని భ్రమపడ్డాను.

"అతను మరి లేవనే లేవని పెద్ద నిద్రలోకి వెళ్లిపోయాడు దేవుడోయ్....నా రాజుని నేనే చంపేసుకున్నా నాయనోయ్......" అంటూ బావురుమంది పేరమ్మ.

కోర్టులో కేసు నడిచింది.

పేరమ్మ తరఫున న్యాయవాది– ఆమె హంతకురాలు కాదని, బాషాను హత్య చెయ్యడం ఆమె ఉద్దేశం కాదని, స్త్రీసహజమైన ప్రేమతో అతడిని తనకు మాత్రమే పరిమితం చేసుకుందామనేదే ఆమె ముఖ్యోద్దేశమని, ప్రేమ గుడ్డిది మాత్రమేకాదు–పిచ్చిది కూడా అని, అంచేత ఆమె ఇతరుల మాటలు నమ్మి అతనిపై ప్రయోగం చేసిందని,ఇది ఇచ్ఛాపూర్వక హత్యకాదని గట్టిగా వాదించాడు.

నెల్లూరు జిల్లా జడ్జి ఆమె హంతకురాలు కాదని తీర్పు ఇచ్చారు. *

# అద్దం చెప్పిన కథ

ఎర్రని మంగుళూర్ పెంకులతో ప్రస్ఫుటంగా కనిపించే ఆ మేడమీది గదిలో సుమన్‌బాయి నల్లని కడపరాళ్ల అమర్చిన నేలమీద విశ్రాంతి తీసుకుంటోంది.

ఆ ఇల్లు సముద్రానికి దగ్గరగా వుండడంవల్ల చల్లని గాలులు రివ్వున వీస్తున్నాయి. సముద్రపు హోరు నిర్విరామంగా వినిపిస్తోంది.

వీచే చల్లనిగాలి కలిగించే ఆహ్లాదం ఆమెకు ఆనందం కలిగించడంలేదు. సముద్రపు హోరు ఆమె చెవులకు సోకటం లేదు. ఆమె మరణించి వుంది. అది సహజ మరణం కాదు. హత్య!

ఆమె వేసుకున్న ఎర్రని జాకెట్టుగాని, నీలరి చీరగాని, అదే రంగు పరికిణీగాని– వుండవలసిన స్థానాల్లో లేవు. అనాచ్ఛాదితంగా వున్న ఆమె రొమ్ములమీద, తొడలమీద నఖచ్ఛాతాలు, దంతక్షతాలు ప్రస్ఫుటంగా కనిపిస్తున్నాయి. ఎర్రని రక్తపు డాగులు ఆమె బట్టలమీద, శరీరం మీద దర్శనమిస్తున్నాయి.

డ్రెస్సింగ్ టేబిల్‌మీది పెద్ద అద్దం తునాతునకలైపోయింది. ముక్కలన్నీ గదంతా చిందరవందరగా పడివున్నాయి.

రూపురేఖలను చూపించే ఆ అద్దం సుమన్‌బాయి శరీరాన్ని రూపురేఖలు లేకుండా ఛిద్రం చేసింది. విరిగిన అద్దం ముక్కలమీద రక్తపు డాగులు.

ఇంట్లో మరో మానవ సంచారంలేదు.

సరిగ్గా ఆ సమయంలోనే సుమన్‌బాయి స్నేహితురాలొకామె ఆమెను చూడాలని వచ్చింది. రక్తపు మడుగులో పడివున్న తన స్నేహితురాలి మృత శరీరాన్ని చూసి ఆమె నిశ్చేష్టురాలై ఒక్కఉదుటున బయటకు పరిగెత్తి పోలీసులకు ఫోన్ చేసింది.

దక్షిణ కర్నాటకకు చెందిన సూరత్‌కల్ పోలీసులు రంగంలోకి ప్రవేశించారు.

పగిలిన అద్దం ముక్కలతో, తన స్వంత ఇంట్లో బెడ్‌రూంలో ఘోరంగా హత్యచేయబడ్డ సుమన్‌బాయి మృత శరీరాన్ని, గదిలో ఇతర దృశ్యాల్ని రకరకాల కోణాలనుంచి ఫొటోలు తీశారు.

హత్యకుముందు ఆమె భయంకరంగా రేప్ చెయ్యబడినట్టు, మానరక్షణకు ఆమె హంతకుడితో తీవ్రంగా పోరాడినట్టు పోస్టుమార్టం రిపోర్టు ద్వారా తేలింది.

ఆమెను రేప్‌చేసి, దారుణంగా హత్యచేసిన వ్యక్తి చాలా బలిష్ఠుడై వుంటాడని కూడా పోస్టుమార్టం చేసిన వైద్యులు, పోలీసు అధికారులు అభిప్రాయపడ్డారు.

అయితే రేప్‌కు ముందుగా సుమన్‌బాయి హంతకుడితో తీవ్రపోరాటం జరిపి

వుంటే, ఆ హంతకుడికి కూడా శరీరం మీద కొద్దో గొప్పో గాయాలు తగిలి వుండాలని, పగిలిన అద్దం ముక్కలమీద హంతకుడి వేలిముద్రలు వుండి తీరాలని పోలీసులు భావించారు.

సుమన్ భర్త మంజునాథ్ మంగళూర్‌లో ఓ ప్రైవేటు సంస్థలో సేల్స్‌మన్. అతనికి మోటారు సైకిలు వుంది. ఎప్పుడూ వ్యాపారాభివృద్ధికోసం తిరుగుతూనే వుంటాడు.

హత్యా సమయానికి అతను తీర ప్రాంతమైన ఉత్తరకొంకణ్‌కు దగ్గరగా వున్న వ్యాపారకూడలి 'కిమ్‌టా' అనే చోట వున్నాడు.

ఆ దంపతులకు సంతానంలేదు. మంజునాథ్ సదా కేంపులు తిరుగుతూంటే, ఊసుపోకకు సుమన్‌బాయి ధనవంతుల ఆడపిల్లలకు నృత్యం నేర్పిస్తూంటుంది. సుమన్‌బాయి ఎంతో ఆరోగ్యంగా, ఆకర్షణీయంగా, చురుగ్గా వుంటుంది.

ఆ హత్య పోలీసుశాఖలో తీవ్ర సంచలనాన్ని కలుగజేసింది. అధికారులంతా బుర్రకు పదును పెట్టి రకరకాలుగా ఆలోచించసాగేరు.

హంతకుడు తలుపులు బద్దలుకొట్టో, కిటికీ ఊచలువంచో బలవంతంగా ఇంట్లో ప్రవేశించలేదు. అంటే సుమన్ అనుమతితోనే అతను ఆ మేడమీది భాగానికి వచ్చాడన్న మాట.



అలా ఆమె అనుమతితో గృహ ప్రవేశం చేసిన వ్యక్తి తప్పనిసరిగా ఆమెకు తెలిసినవాడే అయివుంటాడు.

హంతకుడి వేలిముద్రల కోసం హత్య జరిగిన చోట గాలించారు. ఎన్నో వేలిముద్రలు దొరికాయిగానీ, ఏవీ స్పష్టంగా లేవు. పగిలిన అద్దం ముక్కలమీదకూడా వేలిముద్రల కోసం తీవ్రంగా పరిశీలిస్తే ఒకే ఒక చిన్న అద్దం ముక్కమీద స్పష్టంగా ఓ చూపుడువేలు ముద్ర కనిపించింది.

పరిశీలనానంతరం - నిస్సందేహంగా అది ఒక పురుషుడిదనీ, ఆ పురుషుడే హంతకుడై వుండాలనీ నిర్ణయించారు పోలీసులు.

ఆ చిన్న అద్దం ముక్క శవానికి దూరంగా బయటకుపోయే గుమ్మంముందు పడివుంది.

దానిని జాగ్రత్తగా తీసి పరిశీలనకు పంపించారు.

పోలీసు ఉన్నతాధికారులు శవానికి సంబంధించిన వస్తువుల్ని పరిశీలిస్తూండగా సుమన్‌బాయి శరీరం మీద వక్షోజాలను బహిర్గతం చేస్తూ విప్పబడివున్న జాకెట్టు,

అస్తవ్యస్తంగా వున్న చీర, లోపరికిణీ మాత్రమే వుండడం వారికి ఎంతో ఆశ్చర్యం కలిగించింది.

వయసులో వున్నదీ, ఉన్నత కుటుంబానికి చెందినదీ అయిన సుమన్‌బాయి తప్పనిసరిగా బ్రా వేసుకుంటుంది. మరి అది ఏమైనట్టు?

హంతకుడు దానిని తనతో తీసుకు వెళ్లాడా? లేక ఆ ఇంట్లోనే ఎక్కడో దాచేశాడా?

బ్రా కోసం గాలించారు గానీ దొరకలేదు.

మద్రాసులో వుండే ఫోరెన్సిక్ నిపుణిడికి హత్యా ప్రాంతంలో దొరికిన రక్తపు మరకలతో కూడిన అద్దపు ముక్కల్ని, ఆమె ధరించిన బట్టల్ని పరిశోధనకై పంపించారు పోలీసులు.

ఆ రోజుల్లో కర్నాటక ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో వుండేది.

కొద్దిరోజుల తర్వాత వచ్చిన రిపోర్టు ఎంతో ఆసక్తిని కలిగించింది. గుమ్మానికి దగ్గరగా పడివున్న అద్దం ముక్కమీద వున్న రక్తానికీ, మిగిలిన అద్దం ముక్కల మీద వున్న రక్తానికి తేడా వుందనీ, మిగిలిన అన్ని ముక్కలమీద వున్న రక్తం బహుశ సుమన్‌బాయిది అయి వుండాలనీ రిపోర్టులో వుంది.

అంతేకాదు సుమన్‌బాయి వేసుకున్న జాకెట్టు సరికొత్తదనీ, అదింకా నీటిలో ఒక్కసారి కూడా తడపబడలేదని-రిపోర్టు చెబుతోంది.

హంతకుడు తన గదిలోకి వచ్చే సమయానికి సుమన్‌బాయి కొత్త జాకెట్టు వేసుకుంటున్నదా? ఆ సమయానికి ఆమె కొత్త జాకెట్టు వేసుకోవలసిన అవసరం ఏముంది?

ఆ వచ్చిన వ్యక్తి టైలర్ అయి వుంటాడా? అతను ఈ కొత్త జాకెట్టు తేగా ఆమె సరిగా వుందో లేదో చూసుకుంటోందా?

ఈ ఆలోచన సహజంగానే తోచి ఆమె టైలర్ ఎవరై వుంటారని వాకబు చేశారు.

చివరకు సూరత్‌కల్‌లో 'బలియప్ప' అనే దర్జీ మంచి పనివాడనీ, అతను ఆడవాళ్ల జాకెట్లు కుట్టడంలో చాలా ప్రసిద్ధుడనీ, అందుకే అతన్ని అంతా 'జాకెట్ బలియప్ప' అని పిలుస్తుంటారనీ తెలిసింది.

అంతేకాదు, అతను స్త్రీలోలుడనీ, తాగుడు, వ్యభిచారం అతనికి ఊపిరి అనీ కూడా తెలిసింది.

సుమన్‌బాయి ఇంటి టైలర్ కూడా అతనే అని నిర్ధారణ అయ్యాక అతని కోసం వెళ్లారు పోలీసులు.

అతను దొరకలేదు. గ్రామాంతరం వెళ్లాడని తేలింది. పోలీసులకు అనుమానం ఎక్కువై అతని గురించి తీవ్రంగా అన్వేషించారు.

చివరకు తీరప్రాంతమైన ఉడిపికి దగ్గరగా వుండే మాల్పే అనే గ్రామంలో అతను ఓ మత్స్యగంధి ఇంట్లో పట్టుబడ్డాడు.

ముందు దబాయించినా, ఆ ఇంట్లో ఒక బ్రా దొరకడంతో, తన కథ చివరి దశకు చేరుకుందని గ్రహించి లొంగిపోయాడు బలియప్ప.

ఆ బ్రా తన భార్యదేనని నిర్ధారించాడు సుమన్‌బాయి భర్త మంజునాథ్.

"నిజమే. ఆమెను చూసినప్పుడల్లా నాలో కోర్కె రగిలేది. ఆమెను ఎలా

గేనా అనుభవించాలనే తపన నాలో దినదినాభివృద్ధి చెందింది. ఆనాడు కుట్టిన కొత్త జాకెట్ తీసుకుని సుమన్‌బాయి ఇంటికి వెళ్లాను. ఇంట్లో ఎవరూ లేరని తెలుసుకుని, ఆ అవకాశం జారవిడుచుకోకూడదని నిశ్చయించుకున్నాను. ఆమె నన్ను ముందు గదిలో వుండమని తను డ్రాయింగ్ రూంలోకి వెళ్లింది. ఆమె వెనకే పిల్లిలా మెల్లిగా వెళ్లాను.

అద్దం ముందు తను వేసుకున్న జాకెట్టు విప్పేసి, నేను తీసుకెళ్లిన జాకెట్టు వేసుకుంటోంది ఆమె.

బ్రాలో బంధింపబడిన ఆమె అందాన్ని చూడగానే నాలో కోర్కె బుసలు కొట్టింది. వెంటనే లోపలికి ప్రవేశించి ఆమెను బలాత్కరించాను. ఆమె తీవ్రంగా ప్రతిఘటించింది. ఎదురుగా వున్న నిలువుటద్దం తీసి బలంగా నా మీదకు విసిరింది. అది విరిగి ముక్కముక్కలై పోయింది. ఆమె రెచ్చిపోతున్నకొద్దీ నాలో కోర్కె హెచ్చిపోసాగింది. చివరకు ఆమెను లోబరచుకుని తృప్తి చెందాను. అయితే ఆమెను అలా వదిలేస్తే నా ప్రాణాలకే ముప్పు అని పగిలిన అద్దం ముక్కలతో ఆమెను గాయపరచి హత్య చేశాను.

నా శరీరంమీద తుళ్లిన రక్తాన్ని తుడుచుకోవడానికి ఆమె బ్రా ఉపయోగించాను. దాన్ని నాతోనే తీసుకెళ్లాను.

"గది గుమ్మం దాటుతూంటే ఓ చిన్న అద్దంముక్క నా కాలికి గుచ్చుకుంది. నా కాలికి గాయమైంది. కోపంగా దాన్ని తీసిపారేశాను..." వివరించాడు బలియప్ప.

సావధానంగా విన్న న్యాయాధిపతులు 'బట్టల్ని కత్తిరించేంత సులభంగానూ కుత్తుకలను కూడా కత్తిరించగల టైలర్‌లు వుంటారు. బహుపరాక్. ఒంటరిగా వుండేటప్పుడు టైలర్లు వస్తే తగు జాగ్రత్తగా వుండాలి స్త్రీలు'-అని తమ అభిప్రాయం వ్యక్తంచేసి బలియప్పకు మరణదండన విధించారు.

కొద్దిరోజుల తర్వాత బలియప్ప ఉరి తీయబడ్డాడు. *

# ఉత్తర సాక్ష్యం

అమృత్‌సర్‌కు దగ్గరగా వున్న గ్రామం అది. అప్పటికింకా ఆ గ్రామం పంజాబ్‌లోనే వుండేది.

అందులో దూరంగా ఓ పురాతనమైన ఇల్లు.

ఇంటి కప్పుమీద పెంకులన్నీ పగిలిపోయి, పెంకుల మధ్య పిట్టలు పడేసిన విత్తనాలు మొక్కలుగా పెరిగిపోయి, గోడలకు పెచ్చులు వూడిపోయి...ఇల్లు చూడగానే - ఏ ఆలనా పాలనా లేని ఇల్లు అని ఎవరికేనా అనిపిస్తుంది.

ఆ ఇంట్లో మధ్యహాల్లో విశాల్ భటిండా నిశ్శబ్దంగా కళ్ళింతింత చేసుకుని చూస్తున్నాడు. అతని నుండి ప్రాణవాయువుల్ని లాగేసుకున్న ఓ లావుపాటి తాడు అతని పీకకూ, తుప్పుపట్టిన ఇంటి ఇనుప దూలానికి సంధానకర్తలా నిలుచుని ఉంది.

ఆ ఇంట్లో ఆ సమయంలో మరో మనిషి లేడు.

కొద్దిసేపటికి పాలుపోసే ఆసామి వచ్చి తలుపు తట్టాడు. అవి వాటంతటవే తెరుచుకున్నాయి.

ఎదురుగా దూలానికి వేలాడుతున్న విశాల్ శవం చూడగానే అతని చేతిలో



పాలడబ్బా కాస్తా జారిపోయింది. భయంకరంగా కేకేశాడు. అతని ఆ కేకకి ఇరుగు పొరుగులు, కాలకృత్యాలకై వెళ్తున్న వాళ్లు, దంతధావనం చేసుకుంటున్న వాళ్లు–ఇలా చాలా మంది పోగయ్యారు.

ఆ దృశ్యాన్ని చూసి అంతా అప్రతిభులై, నిర్విణ్ణులై పోయారు.

'ఇంతకీ విశాల్ భార్య ప్రమీల ఏమైందీ?'–అన్నారెవరో.

'నిన్న సాయంత్రం అమృత్‌సర్ బస్టాండ్‌లో చూశాను ఆమెను. ఊరుగాని వెళ్లిందేమో–' అన్నారు మరెవరో.

'అనారోగ్యంతో బాధపడుతున్న తనని వదలి, భార్య వెళ్ళిపోయిందనే షాక్‌లో విశాల్ ఆత్మహత్య చేసుకున్నాడు కాబోలు' అని చాలా మంది అనుకున్నారు.

పోలీసు అధికారులు వచ్చి శవాన్ని దించకుండానే కొన్ని ఫొటోలు, దించాక కొన్ని ఫొటోలు తీసి, అక్కడున్న ఓ పాత ఇనుప మంచం మీద శవాన్ని పడుకోబెట్టారు.

విశాల్ శవం జేబులో వాళ్లకి ఒక ఉత్తరం దొరికింది. అది అతను తన అన్నగారైన ప్రవీణ్‌కు రాసింది.

'నా అనారోగ్యాన్ని ఆసరాగా తీసుకుని ప్రమీల నీతిబాహ్యంగా ప్రవర్తిస్తోంది. అది నేను భరించలేను. నాకు చావు తప్ప వేరే గత్యంతరం లేదు...'
ఇలా ఉంది ఆ ఉత్తరంలో.

'నీతి నియమాలు లేని భార్య వుంటే ఇక భర్తకి చావు తప్ప వేరే మార్గం ఏం ఉందిలే?' అని అంతా ప్రమీలను ఆడిపోసుకున్నారు.

అతని అన్న ప్రవీణ్ కూడా అదే ఇంట్లో ఉంటున్నాడు. అయితే ఎప్పుడూ వ్యాపారరీత్యా అమృత్‌సర్ వెళ్లి వస్తూంటాడు. అతను ఇంట్లో ఉండే సమయం చాలా తక్కువ.

అప్పటికి రెండురోజులనుంచీ ప్రవీణ్ ఊళ్ళో లేడు.

పోలీసు అధికారులు శవాన్ని పోస్ట్‌మార్టంకి, ఉత్తరాన్ని వేలిముద్రల నిపుణులకు పంపి, ప్రవీణ్ అన్వేషణలో అమృత్‌సర్ బయలుదేరారు.

అమృత్‌సర్ శివార్లలో ఓ చిన్న ఇంట్లో ఉంటున్నాడు ప్రవీణ్.

ప్రవీణ్ స్ఫురద్రూపి. దట్టమైన మీసం,

నల్లని కనుబొమలు, లావుపాటి పెదాలు, కొనదేలిన ముక్కు, విశాలమైన ఛాతీ- మనిషి మంచి పకడ్బందీగా ఉంటాడు. అదే ఇంట్లో పోలీసులకు మరో స్త్రీ కూడా కనిపించింది.

ఆరోగ్యవంతమైన కళ్లు, ఎర్రని బుగ్గలు, యవ్వనాన్ని తెలియజేస్తూ ఎత్తయిన రొమ్ములు, పెద్ద పిరుదులు - రెండోసారి చూడాలని అనిపించే అందం ఆమెది.

ఆమె గురించి వివరాలు అడగబోగా ఆమె చెప్పింది. "నా పేరు ప్రమీల. నేను విశాల్ భటిండా భార్యను"

"విశాల్ నా తమ్ముడు. ఈమె అతని భార్య. అయితే మేమిద్దరం ప్రేమించుకున్నాం. ఒకర్ని విడిచి ఒకరం వుండలేం. అంచేత ఇద్దరం ఇలావచ్చేశాం ..." అన్నాడు ప్రవీణ్.

పోలీసులు వారి ధైర్యానికి అబ్బురపడ్డారు. జరిగిన ఘోరం వివరించారు, అంతా బయలుదేరారు.

పోస్టుమార్టమ్ రిపోర్టు చూడగానే ఆశ్చర్యచకితులైపోయారు పోలీసు అధికారులు.

'అది ఆత్మహత్యకాదనీ, అసలు సిసలైన హత్య అనీ, హత్యానంతరం అతని శవాన్ని దూలానికి వేలాడదీశారనీ, అతని హత్యకు కొన్ని మూలికలు కారణమనీ' రిపోర్టు చెప్పింది.

ఆ విషమూలికల ఆహారం తిన్నాక అతను స్పృహ తప్పి పడిపోయాడనీ, ఆ స్థితిలోనే అతను ఉరికి తగిలించబడ్డాడనీ కూడా రిపోర్టులో వుంది.

కేసు మరో మలుపు తిరిగినందుకు ఆశ్చర్యపోతూ పోలీసులు ప్రవీణ్, ప్రమీలను అదుపులోకి తీసుకున్నారు.

ప్రవీణ్‌కు సంబంధించిన వస్తువులను పరిశీలించగా విశాల్ అతనికి రాసిన చాలా ఉత్తరాలు బయటపడ్డాయి.

అందులో తన భార్య విశృంఖల విహారాన్ని, తుదిలేని ఆమె పురుషవాంఛనీ వివరిస్తూ, ఈ దుర్భర మానసిక సంఘర్షణ తాను భరించలేనని, ఏ దుర్ముహూర్తంలోనో తాను ఆత్మహత్య చేసుకుంటానని...ఇలా ఎంతో ఆవేదనా భరితంగా వున్నాయి ఆ వుత్తరాలు.

అయితే ఆ ఉత్తరాలలో ఎక్కడా తేదీలులేవు. అలా తేదీలు లేని ఉత్తరాలు చూడగానే పోలీసులకు అనుమానం కలిగింది.

ప్రవీణ్, ప్రమీలలను నిలదీసి అడగ్గా అసలు నిజం బయటపడింది.

ఆ ఉత్తరాలు సృష్టించింది తనేనని, అది చదివాక ఎవరేనా తప్పకుండా అది ఆత్మహత్మ అనే విశ్వసిస్తారని, తాము చక్కగా చట్టానికి ముసుగు వేయగలమని భావించామని, అయితే తేదీలు వెయ్యక పోవడం వల్ల తేలిగ్గా దొరికిపోయామని ఒప్పుకున్నాడు ప్రవీణ్.

విషయ పరిశీలనానంతరం సెషన్స్ జడ్జి వారిద్దరికీ మరణదండన విధించారు.

అయితే ప్రమీల హైకోర్టుకు అప్పీలు చేసుకుంది.

హైకోర్టువారు కేసును పునఃపరిశీలించి ప్రమీలకు శిక్ష తగ్గించి, కేవలం అయిదు సంవత్సరాలు కఠిన కారాగారం విధించారు.

ఏకోదరుడు, రక్తం పంచుకు పుట్టినవాడు, అనారోగ్యవంతుడు అనే భావం కూడా లేకుండా, స్వంత తమ్ముడిని హత్యచేసి, ఆ హత్యను ఆత్మహత్యగా నమ్మించచూసిన నేరాన్ని

మాత్రం హైకోర్టు క్షమించలేకపోయింది.

కొద్దికాలం తర్వాత ప్రవీణ్ మరణ దండన అమలు జరిగింది. *

# లాంతరు

ఓ రోజు రాత్రి గంగులు తన పూరింట్లో భార్య పేరమ్మ అందించే దాంపత్య సుఖాన్ని అనుభవిస్తూంటే వీధి తలుపును ఎవరో దబదబా బాదేరు. ఇంత రాత్రప్పుడు ఎవరాని ఆశ్చర్యపోతూ తలుపు తీసిచూస్తే ఆ వచ్చింది తన యజమాని శేషురెడ్డి పంపిన మనిషి. శేషురెడ్డికి ఉన్న ముప్ఫయి ఆవుల్లో ఒకదానికి అకస్మాత్తుగా ఏదో రోగం రావటంతో అయ్యగారు నిన్ను పిల్చుకురమ్మన్నాడని చెప్పాడామనిషి. సరేనంటూ పశులకొట్టం వైపు బయలుదేరాడు గంగులు.

శేషురెడ్డి తిరుపతి సమీపంలోని బాగాలపల్లి గ్రామంలో ఓ భూస్వామి. గంగులు అతని పెద్ద పాలేరు. రెడ్డిగారికి భూములతోపాటు ముప్ఫయి మేలురకం ఒంగోలు ఆవులుండేవి. రోజూ రెండు పూట్లా ఈ ఆవుల్ని పితికించి, ఏ ఆవు ఎన్ని పాలిచ్చిందీ కొలిచి, వాటి లెక్కలు రాసి పాలతోపాటు ఆ లెక్కపుస్తకాన్ని అన్నపూర్ణమ్మకు ఇవ్వటం గంగులు నిత్యకృత్యం. ఈ ఆవుల పోషణని తన కింద పనిచేసే ఆరుగురి పాలేర్ల సాయంతో చూసుకునేవాడు గంగులు. ఆవుల్ని పాలు పితకటం, వాటికి మేత వేయటం లాంటి పనులు పాలేర్లచేత చేయించినా పాలు కొలవటం, లెక్కలు రాయటం, వాట్ని అన్నపూర్ణమ్మకు అప్పజెప్పటం లాంటి ముఖ్యమైన పనులు గంగులు స్వయంగానే చేసేవాడు.

పశులకొట్టం వైపు నడుస్తున్న గంగులు రెడ్డిగారి చింతవనం దగ్గరకొచ్చేసరికి ఎవరో దుండగులు అతన్ని చెర్నాకోలలు, లాఠీలు, కత్తులతో అడ్డగించారు. ఆరోజు అమావాశ్య కావటంతో అంతా చీకటిగా వుంది. ఏదీ సరిగా కనిపించటం లేదు. తనమీద పడుతూన్నదెవరో గంగులుకు అర్థంకావటంలా! అయినా గంగులు వాళ్ళమీద ధైర్యంగా విరుచుకుపడ్డాడు. పక్కనే పడున్న ఓ తుమ్మమొద్దును చేజిక్కించుకుని తనమీదకొచ్చిన వాళ్ళనంతా బాదటం మొదలెట్టాడు. కండలు దేలి బలిష్టంగా వున్న గంగులు ధాటికి వాళ్ళు తట్టుకోలేకపోతున్నారు. ఆ కటిక చీకట్లో ఎవరెవర్ని కొడుతోందీ తెలీటం లేదు. ఇంతలో రకం గడ్డకట్టుకుపోయేంత గట్టిగా చావుకేక వినిపించింది. ఆ తర్వాత వెంటనే ఎవరో కిందపడటం, బాధగా మూల్గటం జరిగింది. అనుకోని ఈ సంఘటనకు గంగులు భయపడి పరుగెత్తటం మొదలెట్టాడు. ఇలా పరుగెడుతూ 'ఎవరీళ్ళు? నా మీద ఎందుకు దాడిచేశారు? వీళ్ళను ఎవరైనా నా మీదకు పంపారా?' అని ఆలోచిస్తున్న గంగులుకు అన్నపూర్ణమ్మ జ్ఞాపకమొచ్చింది.

అన్నపూర్ణమ్మ ఓ తల నెరవని విధవ. శేషురెడ్డి చెల్లెలు. ఉల్లిపొరలాంటి ఎరుపంచు తెల్లచీర, లోపల ఏ బాడీ లేక వేసుకున్న తెల్లటి పల్చని రవికలోంచి ఆమె గోధుమరంగు అందం కొట్టొచ్చినట్టు కనిపించేది. ఆమె నిండు విగ్రహం మీద యవ్వనపు ఒంపులు మగవాళ్ళల్లో ఇట్టే కోరికలు రేపేవి. అన్నపూర్ణమ్మ తన వయసు వయ్యారం, ఒంపుసొంపులతో కనిపించని ఓ వలను అల్లి గంగులు మీదికి విసిరింది. అతనందులో చిక్కు-

కున్నాడు. ఆమె చేతి కీలుబొమ్మ య్యాడు. అన్నపూర్ణమ్మ అతన్ని తన కనుసైగల్లో ఆడిస్తూ అతనితో తన కామ వాంఛల్ని తీర్చుకుంది. రాత్రి పగలన్న భేదంలేక అనువైనప్పుడల్లా అతనితో కామ క్రీడలు సలిపింది. ఆమె తన యవ్వ నాన్నిలా సార్థకం చేసుకుంటూఉంటే...

ఓ శుభ ముహూర్తాన గంగులు పేరమ్మను పెళ్లాడేడు. పేరమ్మ అతని మేనకోడలే. పెళ్లి అయినప్పటినుంచీ అన్నపూర్ణమ్మతో తనకున్న వ్యవహా రాన్ని తెగతెంపులు చేసుకోవాలను కున్నాడు. కాని ఆమె మాత్రం అతన్ని



వదలదల్చుకోలేదు. తనకు కావలసిన దానికి 'కాదు, పోదు' అనే సమా ధానాల్ని వినటం ఆమె కలవాటు లేదు. అస్సలు అలాంటి సమాధానాలు ఆమెకు ఇంతవరకూ ఎవరూ ఇవ్వలేదుకూడానూ! అలాంటిది ఇప్పుడు గంగులు తన మాట కాదంటాడా? ఈ ధైర్యంతోనే అన్న పూర్ణమ్మ గంగుల్ని తనతో మునుపటి లాగే ఉండమంది. అతను దానికి కాదన్నాడు. అతన్ని బతిమాలింది. చేతులు పట్టుకుని దీనంగా ప్రార్థించింది.

అయినా గంగులు ఒప్పుకోలేదు. దాంతో దెబ్బతిన్న నాగుబాములా బుసకొట్టింది అన్నపూర్ణమ్మ. 'నా మాట విన్నావో సరేసరి. లేదా...' అని పళ్లు కొరికింది.

ఈ జ్ఞాపకాల్ని నెమరు వేసుకుంటూ ఆ చీకట్లో పరుగెత్తాడు గంగులు.

* * *

మర్నాడుదయం పోలీసులొచ్చి అత నింట్లోంచి తుమ్మ మొద్దును స్వాధీనం చేసుగుని, గంగుల్ని అరెస్టుచేసి తీసుకు పోయారు. ఆపూళ్ళో పూలమ్మ పోలయ్యను హత్య చేశాడన్న నేరం మోపి అతన్ని కోర్టులో హాజరుపరచారు. తను నిర్దోషినని గంగులు ఎంత మొత్తుకున్నా ఎవ్వరూ వినిపించుకోలేదు. అతను చేసిన నేరాన్ని కోర్టువారికి విన్నవించుకొంటూ పబ్లిక్ ప్రాసిక్యూటరు అన్న మాటలకు కోర్టు లోని వారంతా గంగులుకు ఉరిశిక్ష తప్ప దనుకొన్నారు. ప్రాసిక్యూటరు తన 'ఉరుములు – మెరుపుల' విన్యాసాలతో గంగులు నేరాన్ని కోర్టువారికి విన్న వించుకుంటూంటే బోనులో నుల్చున్న గంగులు మృత్యువు అప్పుడే తన మీదకు వస్తూన్నట్లు భయపడిపోయాడు.

కోర్టులో హాజరుపరచిన ప్రాసి క్యూషన్ సాక్షుల్లో మునిరెడ్డి ఒకడు.

అతను మంచి సంపన్నుడేకాక ఓ పేరున్న పెద్ద రైతు. మునిరెడ్డి తన సాక్ష్యంలో గంగులు మొద్దుతో పోలయ్యను కొట్టటం తను కళ్ళారా చూశానన్నాడు. 'అతనలా ఎందుకు బాదాడు?' అన్న ప్రశ్నకు డబ్బు విషయంలో వాళ్ళ మధ్య ఏవో తగాదాలు ఉండేవన్నాడు. 'అమావాస్య చీకట్లో జరిగిన సంఘటనలో గంగుల్ని ఎలా పోల్చుకున్నావు?' అనడిగితే ఆ రాత్రి తను బహిర్భూమికని లాంతరు పట్టుకుని పొలం గట్టుకుపోతూ ఈ దృశ్యాన్ని చూశానన్నాడు. తన చేతిలోని లాంతరు వెలుతుర్లో గంగులు స్పష్టంగా కనుపించాడన్నాడు.

గంగులు తన మెడ చుట్టూ ఉరితాడు అప్పుడే బిగుసుకుపోతున్నట్టు భయపడి పొయ్యాడు.

* * *

మునిరెడ్డి సాక్ష్యం పూర్తవగానే బక్కపల్చగా, పొడుగ్గా చురుగ్గా ఉన్న ఓ వ్యక్తి లేచి నుల్చుని బోనులో నిల్చునున్న మునిరెడ్డి వైపు హుందాగా అడుగులు వేస్తూ అతన్ని క్రాస్ ఎగ్జామిన్ చేయటం మొదలెట్టాడు. నల్లకోటు వేసుకుని అందర్నీ ఆకర్షిస్తున్న అతను గంగులు వైపు లాయరు. అతను హత్య జరిగిన నాటి రాత్రి సంఘటనల్ని ఒకదాంతర్వాత ఒకటి ఏకరువు పెట్టి ప్రశ్నార్థకంగా మునిరెడ్డి వైపు చూచాడు. వాటన్నిటికీ రెడ్డి తన సమ్మతం తెలియచేశాడు. కిరోసిన్ లాంతరు ప్రస్తావన వచ్చేసరికి ఆ లాయరు మునిరెడ్డికి ఒక లాంతరు చూపి 'పోలయ్యను గంగులు చంపటం నీవు చూసింది ఈ లాంతరు సాయంతోనేనా?' అని అడిగాడు. దానికి మునిరెడ్డి అవునన్నాడు.

ఆ లాంతర్ని కోర్టులో అందరిముందూ పరీక్షించటం మొదలెట్టాడా వకీలు. లాంతరుకున్న సీసానిండా నల్లగా మసిబట్టి వుంది. దాన్లో కిరోసిన్ పోసే మూతి కింద భాగంలో ప్రింటు చేసిన ఓ లేబిల్ అంటించి వుంది. ఆ లేబిల్ మీది అక్షరాల్ని ఆయన చదవటం మొదలెట్టాడు. ఆ లాంతర్ని తయారు చేసిన కంపెనీ పేరు, దాని బ్యాచ్ నంబరు, లాంతరు ఏ నెలలో తయారయింది - ఇలాంటి వివరాలున్నాయి ఆ లేబిల్ మీద. లాంతరు తయారయిన నెల పేరు చదివి ఆగిపోయాడు లాయరు. ఆది విని అక్కడున్నవారంతా ఆశ్చర్యపొయ్యారు. అంతకు ముందు ఎవరూ పట్టించుకోని ఆ లాంతరు, ఆ క్షణంలో గంగులు ప్రాణాల్ని తనలో దాచుకున్నంత ప్రాముఖ్యందైపోయింది. కోర్టు హాలంతా నిశ్శబ్దంగా వుంది. ఆ నిశ్శబ్దంలోనే గంగులు నిర్దోషిత్వం అక్కడివారికందరికీ అర్థమయింది. పోలయ్య హత్య జరిగిన రెండునెల్ల తర్వాత ఆ లాంతరు తయారయింది. అంటే పోలయ్య హత్య నాటికి ఆ లాంతరు ఉత్పత్తేకాలేదు! *

# మిత్రద్రోహం

మద్రాసు టి. నగర్‌లో వున్న ఒక బేంక్‌కి సూర్యనారాయణ ఆక్టింగ్ ఏజెంట్. అతనికి నారాయణస్వామి, జోగిందర్, విజయకుమార్ స్నేహితులు.

వీళ్ళ ముగ్గురూ సినిమాల్లో చిన్నచిన్న ఎక్స్ట్రా వేషాలు వేస్తూ ప్రొడ్యూసర్లకు, అవసరమున్నవాళ్ళకు అవసరమైన

'సరుకు' సప్లైచేస్తూ ఆ వచ్చిన డబ్బుతో ఏదో జీవితాన్ని సాగిస్తూంటారు. అందులో నారాయణస్వామికి మసాలా దినుసులు అమ్మే ఒక్క చిన్న షాపు కోడంబాకంలో వుంది. బాగా పాతదై పోయిన బ్లాక్ వాక్స్‌హాల్ కారొకటి కూడా వుంది.

సూర్యనారాయణ చక్కనివాడు. చురుకైనవాడు. మంచి మాటకారి. సినిమాల్లో వేషాలువేసి పెద్ద హీరో అవాలనేది అతని ఆశ. దరిమిలా పెళ్ళికూడా చేసుకున్నాడు. భార్య పేరు శారద.

స్నేహంగా మెలగుతూనే సూర్యనారాయణ గురించి తెలుసుకుంటూ అవకాశం కోసం వేచివున్నారు ఆ ముగ్గురూ. నారాయణస్వామి అందుకు ఒక పథకం కూడా తయారుచేశాడు.

సూర్యనారాయణ ఒకోసారి పెద్ద మొత్తాలలో డబ్బును మౌంటురోడ్, జార్జిటౌన్ మొదలైన బ్రాంచీలనుంచి డ్రా చేస్తూంటాడు. అలా డ్రా చేసిన డబ్బును అవకాశం చూసుకుని కాజెయ్యాలన్నదే వారి పథకం.

అందుకు అవసరమైతే సూర్యనారాయణను హత్యచేసేందుకు కూడా వెనకాడదలచలేదు.

అవసరానికి ఉపయోగపడుతుందని వాక్స్‌హాల్ కారుని బయటకుతీసి కాస్త బాగుచేసి భార్య ప్రమీలను అడిగి ఒక పాత చీర తీసుకుని కారు వెనకసీటుకి తెరలుగా తయారుచేశాడు నారాయణస్వామి.

ఆరోజు 1958 నవంబరు పదమూడు. నారాయణస్వామి టి. నగర్‌లో వున్న సూర్యనారాయణ ఇంటికి వెళ్ళాడు.

సూర్యనారాయణ ఆహ్వానించి కాఫీ ఆఫర్ చేశాడు.

మాటల సందర్భంలో ఆ మర్నాడు తాను మౌంటురోడ్‌లోవున్న ఒక బేంక్‌కి, జార్జిటౌన్‌లోవున్న మరో బేంక్‌కి వెళ్ళవలసి వుందనీ, పదమూడువేలది ఒకటి, లక్ష రూపాయలదొకటి చెక్కులు మార్చి డబ్బు తీసుకురావాలనీ అన్నాడు సూర్యనారాయణ.

మర్నాడుదయం అనుకున్న ప్రకారం ముగ్గురు మిత్రులు కలుసుకున్నారు. మూర్ మార్కెట్‌కు వెళ్ళి అక్కడొక మడత చాకునూ, మామూలు చాకునూ కొన్నారు. తర్వాత ధైర్యాన్ని పుంజుకోవడానికి ఒక చౌక రకం సారాయి దుకాణం దగ్గర ఆగారు. మద్రాసులో ప్రొహిబిషన్ వుంది. అయితే లైసెన్సు వున్నవాళ్ళకి కావల్సిన మందు దొరకడం సమస్యేంకాదు. జోగిందర్ దిగి, ఏవో నాలుగు మాటలు చెప్పి ఆ షాపు నుంచి కొంత సరుకు తీసుకున్నాడు. షాపు మనిషి కారు వరకూ వచ్చి, సీసాల్ని డెలివరీ చేశాడు. కారులోవున్న మిగతా ఇద్దర్నీ చూశాడు.

నవంబరులో మద్రాసులో తరచూ వర్షాలు పడుతూంటాయి. 13వ తేదీ సాయంత్రం బాగా వర్షం పడడంవల్ల రోడ్లలో వున్న గుంటలన్నీ జలమయంగా వున్నాయి. జనసంచారం కూడా పెద్దగా లేదు. కారు బోస్ రోడ్డుకేసి దూసుకు పోయింది.

సూర్యనారాయణ పదిగంటలకు బేంక్‌కి చేరుకుని తనకోసం వేచివున్న చి నిర్మాతలు పొన్నలూరి బ్రదర్స్‌ను పలు రించి, పదిసిమిషాల్లో రడీఅయి వా వేన్‌లో అవసరమైన కాగితాలతో బయ దేరాడు.

ముందుగా మౌంటురోడ్ ఆఫీసులో వున్న బేంకిలో
పదమూడువేలు డ్రాచేసి వస్తూ లింగిచెట్టి వీధిలో వున్న మరో బేంక్‌కి వెళ్ళి నలభై వేల రూపాయల చెక్కు సంతకం చేసి ఇచ్చి కేష్ రడీ చెయ్యమనీ, తానింకో పది నిమిషాల్లో వస్తాననీ బయలుదేరాడు సూర్యనారాయణ.

వస్తూ తోవలో బోస్‌రోడ్డులో తన కోసం ఎదురుచూస్తున్న నారాయణస్వామి కారునుచూసి ఆగి, పొన్నలూరు బ్రదర్స్ వారి ఆఫీసు కుర్రాడితో చెప్పి కారుకేసి నడిచాడు సూర్యనారాయణ.

వెనుకసీట్లో కూర్చోవలసిందిగా చిరునవ్వుతో చెప్పాడు నారాయణస్వామి. సూర్యనారాయణ అలాగే చేశాడు. చెరో పక్క జోగీందర్, విజయకుమార్‌లు కూర్చున్నారు.

కారు మద్రాసుకు దక్షిణంగా వున్న మెరీనాబీచ్ కేసి దూసుకుపోయింది.

సూర్యనారాయణ చేతిలోని బ్రీఫ్‌లో ఆశించిన డబ్బంతా వుందని భావించారు వారు ముగ్గురూ. మాట్లాడుతూ మాట్లాడుతూనే సూర్యనారాయణని భయంకరంగా చిత్రవధచేసి చంపేశారు జోగీందర్, విజయకుమార్‌లు. కారు ముందుకు పోతోంది.

ఊహించని భయంకర సంఘటన ఎదురవడంతో సూర్యనారాయణ ప్రాణ రక్షణకు పెనుగులాడేడు కానీ ప్రయోజనం లేకపోయింది. కారు రిజర్వుబేంక్ పక్కనుంచి వెళూంటే అక్కడ వున్న కొందరు ఇంజనీర్లు, ఒక టీ దుకాణం ఆయన ఆ కారునీ, అందులో పెనుగులాడుతున్నట్లు ఛాయా మాత్రంగా కనిపిస్తున్న సూర్యనారాయణనీ చూశారు. వారు కారు నెంబరు కూడా నోట్ చేసుకున్నారు. అది ఎం. ఎస్. సి. 5130. వారు వెంటనే దగ్గరలో వుండే పోలీసు స్టేషన్‌కు ఈ విషయం తెలియజేశారు.

పోలీసులు విపరీతమైన వేగంతో దూసుకుపోయే నల్లకారు కోసం దారులు కాసారు. అయితే అది మధ్యలోనే చెడిపోవడం వల్ల ఆగిపోయింది. దొరికినంత మట్టుకు కొత్తకరెన్సీనోట్లను జేబుల్లోనూ, పర్సుల్లోనూ కుక్కుకుని, నారాయణస్వామీ, విజయకుమార్‌లకు చెప్పి, మెల్లగా కారు దిగి వెళ్ళిపోయాడు జోగీందర్.

తర్వాత తన కారును ఎంతో తెలివిగా, ధైర్యంగా ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్ ఆఫీసు దగ్గరే ఆపాడు నారాయణస్వామి.

జోగీందర్ ఆటో ఎక్కేసి దగ్గర్లో ఉన్న తనఆంగ్లోయిండియన్ ప్రియురాలు హరన్ దగ్గరకు వెళ్ళి సేదదీరి కొంత సేపటికి ఎటో మాయమైపోయాడు.

ఆగిపోయిన కారు రిపేరుచేస్తేగాని కదలదు. దగ్గరగా ఎక్కడా మెకానిక్ లేకపోతే ఆటోఎక్కి టి. నగర్‌వెళ్ళి, ఓ మెకానిక్ కుర్రాణ్ని తీసుకువచ్చాడు నారాయణస్వామి.

ఆటో అతనికీ, గేరేజ్ అతనికీ కొత్త వందరూపాయల నోట్లు ఇచ్చాడు. వాళ్ళు ఆశ్చర్యంగా నారాయణస్వామి వేపు చూశారు.

మెకానిక్ వచ్చి కారు రిపేరు చేస్తూండగా, విజయకుమార్ కొంత డబ్బు తీసుకుని జేబులు నింపుకుని, నారాయణస్వామితో చెప్పి నిష్క్రమించాడు.

కారు వెనకసీట్లో రక్తసిక్తమై పడివున్న సూర్యనారాయణ మృతదేహాన్ని ఛాయా మాత్రంగా చూశాడు మెకానిక్

కుర్రాడు. అయితే అతను వూహించిన దానికన్నా పదిరెట్లు డబ్బు ముట్టడంతో తనపని తానుచేసి కారు బాగుచేశాడు.

కారు వేరేతోవలో నడిపించి, మద్రాసుకు ముప్ఫై అయిదుమైళ్ళ దూరంలో వున్న చెంగల్ పట్ కేసి దూసుకుపోయి, దూరంలో వున్న చెట్ల గుబురుల్లో శవాన్ని విడిచి, తిరిగి వస్తూంటే వందలూరు గ్రామ ప్రాంతంలో కారుటైరు పాడైపోయింది. చేసేదిలేక దాన్ని అక్కడే ఒక రైతుకి అప్పగించి, తాను లోకల్ ట్రైన్‌లో టి. నగర్‌చేరి ఓ మిత్రుడికార్లో వందలూరు చేరి, తనకారు బాగు చేయించుకుని, ఆ తెల్లవారుఝాముకి ఇల్లుచేరి స్వేచ్ఛగా నిశ్వసించాడు.

అయితే అప్పటికే పోలీసు యంత్రాంగం కార్యరంగంలోకి దిగింది. అన్ని సమాచారాలూ వారికి ఎప్పటికప్పుడుచేరుతూనే ఉన్నాయి. ముఖ్యంగా బేంక్ వారు ఇచ్చిన రిపోర్టుతో చురుకుతనం పుంజుకుంది వ్యవహారంలో.

టి. నగర్ బ్రాంచీలోనే పనిచేస్తూ, సూర్యనారాయణ ఇంట్లోనే అద్దెకు వుంటున్న విశ్వనాథరావు అనే బేంక్ క్లార్క్ పొన్నలూరి వారి వాన్ నుండి నారాయణస్వామి కారులోకి సూర్యనారాయణ మారిపోవడంవిని, ఆ సంగతి కూడా రిపోర్టు చేశాడు.

మొత్తం మీద వాక్స్‌హాల్ కారు నెంబరు దొరకడంతో కొద్దిరోజులకు నారాయణస్వామి దొరికిపోయాడు. అతనిని నానా హింసలూ పెట్టాక కథంతా బయటపడింది.

విజయకుమార్ ఉత్తరప్రదేశ్‌లో తన స్వగ్రామం చేరుకున్నాడని, జోగీందర్ పాకిస్తాన్ చేరుకున్నాడని క్లూలు లాగారు పోలీసులు. విజయకుమార్ సులభంగానే అరెస్టయాడు. గానీ జోగీందర్ మాత్రం దొరకలేదు.

వందలూరు సమీపాన సూర్యనారాయణ శవం దొరికింది. పోస్ట్‌మార్టం రిపోర్టు ప్రకారం అది దారుణమైన హత్యగా నిర్ధారించబడింది.

ఆనాడు పేరుపొందిన లాయర్లు సి.డి. సెక్కిజార్, బి. టి. సుందరరాజన్, ఎ. సరోజిని ఈ కేసులో పనిచేశారు.

దొరికిన ఆధారాలు, సాక్ష్యాల ఆధారంగా సూర్యనారాయణను భయంకరంగా హత్యచేసిన విజయకుమార్‌కి ఉరిశిక్ష విధించబడింది. కొద్ది కాలం తర్వాత అది అమలు జరిగింది.

నారాయణస్వామికి మాత్రం పద్నాలుగేళ్ల కారాగార శిక్ష విధించబడింది. ఆ లెక్క ప్రకారం 1972లో అతను విడుదలై వుండాలి. జోగీందర్ మాత్రం నేటికి చట్టానికీ, న్యాయానికీ అందకుండా తప్పించుకు తిరుగుతూనే ఉన్నాడు. *

# దురాశ

మద్రాసుకు చాలా దూరంలో వుంది మధువనం.

అందులో అందమైన నాలుగడుగుల సువర్ణ కృష్ణ విగ్రహం వుంది. నీలమేఘశ్యాముడు సువర్ణుడై, వజ్ర వైఢూర్య, మరకత, మాణిక్యాది నవరత్నాలతో, ధగధగలాడే వివిధ ఆభరణాలతో, చిరునవ్వుచిందే మధురాధరాలను తాకుతూ రాగ మాధురిసింపే వేణువుతో, భక్తజన మందారుడై, శృంగార ప్రదంగా దర్శనమిస్తాడు.

పట్టణానికి దూరంగావున్నా, ప్రయాణ సౌకర్యాలు తక్కువే అయినా, ఆ అపూర్వ స్వర్ణ కృష్ణ దర్శనార్థం మామూలు రోజులలో కూడా అసంఖ్యాకంగానే వస్తారు భక్తులు. కృష్ణాష్టమి వంటి పర్వదినాల్లో అయితే ఇక తీర్థప్రజే.

సుప్రభాతం నుంచీ పవళింపు సేవ వరకూ అన్నీ నిర్విఘ్నంగా సాగిస్తూ, కృష్ణసేవ చేసుకుంటూ మంచి పూజారిగా పేరు పొందారు దేవనాథాచార్యులవారు.

ఊర్ధ్వపుండ్రాలు, గోష్పాదమంత పిలక, వృద్ధాప్యపు పరిధిలోకి అడుగిడుతున్న అనుభవ పూర్వక నయనాలు, కాస్తగా వడులుతున్న శరీరం, చిన్న బొజ్జ, ఆ బొజ్జ మీద అందంగా కనిపించే వెండి తీగల వంటి యజ్ఞోపవీతం, బొడ్డు దాటి కట్టుకున్న పట్టుపంచ - భగవత్సాన్నిధ్యంలో నిజమైన భగవత్ సేవకుడుగా కనిపిస్తారు ఆచార్యులవారు.

దేవాలయ ప్రాంగణంలోనే కాస్త దక్షిణ దిశగా ఓ చిన్న సైజు పెంకుటిల్లు వుంది. అదే వారి నివాసగృహం. వారి ధర్మపత్ని పేరు మంగమ్మ.

దేవాలయాన్ని కాపలాకాసే శేషులు చాలా బలిష్టంగా, మొరటుగా, చెయ్యెత్తు మనిషి. అతను దేవాలయానికి కాస్త పశ్చిమంగా ఓ చిన్న తాటాకులపాక వేసుకుని వుంటున్నాడు.

చలి విరుగుతున్న ఫిబ్రవరి నెలలో ఓ బుధవారపు తెల తెల వారుతున్న సమయమది. వెలుగు ఇంకా రాలేదు.

ఆచార్యులవారు కాలకృత్యాలు తీర్చుకుని, నదిలో శిరఃస్నానం చేసి, సంధ్య వార్చుకుని, ఊర్ధ్వపుండ్రాలు ధరించి, శ్రీకృష్ణ స్తుతిమాల చదువుతూ ఆలయ ప్రాంగణంలో అడుగు పెట్టారు.

తన్మయంగా, అర్ధ నిమీలితనేత్రాలతో ఆచార్యులవారు భగవన్నుతి చేస్తూ, మండపందాటి గర్భగుడి సమీపించబోయారు.

ఆయన గుండె బద్దలైంది. నరాలు చిట్లి, రక్తం పైకి చిమ్ముతుందా అన్నంత భయం కలిగింది. వారి శరీరమంతా చిరు కంపన ఆక్రమించింది. కళ్ళు చీకట్లు కమ్మాయి. కాళ్ళలో సత్తువ సన్నగిల్లింది. గొంతు తడారిపోయింది.

ఆయన ఏదో అనబోయారు. అంతే! ఆయన తలమీద బలంగా దెబ్బతగిలింది. రక్తం చిమ్మింది. అలా కుప్పలా కూలిపోయారు.

ఆయన చూసిన దృశ్యం అతి భయంకరమైనది.

గర్భగుడి తలుపులు తీసివున్నాయి. స్వామివారి విగ్రహం మీద నగలన్నీ తీసి ఎవరో చేతి సంచిలో వేసుకుంటున్నారు. ఆ రూపం ఛాయా మాత్రంగా దృశ్యమైంది. అక్కడే కాపలాదారు శేషులు ఘోరంగా హత్య చేయబడి వున్నాడు. అంత బలమైన మనిషినీ ఎవరో చిత్రవధ చేశారు. చర్మం చిట్లి ఎముకలు కనిపిస్తున్నాయి. రక్తపు మడుగులో పడివున్నాడు.

పోలీసు అధికారులు హుటాహుటి రంగప్రవేశం చేశారు. అప్పటికింకా ఆచార్యులవారు స్పృహ తప్పివున్నారు. శ్వాస ఆడుతోంది. వెంటనే వారిని దగ్గరగా వున్న ప్రభుత్వ ఆస్పత్రికి చేర్చారు.

అక్కడ ఆయనకు స్పృహ వచ్చింది. నిస్సత్తువగా కళ్లు తెరిచారు. అవి ఎవరి కోసమో అన్వేషిస్తున్నాయి.

పమిటచెంగు నోట్లో పెట్టుకుని వచ్చే

దుఃఖాన్ని ఆపుకుంటూ, అశ్రునయనాలతో ఆచార్యులవారి పాదాలచెంత నిలబడి దుఃఖిస్తోంది మంగమ్మగారు.

ఆచార్యులవారు ఆమెవేపు చూసి ఏదో అనబోయారు. పెదిమలు అతి కష్టంగా విడివడ్డాయి. ప్రయత్నమేగాని ఒక్క మాట పెగిలిరాలేదు.

వారి ప్రయత్నం వృథాఅయిపోయింది. చూస్తోండగా వారు అంతిమశ్వాస వదిలేశారు.

రెండు హత్యలకు, దేవాలయంలో దోపిడీకి ఎవరు కారణం అయుంటారు? చుట్టుపక్కల ప్రాంతాల్లో బందిపోటు దొంగలు ఎక్కువగా తిరుగుతున్నారనే వార్త ప్రచారంలో వుంది.

అంతేకాక ఎర్రగొల్లలు, జిప్సీలు కూడా ఆ ప్రాంతంలో తిరుగుతున్నారనే అనుమానం కూడా వుంది. వారుగాని ఈ ఘోరాలు చెయ్యలేదుకదా...!

ఒక్క ఆధారమూ లేకుండా ఇంత ఘోరం చెయ్యగలిగిన ఆ కిరాతకుల గురించి పోలీసులు గాలింపు ప్రారంభించారు.

* * *

దేవాలయ ధర్మకర్త నాగప్పగారి ఇంటికి డిప్యూటీ ఇన్స్‌పెక్టర్ ఆఫ్ పోలీస్ అధికారి తన మందీ మార్బలంతో వెళ్లారు.

నాగప్ప ధనవంతుడు. మనిషి దర్జాగా కనిపిస్తాడు.

దేవాలయాన్ని వారి తాతగారు కట్టించారు. దానిమీద వచ్చే ఆదాయంలో ఎనభై శాతం నాగప్పగారికే చెందుతుంది. మిగిలిన ఇరవై శాతం ఆచార్యులవారి జీత భత్యాలకు నిర్దేశించబడింది.

ఆ ఇరవై శాతం మాత్రం ఏమంత తక్కువకాదు. కనుక వారూ పూజారి బృందంలో ధనికులుగానే చెలామణీ అవుతున్నారు.

"ఆచార్యులవారు చాలా మంచివారు. సాధు స్వభావులు. ఆధ్యాత్మిక చింతనాపరులు. వారి భార్య మంగమ్మ మాత్రం మహా కానిమనిషి. గర్వం, అహంకారం, ఆశ వారికి తోబుట్టువులు. ఎప్పుడూ ఆచార్యులవారిమీద రుసరుసలాడుతోండేది. ఈ ఘోరాలు ఎలా జరిగాయో అంతుబట్టడం లేదు. ఇది మా వంశగౌరవానికి సంబంధించిన విషయం. ఎలాగేనా కూపీతీసి నేరస్థుల్ని శిక్షించాలి" అన్నారు నాగప్పగారు.

ఆచార్యులవారి భార్య మంగమ్మ గురించి వివరాలు సేకరించారు.

ఆమె చాలా బీదకుటుంబంలో జన్మించింది. తండ్రి అశుభకార్యాలు జరిపించే వాహకుడు. శ్రాద్ధ కర్మలు, పిండ ప్రదానాలు ఇత్యాదివిచేసి, ఏదో పైసా పరకా సంపాదించి తన కుచేల సంతానాన్నీ, వామాక్షివంటి భార్యనూ పోషించేవాడు. రెండుపూటలా కడుపునిండా ఏ రోజన్నా తింటే ఆ రోజు వారికి పండగన్నమాట. అలాంటి కుటుంబంలో అయిదో కూతురు మంగమ్మ.

ఆమె అదృష్టవశాత్తూ ఆచార్యులవారితో ఆమె వివాహం జరిగింది.

ఆ వివాహం ఆమె జీవితాన్ని మార్చేసింది. రెండు పూటలా కావల్సిన నవకాయ పిండివంటలతో షడ్రసోపేతమైన భోజనం చేసేది. కావల్సిన చీరలు కొనుక్కునేది. ఎప్పుడూ చేతిలో చిల్లర ఆడుతూండేది.

ఆమె తీరని కోరికలన్నీ తీరడం మొదలుపెట్టాయి.

అయితే ఆమె కోర్కెల గుర్రాలకు

కళ్లేలు లేకుండాపోయాయి. దురాశతో కూడుకున్న కోర్కెలు ఎక్కువై పోయాయి.

ఎప్పుడూ పట్టుచీరలు కట్టుకోవాలనీ,



రకరకాల బంగారు నగలు అలంకరించు కోవాలనీ, కట్లకాసుల పేరు, దండ కడియాలు, పాపిడి బిందీలు, వడ్డాణం–ఇత్యాదివన్నీ కావాలని ఆమె ఆచార్యుల వారిని వేధించేది రోజూ.

ఆయన ఎంతో శాంతంగా సర్దిచెప్పే వారు. అయితే ఆమె వినేది కాదు. చివరకు ఆమె నోటికి భయపడి ఆచార్యుల వారు మౌనముద్ర వహించేవారు.

ఆమె మేనమామ భాస్కరం దగ్గరగా వుండే ఓ తాలూకా కేంద్రంలో ప్లీడరు గుమాస్తా. మహా జిత్తులమారి నక్క. నవ్వుతూ పేగులు కోసేసే రకం. సలహా చెబుతున్నట్టే చెప్పి స్వాహా చేసే రకం.

అతణ్ణి రప్పించి ఏవో మంతనా లాడింది మంగమ్మ.

కథ అక్కడ మొదలైంది.

* * *

"మాకు అన్నీ వివరాలూ తెలుసు. నిజం దాచకుండా అన్నీ వివరించండి. అబద్ధం చెబితే శిక్ష చాలా కఠినంగా వుంటుంది" అంటూ బెదిరించేసరికి, మంగమ్మ బెంబేలుపడిపోయి నిజంకాస్తా బయటపెట్టేసింది.

"నా దురాశే నన్ను నాశనం చేసింది. కృష్ణ విగ్రహం మీద నగలు, అలంకరణ చూసినప్పుడల్లా, ఈ విగ్రహానికి ఇన్ని నగలేమిటి–అని ఒకటే ఇదైపోయేదాన్ని. ఆ నగలన్నీ ఎలాగేనా సంపాదించి, అలంకరించేసుకోవాలని ఒకటే తహ తహ కలిగింది.

భాస్కరం మామయ్యను పిలిపించాను. అతడు పథకం తయారుచేశాడు. ఎవరో కిరాయి రౌడీలను పెట్టి శేషల్ని చితక బాదించాడు. వాడు మమ్మల్ని గుర్తుపట్టాడు. అంచేత అసలుకే మోసం వస్తుందని వాడిని చిత్రవధ చేశాడు.

ఇంతలో నేను విగ్రహం మీది నగల్ని సంచిలో వేస్తున్నాను. సరిగ్గా అదే సమ యానికి ఆయన వచ్చారు.

నన్నూ, భాస్కరాన్ని స్పష్టంగా చూశారు. శేషలు హత్య కూడా చూశా రేమో అనే అనుమానం వచ్చింది. ఆయనేదో అనబోయారు గానీ, భాస్కరం మామ ఆయన తలమీద బలంగా కొట్టాడు. పాపిష్టి దాన్ని... ఇదంతా

నావల్లే అయింది. అటు ఆయనకా అన్యాయం చేశాను. ఇటు భాస్కరమా నాకొక ఎర్రని ఏగానీ ఇవ్వ లేదు. పైపెచ్చు శ్రమ నాదీ, ఫలితం నీదీనా— అంటూ నీతులు చెబుతున్నాడు. బుద్ధిలేని పని చేశాను. నన్ను చంపెయ్యండి..." అంటూ బావురుమంది.

భాస్కరం గ్రామాంతరం వెళ్లినప్పుడు వెళ్లి భయపెట్టేసరికి, మంగమ్మ అసలు కథ కాస్తా భయ ఫెట్టేసింది.

రెండు హత్యలు, బంగారు నగల చోరీ—అనే అభియోగంపై సెషన్స్ జడ్జి భాస్కరానికీ, మంగమ్మగారికీ, తదితర రౌడీలకూ మరణ దండన విధించాడు.

హైకోర్టుకుఅప్పీలుచేసుకుంటేహైకోర్టు జడ్జి కేసును పరిశీలించి, మంగమ్మకు మరణ దండన సడలిస్తూ యావజ్జీవ కారాగారవాసం విధించి, మిగిలినవారికి మాత్రం మరణ దండన విధించారు. *

# ప్రేయసికోసం

అప్పుడే ఝాన్సీ నుంచి వచ్చిన రెలు మొఘల్‌షరాయ్ రైల్వే ప్లాట్‌ఫామ్ మీద ఆగింది.

చూడ్డానికి ఎంతో పురాతనమైనదిగా కనిపించే ఓ మూడో తరగతి పెట్టెలోంచి బిలబిలమంటూ ప్రయాణీకులు దిగుతున్నారు.

గార్డు బోగీకి పక్కనే వుంది ఈ బోగీ.

తలపాగాలు సరిచేసుకునేవాళ్లు, జోళ్లు సరిగా తొడుక్కోకపోవడం వల్ల చిరాగ్గా నడిచేవాళ్లు, పెట్టే బేడా నెత్తిమీద పెట్టుకున్నవాళ్లు, కుండలు, మూటలు, కోళ్ళ గంపలు — ఇత్యాది వాటితో ముందుకు నడుస్తున్నవాళ్లు, చాలా హడావుడిగా వుంది ఆ ప్రాంతం!

కొద్ది నిమిషాల తర్వాత బోగీలన్నీ ఖాళీ అయిపోయాయి. స్కావెంజర్లువచ్చి, పెట్టెలు బాగుచేస్తూ ఈ బోగీలోకి కూడా వచ్చారు.

ఆ బోగీలో ఓ బెర్తు కింద బాగా ఎత్తుగా వున్న ఓ పెద్ద రేకుపెట్టె వారికి కనిపించింది. దానికి అంతలావు తాళం వేసి వుంది. అంతేకాక బలమైన కొబ్బరి తాడు కూడా కట్టి వుంది.

పనివాళ్లు ఈ విషయం స్టేషను-మాస్టరుకు రిపోర్టు చేశారు. అధికారులు పోలీసులతోసహా వచ్చి ఆ పెట్టెను చూశారు.

"రేపటివరకూ ఎవరూ క్లెయిమ్ చెయ్యక పోతే బ్రేక్ ఓపెన్ చేద్దాం" అన్నారు రైల్వేపోలీసు అధికారులు.

ఆ మర్నాడు కూడా ఎవరూ రాక పోయేసరికి, ముందుగా ఆ పెట్టెను ఓ ఫొటోతీసి, తర్వాత అధికారుల సమక్షంలో దాన్ని తెరిచారు.

అందులో దృశ్యాన్ని చూసి అంతా ఆశ్చర్యపోయారు. రూపురేఖలు పోల్చుకోవడానికి కూడా వీలులేనంతగా పాడైపోయిన ఓ స్త్రీ నగ్న శవం అది!

ఆమె కనుగుడ్లు గాని, కింది పెదవి, చుబుకంగానీ కనిపించలేదు. ఆమె శరీరాన్ని తునాతునకలు చేసి, అన్నిటినీ గుట్టగా ఆ పెట్టెలో గుట్టుగా పడేశారు ఎవరో.

ఆమె చేతి వేళ్ళని కూడా రాక్షసంగా కత్తితో ముక్కలుకొట్టి, అవన్నీ కూడా ఆ పెట్టెలో పడేశారు.

కర్కశత్వానికీ, కఠిన హృదయానికీ ప్రసిద్ధిచెందిన మొఘల్‌షరాయి పోలీసులు

కూడా ఈ దృశ్యం చూసి కదిలిపోయారు.

శిథిలమైన ఈ స్త్రీ శవం పోస్టుమార్టంకి పంపారు.

ఆస్పత్రి అధికారులు పోస్టుమార్టం కోసం ఈ శవాన్ని, దాని చుట్టూ చిందర వందరగా పడివున్న శరీర భాగాల్ని వరుసగా పేర్చి ఓ రూపం ఇవ్వడానికి ప్రయత్నించారు. కొద్దిసేపు తర్వాత చేతి వేళ్ళన్నీ అమర్చాక, ఆ శవానికి మొత్తం పదకొండు వేళ్ళు వున్నట్టు లెక్క తేలింది. ఎడమచేతి చూపుడువేలు అదనంగా కనిపిస్తోంది.

కొంత మందికి ఉపయోగం లేకుండా అదనంగా ఓ వేలు వుండడం అందరికీ తెలిసిందే.

అయితే అది అలా నిరుపయోగమైన వేలుకాదు. ఇంకా పరిశీలనగా చూసిన తర్వాత వారికి మరింత ఆశ్చర్యం కలిగింది.

ఆ వేలు ఆ స్త్రీకి సంబంధించినది కాదు. అది ఒక పురుషుడిది. మొరటుగా, లావుగా, వెంట్రుకలతో వుంది ఆ వేలు. స్త్రీల వేళ్లు అలా వుండడం అరుదు. ఆమె శరీరపు రంగుకీ ఈ వేలి చర్మపు రంగుకీ బాగా తేడావుంది.

అధికారులలో సంచలనం ప్రారంభం అయింది.

ఒక పురుషుడి వేలు ఈ స్త్రీ శవంతో పాటు ఎలా వచ్చింది? అసలీ శవం ఎవరిది? ఈ హత్య ఎక్కడ ఎలా జరిగింది? శవం వున్న ఈ పెట్టె బోగీలోకి ఎలా వచ్చింది? ఇలా సవాలక్ష ప్రశ్నలు.

అన్వేషణ ప్రారంభించారు పోలీసు అధికారులు.

ఝాన్సీ - మొఘల్‌షరాయ్ మధ్య వున్న స్టేషన్లలో అధికారులను, పోలీసులను, ప్రతినిత్యం ప్రయాణంచేసే విద్యార్థులను, ఉద్యోగులను, వ్యాపారులను ఇలా చాలామందిని వాకబు చేశారు.

ఏం చేసినా ప్రయోజనం లేకపోయింది.



పరిసర గ్రామాల్లో టమ్‌టమా వేయించారు. కరపత్రాలు పంచారు. శవం గురించి వివరాలు ప్రకటించారు. దేనికీ సరైన సమాధానం లభించలేదు.

* * *

మొఘల్‌షరాయ్‌కి దగ్గరగా వున్న 'పారస్‌ఫూర్' అనే గ్రామంలో మోతీరామ్ ప్రసిద్ధి చెందిన డాక్టరు.

పేదసాదలకు, మధ్యతరగతి జనాలకు అతను దేవుడు. సాధ్యమైనంత ప్రజాసేవ చెయ్యడమేగాని, ఎవరెంత ఫీజు ఇచ్చారన్నది అతనెన్నడూ ఆలోచించలేదు.

ఓసారి క్లబ్బులోనూ, మరోసారి మిత్రులతో పిచ్చాపాటిలోనూ 'ట్రంక్

పెట్టె మర్డర్ కేసు' గురించి అతను విన్నాడు.

ఆ విషయం గురించి ఎక్కువగా అతను పట్టించుకోకపోయినా శవానికి వున్న అదనపు వేలు గురించి మాత్రం అతను కించిత్తు ఆలోచించక పోలేదు. తీవ్రంగా ఆలోచించిన మీదట, ఓ నెల క్రితం జరిగిన సంఘటన అతనికి గుర్తు వచ్చింది.

ఆరోజు సాయంత్రం కంపౌండర్ ఆదరా బాదరా ఓ పేషంటును తీసుకు వచ్చాడు. ఎడమ చెయ్యి రక్తసిక్తమై ఉంది. అతని చూపుడువేలు తెగిపోయింది.

"ఫేక్టరీలో పనిచేస్తుండగా ఏక్సిడెంటయింది. బాగా గాయపడ్డాడు. వేలు అక్కడికక్కడే తెగిపోయింది" అన్నాడు కంపౌండర్.

మోతీరాం అతడిని పరీక్షించిగాయాన్ని శుభ్రపరిచి డ్రెస్సింగుచేసి, చికిత్స చేశాడు.

వార్తాపత్రికలలో వార్తలబట్టి,మిత్రుల మాటల బట్టి ఆలోచిస్తే ఆ హత్యకూ, అందులోని పదకొండో వేలుకీ, ఈ ఫేక్టరీ ప్రమాదంలో వేలు కోల్పోవడమనే సంఘటనకూ కొంత సంబంధం ఉండవచ్చని అనిపించి, డాక్టర్ మోతీరాం కంపౌండర్ని పిలిచి ఆ వేలు పోగొట్టుకున్న వ్యక్తి వివరాల గురించి అడిగాడు.

కంపౌండర్ చెప్పిన విషయాలు ఎంతో ఆసక్తికరంగానూ, ఆలోచనా స్ఫోరకంగానూ వున్నాయి.

'వేలు పోగొట్టుకున్న వ్యక్తి పేరు శ్యామ్. అతను ఓ సోడాల కంపెనీలో పనిచేస్తున్నాడు. బాగా స్త్రీలోలుడు. రోజుకో కొత్త పిట్టలేందే అతనికి నిద్ర పట్టదు. అతనికొక అందమైన భార్య వుంది. పిల్లలు లేరు. ఆ భార్య కూడా అతని వ్యసనాలను భరించలేక అతణ్ని వదిలేసింది' అని కంపౌండర్ వివరాలు సేకరించి చెప్పాడు.

శ్యామ్ వివరాలు ఈ కేసు విషయంలో ఏమైనా ఉపయోగపడగలవేమో అని పోలీసులకు అందజేశాడు డాక్టర్ మోతీ రామ్.

పోలీసు అధికారులు అన్వేషణ ప్రారంభించారు.

శ్యామ్ గ్రామాంతరం వెళ్లాడనీ, అంతే కాదు అతను పనిచేసే సోడాల కంపెనీలో ఓ వృద్ధుడి వితంతు కుమార్తెను కూడా లేవదీసుకుపోయాడనీ తెలిసింది.

పోలీసులు తమ అన్వేషణ మరింత దృఢతరం చేశారు. చివరకు శ్యామ్ పాట్నా శివార్లలో వున్న ఓ ధర్మశాలలో దొరికాడు. అతనితో పాటు ఓ స్త్రీ కూడా వుంది. ఆమె పేరు సుషమ.

ఇద్దర్నీ మానసికంగానూ, శారీరకంగానూ చిత్రహింసలకు గురిచేశాక–ఆమె తట్టుకోలేక ఏడుస్తూ అన్నీ వివరించింది. ఆమె సోడా ఫాక్టరీలో ఓ ఉద్యోగి వితంతు కుమార్తెగా అంగీకరించింది.

"చాటుమాటు సరసాలు ఎన్నాళ్లు సాగించినా అది చట్టబద్ధమైన వివాహం కాలేదు. అంచేత నన్ను శాస్త్రీయంగా పెళ్ళిచేసుకో. నీ పెళ్లానికి ఎలాగూ పిల్లలు కలుగలేదు. ఆ గొడ్రాల్ని వదిలించుకో. నన్ను పెళ్ళి చేసుకో. నీకు పండంటి సంతానాన్ని అందిస్తాను" అంది సుషమ.

'సంతానం సంగతి దేవుడెరుగు. ఎర్రగా లబ్బుగా వున్న సుషమని వదులుకోవడం మాత్రం అసంభవం' అని గ్రహించాడు.

అయితే పెళ్లిచేసుకోనిదే సుషమ ఒంటి

మీద చెయ్యి వెయ్యనివ్వదు. పెళ్ళాం బతికుండగా ఈ పెళ్ళి జరగదు. వదిలి వెళ్ళిపోవచ్చుగానీ, తన రెండో పెళ్ళికి పెళ్ళాం ససేమిరా అంగీకరించదు. ఆ అడ్డు తొలగాలంటే ఒకటే మార్గం. భార్యను చంపేయాలి. దానికి పథకం వెయ్యాలి.

ఆమెతో ప్రేమగా వున్నట్టు నటించి, పక్క వూళ్ళో సాధువెవరో ఉన్నాడని, అతను సంతాన ప్రాప్తికి చిట్కాలేవో ఇస్తాడని చెప్పి, నమ్మించి ఆమెను బయల్దేరదీశాడు.

అమాయకురాలైన భార్య అతణ్ని అనుసరించింది. ఇద్దరూ రైలు పట్టాల వెంబడి నడకసాగించారు.

అప్పటికే సుషమ ఒక పెట్టె, పదునైన కత్తి, తాడు సిద్ధం చేసుకుని తోవలో ఓ చెట్టుచాటున పొంచివుంది.

సమయం కోసం చూసి, శ్యామ్ దంపతులు అలా రావడం చూసి ఆమె మీద లంఘించబోయింది సుషమ. అయితే అంతకన్నా బలవంతురాలు అయిన శ్యామ్‌భార్య ఆమెమీద తిరగబడి, చేతిలో కత్తి లాగేసుకుంది.

ఇది గమనించిన శ్యామ్, భార్యచేతిలో కత్తి బలవంతాన లాగబోయాడు. ఆమె భద్రకాళి అవతారం ఎత్తి అతనిమీదకు అదే కత్తిదూసింది అప్పుడుఅనుకోకుండా అతని ఎడమచేతి చూపుడు వేలు తెగిపోయింది. చేతికి బాగా గాయం అయింది.

శ్యామ్ వీరావేశంతో ఆమె చేతిలోని కత్తిలాక్కుని, ఆమెను చిత్రవధ చేశాడు. కసి తీరక శరీర భాగాలైన కళ్ళు, వేళ్ళు ఇత్యాదివన్నీ ముక్కలు ముక్కలుగా నరికాడు.

వితంతు ప్రేయసి, శ్యామ్ ఇద్దరూ కలసి ఆ చిత్రవధ చేసిన శరీర భాగాల్ని పెట్టెలో నింపారు. అలా నింపుతున్నప్పుడు, అనుకోకుండా శ్యామ్ వేలుకూడా అందులో పడిపోయింది.

పెట్టెకు తాళం పెట్టి, తాడుతో కట్టి ఆమె నెత్తిమీద పెట్టి రైల్లో పెట్టెయ్యమని చెప్పి, తాను పారస్‌ఫుర్‌లోవున్న డాక్టర్ మోతీరాం వద్దకు చికిత్స కోసం వెళ్ళాడు.

సుషమ ఆ పెట్టెను నానా శ్రమలూ పడి, మొఘల్‌షరాయ్ ప్లాట్‌ఫాంమీదకు అప్పుడే వచ్చిన ఝాన్సీ రైల్లో ఓ బెర్తు కింద పెట్టేసి మామూలు ప్రయాణీకురాల్లా నడిచిపోయింది.

ఇదీ జరిగిన కథ.

సావధానంగా విన్న కోర్టువారు శ్యామ్‌కూ, సుషమకూ యావజ్జీవ కారాగార శిక్ష విధించారు.

డాక్టర్ మోతీరాంకు ప్రత్యేకాభినందనలు అందించారు. నిజమే! ఆయనేగాని తన అనుమానాన్ని పోలీసులకు తెలియజేయకపోతే ఈ హత్యోదంతం ఫైళ్లలో మాత్రమే వుండిపోయేది. *

# మనీపర్సు

అర్ధరాత్రి చీకటి తెరల్ని చీల్చుకుంటూ ఎక్స్‌ప్రెస్ రైలు పరుగెడుతోంది. చెవులు చిల్లులు పడేలా ఓ కూతవేసి శరావతి వంతెన మీదకొచ్చింది. మరుక్షణం నుంచి దడ్, దడ్, దడ్ అని శబ్దం చేస్తూ వంతెన మీద ముందుకు దూసుకుపోతోంది. వంతెన కింద నిండుగా ప్రవహిస్తూన్న శరావతీ నదీ జలాల హోరు వంతెన మీద శరవేగంతో పరుగెడుతోన్న రైలు శబ్దం, ఆకాశంలో నలువైపుల్నించీ వినిపిస్తున్న అర్థంగాని అల

జల్లు—ఈ శబ్దాలమధ్య ఆ చీకట్లో బరువైన వస్తువేదో వంతెన మీంచి కింద ప్రవహించే నదిలో పడిన శబ్దం కలిసిపోయింది. వంతెన మీద ఛుకు, ఛుకు, ఛుకు.... అంటూ పరుగెడుతోన్న రైలు పెట్టెల కిటికీల్లోని వెలుతురు కదలుతూన్న దీప తోరణంలా కనిపిస్తోంది. అందులోని మొదటి తరగతి పెట్టె తలుపు తెరుచుకుని కొన్ని క్షణాల తర్వాత మళ్ళీ మూసుకుంది. రైలు ఇంకోసారి కూతవేసి వంతెననిదాటి చీకట్లో దూసుకుపోయింది. అప్పుడు ఆ మొదటి తరగతి పెట్టె చీకటైపోయింది. అంతకు కొన్ని క్షణాల క్రితమే ఆ పెట్టెలో ఎవరికీ తెలిని ఓ దారుణం జరిగింది. అయినా రైలుమాత్రం తనకేమీ తెలీనట్టు అతి మామూలుగా పరుగెడుతూనే వుంది. అలా పరుగెడుతూన్న రైలు తెలతెలవారుతుండగా ప్రశాంతపూరు స్టేషను చేరుకుంది. అది చిన్న స్టేషనవటం మూలాన ఎక్స్‌ప్రెస్ బళ్లు అక్కడ ఆగవు. కాని ఈ ఎక్స్‌ప్రెస్ ఆ స్టేషన్‌లోకొచ్చేసరికి దాని చక్రాలు పట్టాలకు రాచుకుని కీచుకీచున ఆగిపోయింది. తెల్లటి డ్రస్ వేసుకున్న గార్డు ఆకుపచ్చ, ఎరుపు రంగుల లాంతరు చేతపట్టుకుని ఇంత రాత్రప్పుడు అలారం గొలుసు లాగిన వాళ్ళని సణుగుడుగా తిట్టుకొంటూ ఫస్టుక్లాస్ కంపార్టుమెంటు వెపు నడిచాడు. ఇంతలో పక్కపెట్టెలోంచి ఇద్దరు టికెట్ ఇన్‌స్పెక్టర్లు అక్కడికి పరిగెత్తుకొచ్చి ఆ పెట్టెలో లైట్లు వేసి, ఆ వెలుతురులో అక్కడ కనిపించిన దృశ్యానికి ఆశ్చర్యపోయారు. సీట్ల మీద, కిటికీ తలుపుల మీద, గోడలమీద ఒకచోటేమిటి, ఆ పెట్టెలో ఎటు చూసినా చిక్కని ఎర్రటి రక్తం. హంతకులెవరోగాని తాము దిగిపోయేటప్పుడు పంఖాల్ని వేసి, లైట్లు ఆర్పేసి దిగిపోయ్యారు. అలారం గొలుసుకు సూటుకేసొకటి వేలాడుతూ కనిపించింది వాళ్ళకు.

గార్డు ఈ విషయం పోలీసులకు తెలియజేసి, రైలు నుంచి వేరుచేసి ఆ పెట్టెను ప్రశాంతపూర్‌లోనే ఆపేశాడు. హుటాహుటినా పోలీసులొచ్చి విచారణ ప్రారంభించారు. వారు ఎందరు ప్రయాణీకుల్ని ప్రశ్నించినా ఈ విషయం గూర్చి ఎవరూ ఏమీ చెప్పలేకపోయారు. ఆఖర్న పాట్నా స్టేషనులో విచారిస్తే ఆ పెట్టెలోని రెండు సీట్లు ఓ గోస్వామి దంపతుల పేర్న రిజర్వయున్నాయని తెలింది. అలారం గొలుసుకు వేలాడుతున్న సూట్‌కేసును తెరచి చూస్తే అందులో రెండు కత్తులు, ఒక సుత్తి, ఒక జిప్ లెదర్ బాగ్ కనిపించాయి. నల్లగా నిగనిగలాడుతూ అందమైన ఆకారంలో ఉన్న లెదర్‌బాగ్ చూడముచ్చటగా వుంది. పోలీసులు ఆ పెట్టెను ఎంత గాలించినా ఎలాంటి వేలి ముద్రలూ కనిపించలేదు. హంతకుడు తన సూటుకేసును గొలుసుకు వేలాడదీసి, ఆ గొలుసు లాగి, లైట్లు ఆర్పేసి, పంఖాలు ఆన్‌చేసి రైలు ప్రశాంతపూరు స్టేషనులో ఆగబోతూంటే అందులోంచి దూకి పారిపోయ్యాడని మాత్రం తెలింది. అయితే 'ఎవరా హంతకుడు?, ఎవర్ని హత్యచేశాడు?' అన్న ప్రశ్నలకు ప్రశాంతపూర్ స్టేషన్‌లోనివారెవ్వరూ సమాధానాలివ్వలేకపోయ్యారు.

ఈ సంఘటన జరిగిన కొద్ది రోజుల తర్వాత వంతెనకు కొద్ది మైళ్ళ దిగువనున్న గ్రామంలోని ఓ బెస్తతను చేపలుపట్టుకుంటూ ఉండే, బాగా ఉబ్బిపోయి కుళ్ళిపోతున్న ఓ శవం నదిలో కొట్టుకురావటం అతనికి

కనిపించింది. పరుగెత్తుకు పోయి అతనీ విషయం పోలీసులకు చెపితే వారాశవాన్ని బయటికి లాగి పరీక్షకు పంపేరు. ఆ శవం ఒక స్త్రీదనీ, తలమీదా, మొహం మీదా బరువైన రాయితోగానీ, సుత్తితోగానీ బలంగా కొట్టటంవల్ల ఆమె మరణించిందనీ ఆ పరీక్షలో తేలింది. సూటుకేసులోవున్న జిప్‌బాగ్‌ను తెరచి చూస్తే దాని లైనింగు అడుగున పెన్సిలుతో రాసిన రెండు అక్షరాలేవో అస్పష్టంగా కనిపించాయి. పోలీసువాళ్లు పాట్నా నగరంలో ఇలాంటి సంచులని అమ్మే షాపులన్నింటినీ తిరిగి, ఈ సంచిని వాళ్లెవరైనా గుర్తిస్తారేమోనని ప్రయత్నించారు. కాని లాభంలేకపోయింది

ప్రతి షాపు యజమానినీ, అతని పని వాళ్ళనీ కలుసుకుని, ఈ సంచిని చూపి వాళ్ళనుండి సమాచారం రాబట్టటానికి ప్రయత్నించటం, వాళ్లెలాంటి సమాచారాన్ని ఇవ్వలేకపోవటం, నిరాశగా వెనక్కి రావటం—పోలీసులకిది మామూలయిపోయింది. అయినా వాళ్లెంత మాత్రం తమ ప్రయత్నం మానలేదు. ఇలా రోజులు... వారాలు...నెలలే గడిచాయి. ఫలితం మాత్రం కనిపించటం లేదు. అయినా వాళ్లు తమ పనిని సాగిస్తూ వచ్చారు. అనుకోకుండా పాట్నాలోని ఓ చిన్న షాపు యజమాని ఆ సంచి లైనింగు అడుగునవున్న పెన్సిలు రాత చూసి కొన్ని నెల్ల క్రితం దాన్ని తనో యువదంపతులకమ్మినట్టు చెప్పాడు. తన షాపుకి రోజూ ఎందరో ఖాతాదార్లొస్తున్నా ఈ దంపతులలో ఓ ప్రత్యేకతున్నందు వల్ల వాళ్లు తనకింకా జ్ఞాపకమున్నారన్నాడు. ఏమంటే దంపతులలోని భార్య మూగదే కాక చెవిటిది కూడాను. ఆమె భర్త ఆమెతో సంజ్ఞలతో మాట్లాడ్డం తన కిప్పటికీ గుర్తుందన్నాడు. అతనిచ్చిన ఈ సమాచారానికి పోలీసులు సంతోష పడినా 'ఎవరీ దంపతులు? ఎక్కడుంటారు వీళ్లు?' అన్న ప్రశ్నలు మళ్ళీ వాళ్ళను వేధించటం మొదలెట్టాయి. ఇక ఈ కేసు ముడి విప్పటం అసాధ్యమేమోనని పోలీసుల కనుమానం వెయ్యటం మొదలయింది. అయినా వాళ్లు తమ ప్రయత్నాల్ని మాత్రం మానలేదు.

ఇదిలా వుండగా...

ఒకసారి పాట్నా నగరంలో రద్దీగా ఉండే బస్తీలో ఓ ఇంటికి నిప్పంటుకుంది. ఇది విద్రోహచర్యేమోనని పోలీసులు ఆ ఇంట్లోని వారి నొక్కొక్కర్ని ప్రశ్నిస్తూ తమ విచారణ ప్రారంభించారు. ఆ ఇంట్లోని ప్రతి ఒక్కర్నీ యక్ష ప్రశ్నలు వేసి వారినుంచి సమాధానాల్ని సేకరిస్తున్నారు. ఆ ఇంట్లోని నలుగురితో పాటు ఒకతన్ని ప్రశ్నిస్తూ నీ పేరేమిటని మామూలుగానే అడిగారు. అతనిచ్చిన సమాధానానికి పోలీసులలో [illegible] లేచింది. అయినా పైకి మాత్రం ఏమాత్రం తొణక్కుండా అతి సాధారణంగా అతన్ని ప్రశ్నిస్తూ వచ్చారు. నీ పేరేమిటని అడిగితే అతను 'బాబూ గోస్వామి' అని చెప్పాడు. దానితో పోలీసుల ప్రశ్నల పరంపర ఇంకో విధంగా సాగింది. అతి నైపుణ్యంగా వాళ్లు అతని దగ్గర్నుంచి తమక్కావలసిన సమాచారాన్ని సేకరించారు. గోస్వామి పోలీసుల కిచ్చిన సమాచారంలో తమ ఆఫీసులోని ఓ జూనియర్ అధికారి భార్యకు చెవులూ, నోరూ రెండూ లేవని చెప్పాడు. శరీరం బాగులేనందువల్ల ఈమధ్య ఆమె అలహాబాదు దగ్గరున్న తన తల్లిగారింటికి వెళ్ళిందని అన్నాడు.

వాళ్లు అతన్ని ఇంకా నిశితంగా ప్రశ్నిస్తే ఆ అధికారి పేరు బలరాంసిన్హా అనీ,అతను మధ్యతరగతివారుండే బస్తీలో ఉంటున్నాడనీ, భార్య వెళ్ళిందగ్గర్నుంచీ అతనితో గోధుమరంగులో మెరిసిపోయే ఓ యువతి వుంటోందనీ, ఆమె పేరు ప్రీతిమాసింగ్ అనీ చెప్పాడు.

ఇంకేముంది! పోలీసులు బలరాంసిన్హాను అరెస్టుచేసి కస్టడీలో వుంచారు. బలరాంను చూసిన షాపు యజమాని తను జిప్‌బాగ్‌ను అమ్మింది ఇతనికేనని గుర్తించాడు. బలరాం ఇంట్లోని పనిమనిషి కూడా ఆ సంచీ తన యజమానురాలు బిమలదేనని, ఆమె మూగదేగాక చెవిటిది కూడాని చెప్పింది. ఇన్ని సాక్ష్యాలుండటంతో బలరాం తన నేరాన్ని ఒప్పుకోక తప్పింది కాదు.

తను బిమలను పెళ్ళాడింది ఆమె తెచ్చిన కట్నంకోసమేగాని ఆమె అందం కోసం కాదని ఒప్పుకున్నాడతను. ఆమెతో ఇష్టంలేని కాపురం చేస్తున్న తనకోసారి ప్రీతితో పరిచయమయిందనీ, అప్పటినుంచి బిమలతో తన దాంపత్యం కుంటుబడిందనీ అన్నాడు. ప్రీతితో తన వ్యామోహం పెనవేసుకుపోయేకొద్దీ బిమలతో తన అనుబంధం అర్థంలేనిదైపోయింది. బిమల తన సుఖ జీవనానికి ఓ ప్రతిబంధకమనిపించసాగింది. పైగా ప్రతిరోజూ ప్రీతి తన్ను పెళ్ళాడమని బలరాంను వేధించసాగింది. అతనా విషయాన్ని అంతగా పట్టించుకోకపోవటంతో ప్రీతి ఒకసారి తెగించి తన్ను పెళ్ళాడితేనే అతనితో ఉంటానని, లేని పక్షంలో తెగతెంపులు చేసుకుపోతానని నిక్కచ్చిగా చెప్పేసింది.

రోజూ తనని వెచ్చని సుఖాలతో ముంచెత్తే ప్రీతిని వదులుకోవటమా? అసాధ్యమనిపించిందతనకి 'మరెలా?' అని ఆలోచిస్తున్న అతనికి 'బిమలనువదిలించుకుంటే?' అన్న ఆలోచనొచ్చింది.

ఇందుకు అతనో పథకం వేసుకున్నాడు. తనకింద పనిచేసే గోస్వామి పేరిట అలహాబాదుకు రెండు ఫస్టుక్లాసు టిక్కెట్లు కొని తన భార్యతో బయలుదేరాడు బలరాం. రైలు శరావతి వంతెన మీదికొస్తూండగా సుత్తెతో బిమల తల మీదా, మొహం మీదా బాది హత్యచేశాడు. సూటుకేసులోని గుడ్డల్ని తీసేసి, అందమైన జిప్‌బాగ్‌ను మాత్రం తన ప్రేయసి ప్రీతికి బహుకరిద్దామని దాచాడు. ఎక్స్‌ప్రెస్ రైలు వంతెనమీదికొస్తూనే బిమల శవాన్ని రైల్లోంచి నదిలోకి తోశాడు. శవం నీళ్ళలో పడిన శబ్దం పరుగెడుతున్న రైలు హోరులో ఎవ్వరికీ వినిపించలేదు. రైలు వంతెన దాటిపోయేలోగా అందులోని ప్రయాణికుల సంఖ్యలో ఒకటి తగ్గిందని ఎవ్వరికీ తెలీదు.

బలరాం ఆ పెట్టెలోని తన వేలిముద్రల్ని బాగా తుడిచేసి, రైలు ప్రశాంతపూర్ చేరబోతూంటే అలారం గొలుసుకు సూటుకేసు వేలాడదీసి, అ బరువుకు తోడు తన శక్తినంతా ఉపయోగించి గొలుసు లాగాడు. పెట్టెలోని లైట్లను ఆర్పి, పంఖాల్ని ఆన్ చేశాడు. పెట్టెనిండా పడున్న రక్తం త్వరగా ఆరటానికే పంఖాలు వేశాడని తెలుస్తూనే వుంది. ఆగబోతున్న రైలులోంచి దూకి పరారయ్యాడు. కాని ఆతొందర్లో ఖంగారుపడిపోయి సూటుకేసునలాగే రైల్లో మర్చిపోయ్యాడు. పొరపాటే అతన్ని పట్టించి ఉరిశిక్ష వేయించింది. *

# భయం

క్యాష్ బ్యాగ్ జిప్ లాగుతూ ఓసారి చుట్టూ కలయచూశాడు సుబ్బారావు. వచ్చిపోయే కష్టమర్స్‌తో బాంకు చాలా రద్దీగాఉంది. కొందరు డబ్బును డిపాజిట్ చేస్తూ, మరికొందరు డ్రా చేసుకొంటూ ఎవరి పనుల్లో వాళ్ళు మునిగిపోయి ఉన్నారు. సుబ్బారావు తనకు కావలసిన డబ్బును డ్రా చేసుకొని జాగ్రత్తగా క్యాష్‌బాగులో పెట్టుకొన్నాడు.

తను ఆ డబ్బును తీసుకోవడం, బాగులో సర్దుకోవడం.. ఇదంతా ఏ రౌడీయైనా గమనించి ఉంటే...

అలా ఆలోచించగానే సుబ్బారావుకు వణుకుపుట్టింది. నడిబజార్లో డబ్బ కోసం జరిగిన హత్యలు, దోపిడీలు... వార్తాపత్రికల్లో చదివినవన్నీ గుర్తుకు రావడంతో గుండెలు దడదడా కొట్టుకోసాగాయి.

కొంతమంది దొంగ వెధవలు సరాసరి బాంకుకే వచ్చి ఎవరయినా ఎక్కువ మొత్తం డ్రా చేసుకొంటుంటే గమనించి, మెల్లగా అతడిని ఫాలోఅయి, ఏ సందులోనో అతడిని సఫాచేసి క్యాష్‌బాగు పట్టుకొని పారిపోతారని తన పక్కింటి పరంధామయ్య ఓ సారి చెప్పిన విషయం గుర్తుకొచ్చేసరికి అతనికి ముచ్చెమటలు పోశాయి. పైగా అతడు స్వతహా భయస్తుడు కూడా.

బాగ్ గట్టిగా పట్టుకొని బాంకులోంచి బయటపడుతూ తను డబ్బును డ్రా చెయ్యడం ఏ రౌడీ వెధవైనా గమనించాడేమోనని సందేహంగా ఓసారి అటూ ఇటూ చూసిన సుబ్బారావుకు తననే గమనిస్తున్న ఓ పొడవైన వ్యక్తి కన్పించాడు. అతడు కాస్త లావుగా, ఉంగరాల జుట్టుతో, కొంచెం పెరిగిన గడ్డంతో.. అచ్చం డబ్బుకోసం మనుషుల్ని చీమల్లా చంపి పారేసే హిందీ సినిమా విలన్‌లా కన్పించాడు సుబ్బారావుకు.

గబుక్కున ముఖం తిప్పుకొని రోడ్డు మీద కొచ్చాడు సుబ్బారావు.

రోడ్డుమీద నడుస్తూ తనను ఎవరైనా ఫాలో అవుతున్నారేమోనని ఓరకంటితో



చూసిన సుబ్బారావుకు గుండెల్లో రైళ్ళు పరుగెత్తసాగాయి. ఇందాకా బ్యాంకులో సుబ్బారావుని గమనించిన ఆ గడ్డం మనిషి సుబ్బారావువెంటే నడుస్తున్నాడు.

తన అంచనా తప్పుకాదు. వీడు

# కతలు

నిజంగా తన డబ్బు కొట్టెయ్యడానికే తనను వెంబడిస్తున్నాడు. సినిమాలో లాగా వీడు కూడా తనను...

అలా ఊహించగానే సుబ్బారావు శరీరమంతా కంపించసాగింది.

సుబ్బారావు అడుగులు వేగంగా వేస్తున్నాడు.

తను ఎలాగైనా ఈ దొంగ వెధవను పోలీసులకు పట్టించాలి. తను పోలీస్ స్టేషన్ ఉండే వీధిలోకి తిరిగితే...ఈ



దొంగ వెధవ కూడా తనవెంటే వస్తాడు. పోలీస్ స్టేషన్ ముందుకు వెళ్ళేసరికి... తను గబుక్కున స్టేషన్‌లోకి దూరి యస్. ఐ. తో చెప్పి ఈ రౌడీ వెధవను లోపల తోయించెయ్యాలి.

వీధి మలుపు తిరిగాడు సుబ్బారావు. ఆ వీధి చాలా పొడవు. స్టేషన్ వీధి చివర్లో ఉంది. అదేంచిత్రమోగానీ ఆ సమయంలో ఆ వీధిలో ఎక్కువ జనసంచారం కూడా లేదు.

సుబ్బారావు వేగంగా అడుగులేస్తున్నాడు. ఆ గడ్డం మనిషి కూడా వేగంగా వస్తున్నాడు. ఇదంతా గమనిస్తున్న సుబ్బారావు ఒళ్ళుచెమటతోతడిసిపోతోంది. గడ్డం మనిషి సుబ్బారావు దగ్గరికొచ్చేచాడు.

"ఏమండీ ఆగండి" అని ఆ గడ్డం మనిషి అరవడంతో సుబ్బారావు ఆగిపోయాడు.

అతడి ఒంట్లో ఒక్కసారిగా రక్తస్రావం ఆగిపోయినట్లన్పించింది. గట్టిగా అరుద్దామనుకొన్నాడు

"భలే పెద్దమనిషండీ మీరు. బాంకులో నా దగ్గర పెన్ తీసుకొని తిరిగి ఇవ్వకుండా చెక్కేస్తున్నారేమిటి?" అంటూ ఆ గడ్డం మనిషి సుబ్బారావు చేతిలో ఉన్న తన పెన్‌ను లాక్కొని వెళ్ళిపోతుంటే...

గుండెల నిండుగా ఊపిరి పీల్చుకొని నిలబడిపోయాడు సుబ్బారావు.

—వీరపల్లె వీణావాణి

# ఐడియా

తహసీల్దారుగారు అర్జంటుగా నాయర్‌ని పిలిపించారు. నాయర్ రెక్కలు కట్టుకోకుండానే తహసీల్దారుగారి ముందు వాలాడు.

"ఊరికే పిలవరు మహానుభావులు.." సంగతేమిటో చెప్పమన్నట్టు తహసీ

ల్దారు గారి మొహంలోకి దేవతలగురువు చూసిన లెవల్లో చూశాడు నాయర్.

"అర్జంటుగా చాలా డబ్బు కావాలి. ఏదైనా ఐడియా చెప్పు" తహసీల్దారుగారు సంగతి వివరించారు.

ఇలాంటి వ్యవహారాల్లో నాయర్ మహా ఘటికుడు. నవగ్రహాలను గోళీకాయలుగా మార్చి ఆటలాడుకోగల తెలివితేటలను నాయర్ చిన్నప్పుడే స్వంతం చేసుకున్నాడు. ఏకంగా తిరుపతి శ్రీ వెంకటేశ్వరుడితో చీట్లపేక ఆడి అతగాణ్ని ఒకే ఒక్క రౌండ్‌లో దివాలా తీయించగల ప్రతిభ కూడా నాయర్‌కుందంటే అది ఎంతమాత్రం అతిశయోక్తి కానేరదు.

కేటాయించిన క్షణంలో అరవయ్యోవంతు సమయం మాత్రం ఆలోచించి చటుక్కున ఇలా అన్నాడు నాయర్—

"పక్కనే వున్న పల్లెటూళ్ళో పశువుల కోసం, ప్రజలకోసం అత్యవసరంగా చెరువు తవ్వించవలసిన అవసరం నెత్తిమీదవుందని కలెక్టర్‌కు అర్జీపెట్టి సొమ్ము గ్రాంటు చేయించండి. లేకపోతే రోజుకు నూరు పశువులు,డజను మనుషుల చొప్పున దాహంతో నోరెండిపోయి చచ్చే ప్రమాదం వుందని చెప్పండి. అలా గనుక జరిగితే దేశంలో నీళ్ళవిప్లవం చెలరేగి ప్రభుత్వాన్ని ముంచేయగలదని భయపెట్టండి. జనం గగ్గోలు పెట్టేస్తున్నారు,'చెరువో... చెరువు' అంటూ నిద్రలోనూ పలవరిస్తున్నారని చెప్పండి"

"మనం స్నానం చేయటానికా ఈ చెరువు" తహసీల్దారుగారు కాస్త వ్యంగ్యంగా అన్నారు.

"అబ్బే చెరువులో కాదు,పచ్చనోట్లతో స్నానం చేయడం కోసం"

"ఎలా?"

"చెరువు డబ్బుల్లో మనకు చెరిసగం. చెరువును మాత్రం తప్పకుండా కాగితాల మీద తవ్విస్తాం"

తహసీల్దారుగారు అలాగే చేశారు. సంవత్సరం తరువాత ఆయన ట్రాన్స్‌ఫర్ అయి మరో ఆయన వచ్చాడు. వచ్చీ రాగానే పాత తహసీల్దారు తవ్వించిన చెరువు చూడాలన్నాడు.

నాయర్ అతడి గతకాలపు చెరువు గాథనంతటినీ వినిపించాడు. "మీరూ జాగ్రత్తపడండి" అంటూ ఆయనకూ ఓ ఐడియా చెప్పాడు.

"పాత తహసీల్దారు తవ్వించిన చెరువు వల్ల దోమలు కోటాను కోట్ల సంఖ్యలో పుట్టుకొచ్చి అందరినీ పీక్కుతింటున్నాయనీ, ఈ పరిస్థితి ఇలాగే కొనసాగితే మొత్తం రాష్ట్రానికే మలేరియా ప్రమాదం వుందనీ అర్జీ పెట్టండి.ఆ చెరువు వెంటనే పూడ్పించటానికి సొమ్ము గ్రాంటు చేయించండి" నాయర్ అన్నాడు.

"దీనివల్ల మనకేమిటి లాభం?" కొత్త తహసీల్దారు అమాయకంగా అడిగాడు.

"మీ మూడో అమ్మాయిగారి పెళ్లి చేయవద్దా?"

"దానికీ, దీనికీ ఏం సంబంధం?"

"ఆ సొమ్ము మనకొచ్చేస్తుంది. అసలు చెరువే లేదు గనుక పూడ్పించవలసిన అవసరం అసలే లేదు. మనం మన జేబులోని డబ్బు జేబుల్లోనే వుంచుకుంటే సరిపోతుంది" నాయర్ జ్ఞానబోధ చేశాడు.

"గుడ్ ఐడియా...నువ్వు అపర చాణుక్యుడివయ్యా" అంటూ కొత్త తహసీల్దారు ఎగిరి జీపులోపడి కలెక్టర్ ఆఫీసు వైపు ఎగిరిపోయాడు ఫైలుతోసహా *

# ఆంగ్ల సాధ్వి

ఆంగ్ల సాధ్వి ... ఏమిటి? అసలు ఆంగ్ల దేశంలో సాధ్వి అనే మాటకు స్థానమే లేదు గదా! సంవత్సరానికి ఒకణ్ని పెళ్లాడే ఆంగ్లవనితలు సాధ్వులు ఎలా అవుతారు?' అని మీరు తార్కిక వాదాన్ని లేవదీయవద్దు. మా పక్కింటి మీనాక్షిని చూస్తే అలాంటి పదాన్ని నేను అనివార్యంగా సృష్టించవలసి వచ్చిందని మీరే ఒప్పుకుంటారు.

మీనాక్షి పొట్టని వజ్రాయుధంతో చీల్చి చెండాడినా అక్షరం ముక్క అనేది దొరకదు. కానీ ఆవిడకు ఇంగ్లీషు మాట్లాడాలని మహా సరదా. ఆవిడ తన సరదాలో ఒక భాగంగా పక్కింటి కాన్వెంటు కుర్రదాన్ని కాకా పట్టి ఇంగ్లీష్ నేర్చుకోవాలని యమయాతన పడి పోతుంది. కానీ ఒక్క ముక్క కూడా ఆవిడకు వంట పట్టటం లేదు. అయినా ఆవిడ అంతా వచ్చేసిందనుకుంటోంది.

ఒకరోజు మీనాక్షి చెంపలకు అరచేతి మందం పౌడర్ పట్టించి, పెదాలను లిప్ స్టిక్ కేకులో ముంచి, స్లీవ్ లెస్ జాకెట్టు ధరించి, బొడ్డుకిందకి చీరకట్టి, హైహీల్స్ వేసుకుని షాపింగ్ కోసమని ఓ పెద్ద బట్టల షాపులోకి వెళ్లింది. ఆంగ్ల వనితలా వయ్యారాలు వలకబోస్తూ బేరం చేయకుండానే బట్టలు కొనేసింది. ఆ తరువాత షాపువాణ్ని ఆజ్ఞాపిస్తున్న ధోరణిలో "త్వరగా 'రేప్' చేయండి" అంది. షాపువాడు ఆ మాట విని నిలువు గుడ్లు వేసి చూస్తుంటే మీనాక్షి చిరాకుపడి పోతూ "నాకు అవతల మహిళామండలి కార్యక్రమాలు బోలెడున్నాయి. ప్లీజ్ త్వరగా 'రేప్' చేసేయండి" అంటూ అరిచినంత పనిచేసింది.



అదృష్టవశాత్తూ అదే టైముకు మీనాక్షికి ఇంగ్లీషు నేర్పే కుర్రది అటు వచ్చింది. గుడ్లు తేలవేసి నిలుచున్న షాపువాడి దగ్గరకు వెళ్ళి 'రేప్' అంటే 'పేక్' అని ఆవిడ అర్థం-అని వివరించే సరికి తలప్రాణం తోకకొచ్చేసింది. అందుకే మీనాక్షిగారు చాలా పెద్ద ఆంగ్ల సాధ్వీమణి సుమా ... అంటారందరూ.

—గౌస్

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly. Eenadu Compound, Hyderabad - 500 004.

Telugu Monthly, Hyderabad-500 004. Regd No. H/HD 1452

